*Islam lo Maguva (Telugu)*

# ఇస్లాంలో మగువ

ఉర్దూ మూలం

మౌలానా సయ్యిద్ జలాలుద్దీన్ ఉమరీ

తెలుగు అనువాదం

తహసీన్ హుమైరవీ

# ఇస్లామ్‌లో మగువ

## తొలి ముద్రణ పీఠిక

ప్రస్తుత కాలంలో ఇస్లాంపై కొన్ని అపార్థాల మబ్బులు కమ్ము కున్నాయి. మరికొన్ని అభూత కల్పనలు కల్పించబడుతున్నాయి. ఇస్లాం స్త్రీకి పురుషునితోపాటు సమాన స్థాయి కల్పించలేదని, అది ఆమె కృషిపై ఆంక్షలు విధించిందనీ, దానివల్ల ఆమె జీవన పరుగు పందెంలో తప్పని సరిగా వెనుకపడిపోవల్సివస్తుందని, నిరంతరం మగాడి ఆధిపత్యం కింద దైన్యంగా పడి నలిగిపోవల్సిందేనని ఓ అభూత కల్పన కల్పించటం జరిగింది.

వాస్తవానికి ఇస్లాం అందరికంటే ముందు స్త్రీ పురుషుల సమాన తను చాటే జెండాను చేబూనింది. దైవం దృష్టిలో స్త్రీ పురుషులిరువురూ సమానమనీ, వారి జయాపజయాల మూల నియమం కూడా ఒక్కటేనని స్పష్టం చేసింది. 'స్త్రీ పురుషులిద్దరూ ఒకే మైదానంలో కలిసి పని చేయనంతవరకు సమానత సాధ్యపడద'న్న ప్రస్తుత సమాజంలోని సమానతా భావనను మాత్రం అది తప్పు పడుతుంది. స్వాభావికంగా ఇద్దరి కార్య పరిధులు వేరు కాబట్టి స్త్రీకి ఇంటి బాధ్యతలు, మగవానికి వెలుపలి బాధ్యతలు నిర్వర్తించమని అది అంటుంది. ఆచరణాత్మకమైన జీవన మనుగడలో న్యాయమైన వారి అవసరాలు తీరాలనీ, ఎవరికీ ఏ విధం గానూ అన్యాయం జరగక్కుండా ఉండేందుకు, అది వారిరువురికై

హక్కులు, బాధ్యతలను వేర్వేరుగా నిర్ధారించింది. దానికై వారిని కట్టడి చేసింది.

ఈ అంశంపై కొన్నేళ్ళ క్రితం నేను ఉర్దూలో రాసిన ఓ సమగ్రమైన పుస్తకం ప్రచురితమైంది. మీ ముందున్న ఈ పుస్తక అంశం కూడా ఇదే. తొలి పుస్తకంలో క్లుప్తంగా ఉండిపోయిన కోణాలూ, సంక్షిప్తంగానే సూచించిన వాదనలు, ఇంకా చూపోపు వహించిన వాటిని ఇందులో విస్తారంగా విశదపరచటం జరిగింది.

మునుపటి పుస్తకంలో వాడబడిన విషయ సామగ్రిని ఇందులో వీలైనంతగా వదిలివేయటం జరిగింది. చాలావరకు కొత్త విషయాలను పొందుపరిచే ప్రయత్నం చేయబడింది. మునుపటి పుస్తకంలో ఎక్కువగా సూత్రప్రాయమైన వాదనే ఉంది. ఇందులో ప్రతి వాదనకు ముందు ఖుర్ఆన్, హదీసు బోధనలు, చాలా ముక్తసరిగా ప్రస్తావించటం జరిగింది. ఆపై హదీసులు, ప్రవక్త(స) ఇతిహాసం, చరిత్ర నుండి విశ్వసించదగిన సంఘటనలు, ఆచరించదగిన నిదర్శనాలు వాదనను బలపరిచే విధంగా సమకూర్చటం జరిగింది. ఇలా ఈ రెండు పుస్తకాలు ఒకే అంశానికి చెందినవైనప్పటికీ ఒకదానికొకటి పరిపూర్ణతనిచ్చేవిగా ఉన్నాయి.

మునుపటి కాలం మనకు ఆదర్శం. కనుక ఆ కాలానికి సంబంధించిన సంఘటనలు ఇందులో ఎక్కువగా ఉన్నాయి. తదుపరి కాలానికి సంబంధించి చాలా అరుదుగా ఉదాహరణలివ్వటం జరిగింది. అక్కడక్కడ ధర్మశాస్త్రానికి సంబంధించిన సమస్యలు కూడా ప్రస్తావించబడ్డాయి. ఈ క్రమంలో ధర్మశాస్త్ర పండితుల పద్ధతి నియమాలను ప్రస్తావించలేదు. వాటి కోసం ధర్మశాస్త్ర గ్రంథాల వైపు మరలాల్సిందే.

ఇందులో తీసుకోబడిన విషయాలు ప్రామాణికమైనవి, యదార్థమైనవి. పూర్తి పుస్తకం ఖుర్ఆన్, హదీసు, సీరత్ వెలుగులో రాయబడింది.

ఆధారం లేని ఏ విషయాన్నీ ప్రస్తావించలేదు. అయినప్పటికీ తప్పులు దొర్లే అవకాశం ఉంది. ఎవరికైనా లోపం కనిపిస్తే దయచేసి తెలియజేయండి. ఇన్షాఅల్లాహ్ ఇక మీదట వాటిని సరి చేసుకోవచ్చు. దీనికై ఈ అశక్తుడు కృతజ్ఞుడై ఉంటాడు.

ఈ ఏట (క్రీ.శ. 1979) అంతర్జాతీయ పరంగా మహిళా దినోత్సవం నిర్వహించబడుతుంది. ఈ సందర్భంగా మహిళల గురించి ఇస్లాం బోధనలు, ముస్లిం వనితలు చేసిన ధైర్యసాహసాల గురించి ప్రత్యేకంగా పరిచయం చేయాలని జమాఅతె ఇస్లామీ హింద్ తీర్మానించింది. ఇందుకు ఈ పుస్తకం ఉపయోగకరంగా ఉంటుందని ఆశిస్తున్నాను. దైవం దీనికి అంగీకార యోగ్యతను ప్రసాదించాలనీ, దీనివల్ల ఉత్తమ రీతిలో ధర్మపరిచయం జరగాలనీ, మునుపటి కాలానికి చెందిన మగువల్లో ఉన్న ఉత్సాహం, ఆచరణా భావన, ప్రజ్ఞా పాటవాలు మన మహిళల్లో కూడా తిరిగి రావాలని వేడుకుంటున్నాను. (ఆమీన్)

**– జలాలుద్దీన్ ఉమరీ**

28 ఫిబ్రవరి, 1979

# నూతన ముద్రణ

ఈ పుస్తకం తొలిసారిగా ముప్పై ఏళ్ళ క్రితం ప్రచురించబడింది. మహిళా సంవత్సరీకం సందర్భంగా భారీ ఎత్తున పరిమాణంలో ప్రాచుర్యం కూడా పొందింది. తర్వాత దీని తొమ్మిది ఎడిషన్లు కూడా వచ్చాయి. ఇంగ్లీషు, హిందీ, మరాఠి, తెలుగు భాషల్లో దీని అనువాద ముద్రణ మొదలైంది. మహిళలకు సంబంధించిన కొన్ని విద్యాలయాల్లో దీన్ని సిలబస్‌గా కూడా చేర్చారు. ఈ తడవ దీన్ని క్షుణ్ణంగా పునః పరిశీలించడం జరిగింది. చర్చను పొందికైన అధ్యాయాల్లో విభజించాం. దీని ప్రమాణాలను పరిశీలించాం. నూతనంగా వెలువడిన మూల పుస్తకాల ఎడిషన్స్‌కి అనుగుణంగానే దీని ప్రమాణాలను పొందుపరిచే యత్నం చేశాం. ఆధునిక కాలంలో ముస్లిం మహిళల ఉద్యోగానికి సంబంధించిన ప్రశ్నకు జవాబు కూడా పుస్తకం చివర్లో చేర్చటం జరిగింది. ఈ ప్రయత్నాల వల్ల పుస్తకం విలువతోపాటు మరింత లాభసాటిగా పరిణమిస్తుందని భావిస్తున్నాను. ఇంతవరకు తొలి ముద్రణలో ఉన్న ప్రతినే అచ్చుయ్యేది. ఈ తడవ 'మర్కజీ మక్తబా ఇస్లామీ పబ్లిషర్స్ (న్యూఢిల్లీ) వారు దీన్ని మరింత జాగ్రత్తగా ప్రచురిస్తున్నారు. బ్రదర్ డాక్టర్ ముహమ్మద్ రజియుల్ ఇస్లాం నద్వీ, సోదరుడు ఆరిఫ్ ముస్తఫా నద్వీలకు కృతజ్ఞుడ్ని. వీరిద్దరు ఒకటికి రెండుసార్లు ఈ పుస్తకాన్ని ప్రూఫ్ రీడింగ్ చేశారు. అవసరమైన చోట ప్రమాణాలను మరోసారి నిశితంగా పరిశీలించారు. మూల విషయాన్ని క్రమబద్ధీకరించటంలో, గ్రంథాలను సమకూర్చటంలో వీరు సహాయ పడ్డారు. దైవం వారికి మంచి ప్రతిఫలం ఇవ్వాలనీ, వీరి విద్యావికాసాల్లో మరింత వృద్ధిని ప్రసాదించాలనీ వేడుకుంటున్నాను.

విధేయుడు

**జలాలుద్దీన్ ఉమరీ**

28 ఏప్రిల్, 2009

# స్త్రీ ఘనత- కుటుంబ నిర్మాణంలో ఆమె పాత్ర

క్రీస్తు శకం ఆరవ శతాబ్దిలో హజ్రత్ ముహమ్మద్(స) దైవదౌత్య ప్రకటన మానవ జాతి చరిత్రలోనే ఓ గొప్ప సంఘటన. దాని ఫలితంగా ప్రపంచ ఆలోచనా స్రవంతి మారిపోయింది. మనిషి కొత్తకోణంలో ఆలోచించటం మొదలెట్టాడు. అతని జీవితం కొత్త మలుపు తిరిగింది. దీనిలో భాగంగానే స్త్రీ పట్ల పూర్తిగా అతని ఆలోచనా సరళి, ప్రవర్తనా తీరు కూడా తారుమారయింది. ఇంకా ఆలుమగల సంబంధాలు నూతన మూలాలపై ఏర్పడ్డాయి.

## స్త్రీ బానిసత్వానికి వ్యతిరేకంగా ఇస్లాం నిరసన నినాదం

ఇస్లాం కన్నా మునుపు స్త్రీ చరితం అతి హీన దీనస్థితిలో ఉండేది. ఆమె అల్పురాలిగా, నికృష్టురాలిగా భావించబడేది. ఆమె చెడులకు, దుర్మార్గానికి మూల కారణంగా తలచబడేది. పాము, తేలు కాటు నుండి తప్పించుకునే విధంగా ఆమె నుంచి తప్పించుకోవాలని బోధించబడేది. ఆమెను అంగళ్ళలో పశువుల మాదిరిగా బేరసారం చేసేవారు. ఆమెకు ఏటువంటి స్థిర స్థానమూ ఉండేది కాదు. వాస్తవానికి ఆమె మగవాని దాసిగ్గా, ఎలాంటి హక్కులు లేకుండా ఉండేది. అతని దయాదాక్షిణ్యాలపై ఆధారపడి బతికేది. ఆమె బానిసత్వానికి ప్రతికూలంగా ఇస్లాం బలంగా

వేసిన చాటింపు ప్రపంచం నలుమూలలా ప్రతిధ్వనించింది. నేడు ఆమె మునుపటి స్థానమే సరైందనీ, న్యాయమైందనీ పలికే సాహసం, దమ్ము ఎవరికీ లేదు. ఇస్లాం తన పూర్తి సత్తువను ప్రదర్శిస్తూ అంది:

**'మానవులారా! మీ ప్రభువుకు భయపడండి. ఆయన మిమ్మల్ని ఒకే ప్రాణి నుంచి పుట్టించాడు. అదే ప్రాణి నుండి దాని జతను సృష్టించాడు. ఇంకా ఆ జంట ద్వారా ఎంతోమంది స్త్రీ పురుషులను అవనిలో వ్యాపింపజేశాడు. ఏ దేవుని పేరు చెప్పుకొని మీరు పరస్పరం మీ మీ హక్కులను కోరుకుంటారో ఆ దేవునికి భయపడండి. బంధుత్వ సంబంధాలను తెంచటం మానుకోండి. అల్లాహ్ మిమ్మల్ని పరికిస్తున్నాడనే విషయాన్ని తెలుసుకోండి.'** ***(అన్ నిసా :1)***

లోకం ఓ మనిషికి మరో మనిషికి మధ్య సృష్టించిన అజ్ఞానపు తారతమ్యాలన్నీ వ్యర్థమైనవిగా చెప్పటానికి ఈ వాక్యమే నిదర్శనం. ఈ హెచ్చుతగ్గులకి ఎటువంటి మూలాధారాలు లేవు. మానవాళి మొత్తం ఒకే ప్రాణి నుండి ఉనికిలోకి వచ్చింది. అందరిదీ ఒకే సారం. పుట్టుకతోనే ఎవరూ గొప్పవాడు, నీచుడు కాదు. అగ్రకులాలకో, నిమ్న కులాలకో చెందినవాడు కాదు. అందరూ సమానులే. సమాన స్థాయి కలిగినవారే. వంశం, తెగ, వర్గం,వర్ణం, దేశం, జాతి, భాష, వృత్తిపరంగా వారి మధ్య ఏ రకమైన భేదమూ సరైంది కాదు. అది సహించరానిది.

## స్త్రీ పురుషుల సమానత

పురాతన కాలం నుంచే వస్తున్న స్త్రీ పురుషుల మధ్య భేదం, తారతమ్యాలను ఇస్లాం పూర్తిగా నిషేధిస్తుంది. తొలి మానవుని జోడి మరే జాతి నుండో ఉద్భవించలేదు. స్వయాన అతని జాతి నుండే వచ్చింది. మరో సృష్టిరాశిని అతని సాంగత్యం కోసం తోడుగా పెట్టడం జరగలేదు.

ఆమె అతని నుండే సృజించబడింది. ఈ తొలి జోడి నుంచి ఎంతో మంది స్త్రీ పురుషులు పుట్టారు. వారి మధ్య బంధుత్వాలు సంబంధాలు ఏర్పడ్డాయి. ఆ విధంగా మానవాళి మొత్తం వ్యాపించింది. అందుకే వారి మధ్య వ్యత్యాసం, వివక్ష చూపడమంటే మానవాళి ఒక భుజానికి మరో భుజానికీ మధ్య వ్యత్యాసాన్ని హెచ్చుతగ్గులను సృష్టించటమే అవుతుంది. ఓ వస్తువులోని రెండు భాగాల మధ్య భేద భావం ఏర్పరచటమే అవుతుంది కదా! స్త్రీ పురుషుల సమానతను చాటేందుకు, వారిరువురు సమాన స్థాయి కలిగివున్నారని చెప్పేందుకూ ఇంతకంటే మంచి భావన గురించి ఆలోచించలేం కూడా!

దీంతోపాటు మానవులందరూ ఒకే దైవానికి దాసులనీ, ఒకే తల్లిదండ్రుల సంతానమనీ చెప్పబడింది. అందుకే ఓవైపు దైవదాస్యం చేస్తూ ధర్మనిష్టను అలవరుచుకొని భయభక్తులతో జీవించాలనీ చెబుతూనే మరోవైపు పరస్పరం వారి మధ్య ఉన్న బాంధవ్యాలను, సంబంధాలను గౌరవించాలనీ చెప్పటం జరిగింది.

## స్త్రీ పురుషుల సఫలత విశ్వాసం ఆచరణలతోనే ముడివడి వుంది

పురుషుడు ఉత్తముడు, గొప్పోడనీ, ఆడ జన్మ నీచమైందని, హీనమైందనీ భావించే తలంపును ఇస్లాం కూకటివేళ్ళతో పెకిలించింది. దాని దృష్టిలో స్త్రీ పురుషులిరువురూ సమానులే. శాశ్వతంగానూ స్థిరంగానూ ఎవరికీ ఔన్నత్య ప్రమాణ పత్రం రాయబడలేదు. అలాగే ఎవరినీ అల్పమైందని తీర్మానించనూలేదు. వారిలో విశ్వసించి సత్కర్మలు చేసినవారు ఇహపరలోకాల్లో సాఫల్యం పొందుతారు. ఈ సుగుణాలు లేనివారు రెండు చోట్లా పరాభవంతోపాటు వైఫల్యాన్ని చవిచూస్తారు.

**'పురుషుడైనా స్త్రీ అయినా సత్కర్మలు చేస్తే విశ్వాసి అయిన పక్షంలో మేము అతణ్ణి ప్రపంచంలో పరిశుద్ధ జీవితం గడిపేలా చేస్తాం. (పరలోకంలో) అటువంటి వారికి, వారి ఉత్తమ కార్యాలకు అను గుణంగా ప్రతిఫలాలను ప్రసాదిస్తాం.' *(అన్ నహ్ల్ : 97)***

మనిషి అదృష్టవంతుడనే నిర్ణయం అతని జాతిపై ఆధారపడి లేదు. విశ్వాసం ఆచరణలపైనే ఆధారపడి వుందని చాటేందుకు ఈ ఒక్క వాక్యం చాలు. ఎవరైతే విశ్వాసం, సత్కర్మల సంపదను మూటకట్టుకుంటాడో అతనికి ఈ లోకంలో పరిశుద్ధ జీవితం లభిస్తుంది. జీవితపు ఏ ఘట్టంలో నైనా అతను రుజుమార్గంపై నుండి వైదొలగడు, పెడత్రోవ పట్టడు. దైవం అతనికి ధర్మ సమ్మతమైన జీవనోపాధిని ప్రసాదిస్తాడు. ఆపదల్లో ఓపిక, సంతుష్టిని ఒసగుతాడు. అంతిమ దినం నాడు స్వర్గ ద్వారాలు అతని కోసం తెరచుకుంటాయి. అక్కడి శాశ్వత భోగభాగ్యాలకీ అతను హక్కుదారునిగా పరిగణించబడతాడు. ఇది సర్వసాధారణమైన సంప్రదాయం. ఇందులో ఆలుమగల మధ్య ఎలాంటి తేడా ఉండదు.

## స్త్రీ కార్య రంగం ఆమె ఇల్లే

నిస్సందేహంగా ఇస్లాంలో స్త్రీ పురుషుల కార్యాచరణ పరిధులు వేర్వేరు. స్త్రీ ఆచరణా పరిధి వాస్తవానికి ఆమె ఇల్లే. బయటి ప్రపంచం మగాడి లక్ష్యసాధన స్థలం. అందుకే దివ్యఖుర్ఆన్, ప్రవక్త(స) భార్యా మణులను ఆదేశిస్తుంది. ఈ ఆదేశం దైవాన్ని, దైవప్రవక్త(స)ను విశ్వసించే వనితలందరికీ వర్తిస్తుంది-

**'మీ ఇళ్ళల్లోనే (ప్రశాంతంగా) ఉండిపోండి.' (అల్ అహ్జాబ్ :33)**

ఇది మహిళలను తమ ఇండ్లలోనే నిలిచి ఉండమని చెప్పే ఆదేశం. దీనినిబట్టి ఆమె ఆచరణా పరిధి ఇల్లేనని అర్థమవుతుంది. ఆమె అనవసర

మైన ఇతర పనుల్లో లీనమై ఇంటి ప్రాథమిక బాధ్యతలను విస్మరించరాదని స్పష్టమవుతుంది.

## రెండు అభ్యంతరాలు- వాటి జవాబులు

స్త్రీ కార్యపరిధి ఆమె ఇల్లు, కుటుంబమనే ఇస్లాం వాదనపై సాధారణంగా రెండు అభ్యంతరాలు వ్యక్తమవుతాయి. ఇంటి బాధ్యతలు ఆమె నెత్తిపై రుద్దటం మూలాన ఆమె జీవనోపాధి కోసం శ్రమించ లేకపోతుందనీ, ఈ కోణంలో సమాజపరంగా ఆమె స్థానం మరుగున పడిపోతుందనేది తొలి అభ్యంతరం.

ఈ సందర్భంగా ఇస్లాం స్త్రీని ఉపాధి కోసం శ్రమించటాన్ని ఎంత మాత్రం నిరాకరించటం లేదన్న విషయం తొలుత తేటతెల్లం కావాలి. కాని కొన్ని పరిమితులను మాత్రం నిర్ణయించింది. ఈ పరిధుల్లో ఉంటూ ఆమె తనకు నచ్చిన జీవనోపాధిని ఎన్నుకోవచ్చు. కుటుంబ బరువు బాధ్యతల వల్ల ఆమె ఉపాధి మార్గం ప్రభావితం కాకమానదు. మగాడిలా తన సమయాన్ని, సత్తువను దీనికోసం పూర్తిగా వెచ్చించలేకపోతుందనేది జగమెరిగిన సత్యం. అందుకే ఇస్లాం ఆమె జీవనాధారపు పూచితోపాటు ఆమెను పోషించే బాధ్యతనూ చట్టబద్ధంగా మగాడిపై మోపింది.

స్త్రీపై మితిమీరిన ఇంటి బాధ్యతలు మోపినందువల్ల ఆమె నాలుగు గోడల మధ్య బంధించబడిందని, జీవితపు ఇతర కోణాల్లో ఆమె శక్తిసామర్థ్యాల వల్ల ఎలాంటి ప్రయోజనం లేకుండా పోతుందనీ, స్వయాన ఆమె కూడా మేలు చేయటానికి సిద్ధంగా ఉండదనేది మరో అభ్యంతరం.

ఇది సరైంది కాదు. ఇంటి వ్యవహారాలు తప్ప మిగతా పనులు ఆమె కోసం నిషిద్ధమని చెప్పటం ఇస్లాం అభిమతం ఎంతమాత్రం కాదు. దాని అసలు ఉద్దేశం ఆమె ఇంటికి మహారాణి, కార్యనిర్వాహకురాలని చెప్పటం

మాత్రమే. అంతేకాకుండా ఇంటి బయటి ప్రపంచాన్ని చక్కబెట్టే ఆలోచనలో ఆమె తనింటిని నిర్లక్ష్యం చేసుకోరాదు. ఆమె శక్తి సామర్థ్యాలపై బయటి వినోద విలాసాల ఆక్రమణ జరగరాదు. ఇల్లు ఓ విరామ స్థావరంగానో, సేద తీర్చుకొనే స్థలంగానో, కాసేపు విశ్రాంతి తీసుకొనే గుడారంలానో మారకూడదు. కుటుంబ ప్రాథమిక బాధ్యతలను నిర్వర్తించిన పిదప బతుకుదెరువు కోసం శ్రమించటంలో తప్పులేదు. ఆమె తన స్థితిగతులు, ఆసక్తి అభిరుచుల మేరకు ఇతర జీవన రంగాల్లో ఉల్లాసంగా పాలుపంచుకోవచ్చు. ముస్లిం మహిళలు తమ సహజ పరిధుల్లో ఉంటూనే సంఘ జీవనంలో విభిన్న రంగాల్లో తమ వంతు పాత్ర పోషించారు. గొప్ప గొప్ప ఘనకార్యాలెన్నో తలపెట్టారు దీనికి చరిత్రే సాక్షి.

మరో గొప్ప విషయమేమిటంటే, ఇస్లాం స్త్రీకి సమాజంలోనూ, సంఘంలోనూ సముచిత స్థానాన్ని కల్పించింది. దీనివల్ల ఆమె ఎటువంటి న్యూనతా భావానికి లోనుకాకుండా సగౌరవంగా, హుందాగా జీవిస్తుంది. పురుషులతో కలిసి పరిశుద్ధమైన పవిత్ర సమాజ నిర్మాణం కోసం తన శక్తి సామర్థ్యాలను వెచ్చిస్తుంది.

## కార్యపరిధులు వేరుగా ఎందుకుండాలి?

ఇస్లాం స్త్రీ, పురుషుల కార్యపరిధులను ఎందుకు వేర్వేరుగా నిర్ణయించిందో ఓసారి పరిశీలిద్దాం. దీనికి రెండు కారణాలున్నాయి.

### 1. మాన మర్యాదల పరిరక్షణ

దీనివల్ల తొలుత ఇరువురి మాన మర్యాదలకు రక్షణ కలుగుతుంది. ఒకే మైదానంలో ఇరువురు కలిసి పనిచేసినప్పుడు పవిత్రంగా జీవించటం కష్ట సాధ్యమవుతుంది. స్త్రీ, పురుషులు కలివిడిగా విద్యాలయాల్లో చదువు

కోవటం, పార్కుల్లో, మైదానాల్లో, ఆటపాటల్లో, వినోద విలాసాల్లో యథేచ్ఛగా పాలుపంచుకోవటం, స్వతంత్రంగా స్వేచ్ఛగా అంగళ్ళల్లో క్రయ విక్రయాలు జరపటం, ఏకాంతంలోనూ బహిరంగంగానూ అద్దూ అదుపూ లేకుండా, ఎలాంటి కట్టడులు లేకుండా కలుపుగోలుగా ఉండటం, అంతేకాకుండా ఈ పరంపర ఒకటిరెండు రోజులతో ఆగకుండా ఏళ్ళ తరబడి దీర్ఘకాలం జరుగుతూ ఉంది. ఇందులోనే బాల్యం నుండి యవ్వనం, యవ్వనం నుండి ముసలితనం వరకూ ఉన్న అన్నిఘట్టాలు పూర్తయితే తప్పనిసరిగా వారిలో లైంగిక ఆకర్షణ ఎగసి పడుతుంది. తమల్ని తాము అదుపులో ఉంచుకోలేకపోతారు. ఆపై సునాయాసంగా లైంగిక విశృంఖలత్వానికి దాసోహమంటారు.

ప్రస్తుత సమాజంలో స్త్రీ పురుషుల మిశ్రమం ఎక్కడైతే సర్వ సామాన్యమైపోయిందో అక్కడ దాని భయంకర పరిణామాలు చోటు చేసుకున్నాయి. అక్కడ మాన మర్యాదలు మంటగలిశాయి. లైంగిక విశృంఖలత్వం అంటువ్యాధిలా వ్యాపించింది. నేడు దాన్ని ఓ సామాజిక రుగ్మతలా పరిగణించటం జరిగింది. దాన్నుండి తప్పించుకోవటానికి మరోదారి లేదు గనక ఇష్టమున్నా లేకున్నా దాని చెడు పరిణామాలను చవి చూడాల్సిందేనన్న తలంపు వల్ల సంస్కరణ మరింత కష్టతరమై పోయింది.

సౌశీల్యం, పారిశుధ్యం కనిపించటానికి ఓ విలువైన సుగుణమే అయినా దీనివల్ల సమాజం మొత్తానికి దిశా నిర్దేశనం జరుగుతుంది. మాన మర్యాదలను పట్టించుకోని సమాజం మనిషిని నలువైపుల నుంచి లాగి వ్యభిచారం, రంకుతనం వైపు నెడుతుంది. దీంతో ఒక ప్రత్యేకమైన సంస్కృతి, నాగరికత, సమాజం ఉనికిలోకి వస్తాయి.

దీని ఒక్కో వస్తువు మనిషిలోని కామపిపాసను మరింత రెచ్చ గొడుతూ, మంటరేపుతూ ఉంటాయి. దీనికి విరుద్ధంగా సౌశీల్యాన్ని గౌరవించి ప్రాధాన్యతనిచ్చే సమాజం మరో విధంగా ఉంటుంది. దాని ప్రతి పని సిగ్గుబిడియాలు, పవిత్ర సుగుణాలను బహిర్గతం చేస్తుంది. నలువైపులా పాపభీతితో కూడిన నిర్మల వాతావరణం ఉనికిలోకి వస్తుంది.

ఇస్లాం మాన మర్యాదల విషయంలో చాలా సెన్సెటివ్. అది స్త్రీ పురుషుల స్వేచ్ఛాయుత కలయిక, కలుపుగోలుతనానికి అంగీకరించదు. పరస్త్రీ పరాయి మగాడు తోడుగా కలిసి ఉండటాన్ని, కలిసి పని చేయటాన్ని, స్వయాన తమల్ని బయట పడలేనంతటి సంకటంలో ఇరికిం చుకోవటాన్ని అది తప్పుగా తలుస్తుంది. వ్యభిచారం, చెడుపనులను నిషేధించటమే కాకుండా వాటి దరిదాపులకు కూడా వెళ్ళవద్దనీ బోధిస్తుంది.

**'వ్యభిచారం దరిదాపులకు కూడా పోకండి. అది అతి దుష్టకార్యం, బహు చెడ్డ మార్గం.'** *(బనీ ఇస్రాయీల్ : 32)*

## 2. శక్తిసామర్థ్యాల తేడా

స్త్రీ,పురుషులకు రెండు వేర్వేరు కార్యపరిధులు నిర్ణయించటానికి మరో కారణం వారి శక్తిసామర్థ్యాలు ఒకరికొకరికి భిన్నంగా ఉండటమే. మహిళ శారీరకంగా పురుషుడికన్నా బలహీనంగా ఉంటుంది. ఆమె అధిక శ్రమ ప్రయాసలను భరించలేదన్నది నగ్నసత్యం. అదీగాక ప్రకృతి పరంగా ఆమెను వెన్నంటి ఉండే కొన్ని ఇబ్బందులు కూడా ఉన్నాయి. వాటివల్ల ఆమె నిరంతర శ్రమ, కఠిన పనులు చెయ్యలేకపోతుంది. ఆమె యవ్వన దశే నెలవారి నుండి మొదలవుతుంది. ముసలితనంలో ప్రవేశించేవరకు అది ఆమెను వెంటాడుతూనే ఉంటుంది. ఇంకా గర్భం దాల్చటం, పాలు

పట్టడం లాంటి కష్టతరమైన ప్రక్రియల నుండి పయనించవలసి వస్తుంది. ఇలాంటి స్థితులు ఆమె ఆరోగ్యాన్ని, స్వభావాన్నీ, శక్తిసామర్థ్యాలను ప్రభావితం చేస్తాయి. నిరంతర కృషి, శ్రమలకు అడ్డంకిగా నిలుస్తాయి. అందుకే ప్రకృతి వాంఛించేదేమిటంటే మగాడికన్నా తక్కువ భారం ఆమెపై మోపాలి. శ్రమ ప్రయాసతో కూడిన పనులు మగవానిపై మోపబడ్డాయి. తక్కువ బరువుతో కూడుకున్న పనులు ఆమె కోసం కేటాయించటం జరిగింది. అందుకే ఇస్లాం, స్త్రీకి ఇంటిని చక్కబెట్టే పని, మగాడికి ఇంటి వెలుపలి బాధ్యతలు నిర్వర్తించే పని అప్పజెప్పి సమస్యను సునాయాసంగా పరిష్కరించింది.

స్వయాన స్త్రీ స్వభావం, ఆమె నైజం, అభిరుచులు కూడా దీన్నే ప్రేరేపిస్తాయి. ఆమెలో ప్రేమానురాగాలు, సహకారం సానుభూతి, త్యాగం, దాతృత్వం, ఓర్పు, స్థైర్యం, శాంతం, మృదుత్వం ఇంకా అంకిత భావంతో పని చేసే ఆసక్తి మగాడికన్నా మెండుగా ఉంటాయి. వీటితో ఆమె తన పరిసరాలను ఆనంద నిలయంగా, శాంతిమయంగా ప్రేమానురాగాలతో నింపగలుగుతుంది. అలాగే జీవితంలో ఎదురయ్యే కష్టనష్టాలు, విపత్తులను ప్రతిఘటిస్తూ, ఒడిదుడుకులను అధిగమించటానికి మనిషిలో శ్రమించే గుణం, తలంపు, పట్టుదల, ధైర్యసాహసాలు తప్పనిసరి. ఈ సుగుణాలు మగవాడిలో మెండుగా ఉంటాయి. దీనికి భిన్నంగా ఇల్లు, కుటుంబం అనుకూలమైన, ప్రశాంత వాతావరణాన్ని తలపిస్తాయి. ఇందులో స్త్రీ సుగుణాలు మరింత నిగారింపుతో నిగనిగలాడుతాయి. వీటితో మరింత ప్రయోజనం పొందవచ్చు. జీవితపు చిక్కుముళ్ళు, కఠిన సమస్యలను మగాడు ఎదుర్కోగలడు. కనుక స్వాభావికంగా అతనే ఈ బాధ్యతలను నిర్వర్తించాలి కూడా.

## ఇల్లు వదలటం ఇల్లాలికే నష్టం

అతివను ఆమె సహజ కార్యపరిధి నుండి వెలికితీసి అసహజ పరిధిలో చేర్చటం మూలాన ఆమెకు ఏమాత్రం మేలు జరగదు. ఇందులో ఎలాంటి మేలు లేదు. పైగా కీడుంది.

అన్నిటికన్నా ముందు గమనించవలసిన విషయమేమిటంటే ఆడది, ఆడదానిగా ఉన్నంతవరకు గర్భం దాల్చటం, తల్లిగా మారటం, పాలు తాపించటం లాంటి సంక్లిష్ట పరిస్థితులను ఎదుర్కోక తప్పదు. అలాగే రుతుస్రావం, ప్రసవ స్రావం లాంటి ఒత్తిళ్ళకు లోనుకాక తప్పదు. ఇలాంటి క్లిష్ట పరిస్థితుల్లో, చిక్కుల్లో ఉన్నప్పుడు మగాడు ఏమాత్రం ఆమెకు సాయపడలేడు. అలాంటప్పుడు మగాడి బరువు బాధ్యతలను కూడా ఆమె నెత్తిపై రుద్దటం దౌర్జన్యం, అన్యాయమే అవుతుంది.

ఇల్లాలు ఇంటికి మహారాణి. అప్పుడే కదా ఆమె తండ్రి, భర్త, సోదరుడు, సంతానం ఇంకా కుటుంబీకులందరి మన్నన, ప్రేమ పొంద గలుగుతుంది. ఆమె హక్కులు, అధికారాలు సురక్షితంగా ఉంటాయి. అలాకాక ఆమె గనుక ఇంటి బాధ్యతలను విస్మరిస్తే తన హక్కుల కోసం దావా చేసే హక్కును కూడా కోల్పోతుంది. ఆ తర్వాత జీవన మనుగడ కోసం తనది కానటువంటి మైదానంలో పనిచేయాల్సి వస్తుంది. తనకన్నా శక్తిమంతుడైన ప్రత్యర్థితో అడుగడుగునా పోటీ పడాల్సి వస్తుంది. మగాడ్ని అధిగమించి ముందుకెళ్ళటం ఆమెకు కష్టసాధ్యంగా పరిణమిస్తుంది.

## ఇంటికే ప్రథమ ప్రాముఖ్యత

అతివ కోసం గౌరవ మర్యాదల స్థావరం ఆమె ఇల్లే, బజారు ఎంతమాత్రం కాదు. కాని నేడు ఇంటి ప్రాధాన్యత, కుటుంబ ప్రాముఖ్య

తలు పూర్తిగా తుడిచిపెట్టుకుపోయాయి. అందుకే కదా, ఆమె కార్యపరిధి ఇల్లు అనగానే ఆమెపై దౌర్జన్యం జరుగుతుందని, సమాజంలోనే అత్యంత నీచమైన పని ఆమెకు అంటగడుతున్నారని, ఆమెకు చెందాల్సిన హక్కులు సైతం హరిస్తున్నారని గగ్గోలు పెడుతున్నారు. ఇలా ఆమెను శాశ్వతంగా అధమ స్థానంలో అణగదొక్కే ప్రయత్నం జరుగుతుందనీ విమర్శిస్తారు. వాస్తవానికి కుటుంబం సమాజానికి పునాది లాంటిది. బజారు ఆఫీసుకన్నా ఇంటి ప్రాముఖ్యత తక్కువేమీ కాదు. ఇంటి వెలుపల ఆమె చేసే అనేకానేక పనులకన్నా, చెయ్యబోయే పనుల కన్నా ఇంటి లోపలి నిర్మాణపు పనులు మరింత ప్రాధాన్యత సంతరించుకున్నాయి. ఇక్కడ కొన్ని కోణాలు సూచించబడ్డాయి.

## ఇంట్లో పడతి పరిచర్యలు

1) మనిషి లెక్కలేనన్ని రాజకీయ, సామాజిక, నాగరిక సమస్యల వలయంలో చిక్కుకొని సతమతమవుతున్నాడు. వీటితోపాటు ఆరోగ్య సమస్యలు, కలిమిలేములు, సుఖదు:ఖాలు కూడా అతన్ని వెన్నంటే ఉన్నాయి. కొన్నిసార్లు బతుకుదెరువు కోసం తీవ్రంగా శ్రమించాల్సిన అవసరం ఉంటుంది. తన కోసం, తన కుటుంబీకుల అభ్యుదయం కోసం ఎన్నో చేదు అనుభవాలు ఎదుర్కోవలసి వస్తుంది. ఇలాంటి పరిస్థితుల్లో అతనికి మానసిక ప్రశాంతత, ఓదార్పు తప్పనిసరి. ఇల్లు ఇలాంటి మనశ్శాంతిని, ప్రశాంతతని ఇస్తుంది. కనీసం ఇంట్లో కూడా మనశ్శాంతి దొరక్కపోతే అతని జీవితం దుర్భరంగా మారిపోతుంది. అందుకే ఇస్లాం ఇంటిని ఆనందమయంగా, శాంతి నిలయంగా తీర్చిదిద్దుతుందని నమ్ముతుంది. భర్త ఇక్కడ తన కష్టనష్టాలను పూర్తిగా మైమరిచి, కాసేపు విశ్రాంతి

పొంది తిరిగి జీవన పోరాటంలో తన వంతు కృషి చేయడానికి సిద్ధమవు తాడని భార్య ఆశిస్తుంది.

2) బిడ్డ కోసం తల్లిపాలకన్నా శ్రేష్టమైన ఆహారం మరొకటి లేదని ఇప్పటికే పూర్తిగా నిర్ధారణ అయింది. ఒకవేళ తల్లి ఇంట్లో ఉండక రోజంతా బయటి వ్యవహారాల్లో లీనమైపోతే ఆమె తన ప్రాథమిక బాధ్యతను నిర్వర్తించలేకపోతుంది. అలాగే పాలు తాగే వయసులో, ఆ తర్వాత కూడా చాలా కాలం చంటివాని సరైన పెంపకం తల్లి చేతుల్లోనే సాధ్యమవుతుంది. పిల్లవాని సరైన ఎదుగుదల కోసం కేవలం ఉచితమైన ఆహారం సమకూర్చటమే కాదు, అతనికి ప్రేమ, మమతానురాగాలు, సానుభూతి కూడా ఎంతో అవసరం. ఒకవేళ అతనికి తన సమీప పరిసరాల్లో ఇలాంటి కోర్కెలు తీరకుండాపోతే అతని వ్యక్తిత్వం వాడి పోతుంది. లేదా ఎదిగినా పూర్తిగా తప్పుడు దిశలోనే ఎదుగుతుంది. ఈ భావాలు భావనల నిధి తల్లి రొమ్ము మాత్రమే. మరే వ్యక్తీ ఈ విషయంలో ఆమెకు ప్రత్యామ్నాయం కాలేడు. తల్లి గనక రోజంతా ఇంటి వెలుపల ఉండిపోతే చంటోడు తనకందని మమతానురాగాల కోసం అల్లాడుతూ ఉండిపోతాడు.

3) పిల్లవాని ప్రాథమిక విద్యాబుద్ధుల కోసం కూడా తల్లే అందరికన్నా సరైంది. ఎందుకంటే పిల్లోడికి సరైన విద్య అబ్బటానికి వాత్సల్యం, దయగల గురువు కావాలి. అతని స్వభావం, నైజం తెలిసిన వాడై ఉండాలి. అతని అల్లరిని భరించేవాడు, ఇంకా ఓపికతో సంస్కరించే వాడై ఉండాలి. అన్నింటికంటే గొప్ప విషయమేమిటంటే పిల్లవాడు స్వయాన అతన్ని ప్రేమించాలి. కఠినంగా మాట్లాడినా నిష్కల్మషంతో, మేలు కోరి చెప్పాడనీ భరించాలి. అతని కఠిన వైఖరిని కూడా సహించాలి. ఈ అనుభూతి, అనుబంధం తల్లీబిడ్డల మధ్యే ఉంటుంది. ఇతర ఏ ఇద్దరు

వ్యక్తుల మధ్య కూడా ఉండదు. మరెవరి లోనూ ఇలాంటి అనుబంధం ఉంటుందన్న నమ్మకం లేదు.

ఓ తల్లి తన పిల్లలకు విద్యాబుద్ధులు నేర్పేవిధంగా మరెక్కడా, ఏ స్కూల్లోనూ జరగదు.

చాలామంది పిల్లలకు ఇంట్లో మంచి ట్యూటర్ లేకపోవటం మూలాన లేదా వారి తల్లిదండ్రులు ట్యూటర్ పెట్టడాన్ని ఇష్టపడని కారణంగా, వారికి సరైన విద్య అబ్బదు. ఆడపిల్లలను ట్యూటర్‌తో చదివించడమంటే కాస్తంత ఇబ్బందిగానే తోస్తుంది. తల్లి తన బాధ్యతగా తలచి పిల్లలకు ఇంట్లోనే ట్యూషన్ చెప్పగలిగే అర్హత కలిగి వుంటే చదువుపై అయ్యే ఖర్చులు కూడా తగ్గుతాయి. మరెన్నో చెడుల నుండి తప్పించుకోనూ వచ్చు.

ఇక్కడ మరో విషయం గమనార్హం. ఒక ముస్లిం దృష్టి కోణంతో చూస్తే ఆ విషయం ముఖ్యమైంది. ఇటీవల ధార్మిక విద్య వైపు మొగ్గు చూపటం తక్కువైంది. చాలా తక్కువ మంది పిల్లలు మాత్రమే ధార్మిక విద్య నేర్చుకుంటున్నారు. పిల్లవాడికి స్కూల్‌కు వెళ్ళే వయసు వచ్చేసరికి స్కూల్‌కు పంపించటం జరుగుతుంది. ఆపై అతనికి సాధారణ ధార్మిక విషయాలు తెలుసుకొనే, నేర్చుకొనే సమయం, సందర్భం కూడా దొరక్కుండా పోతుంది. దీంతో చాలామంది సజ్జనులు, దైవభీతిపరుల పిల్లలు సైతం ధార్మికమైన ప్రాథమిక విషయాలు తెలుసుకోలేకపోతున్నారు. దీనిక్కారణం తండ్రి గారికి పిల్లలకు నేర్పించే తీరిక లేకుండా పోవడమే. ఇక తల్లి అజ్ఞాని కావటమో లేదా ఆమెకు నేర్పించాలనే ఆత్రుత లేకపోవటమో జరుగుతుంది. ఒకవేళ తల్లి ఒకింత నేర్పరి అయి, ఆమెకే గనక దీని చింత ఉంటే పిల్లవాడు స్కూల్లో చదివి కూడా ధర్మానికి దూరంగా ఉండలేడు.

శిక్షణ విషయంలో కూడా తల్లి పాత్ర చాలా ముఖ్యమైంది. పిల్లవాడికి అసలు నమూనా అతని తల్లే. పసివాడు ఆమె ప్రవర్తన, అలవాట్లను రేయింబవళ్ళు తిలకిస్తూనే ఉంటాడు. ఆమె తీరు చూసి తన తీరు నిర్ణయించుకుంటాడు. పరివారంతో తన తల్లి ఎలాంటి మంచి చెడు సంబంధాలు కలిగి ఉంటుందో అలాంటి సంబంధాలే అతను ఇతరులతో ఏర్పరచుకుంటాడు. ఈ వ్యవహారశైలిలో తల్లే అతనికి అసలైన గురువుగా ఉంటుంది. అతని నడవడి, ప్రవర్తన దిశను కూడా ఆమె నిర్ణయిస్తుంది.

వాస్తవానికి ఇంటి నిర్మాణం చేయనిదే సమాజ నిర్మాణం సాధ్యం కాదు. ఇస్లాం ఆమెను దీని నిర్మాణం కోసం ఇతర పనుల నుండి పూర్తిగా విముక్తి ప్రసాదించింది. దీంతోపాటు ఏ భారం ఆమెపై మోపకూడదని కోరుకుంటుంది. చివరికి సంపాదన బాధ్యతల కూడా నుండి మినహాయింపు నిచ్చింది. ఇస్లాం దృష్టిలో ఇంటి నిర్మాణం జిహాద్‌కన్నా తక్కువేమీ కాదు. హజ్రత్ అనస్(రజి) ఉల్లేఖించారు– కొందరు మహిళలు ప్రవక్త(స) దగ్గరికి వచ్చి, దైవప్రవక్తా(స)! మగవారైతే ప్రాధాన్యత కలిగిన ఆచరణలు ఆచరిస్తారు. ఇంకా జిహాద్ పుణ్యం కూడా పొందుతున్నారు. దైవమార్గంలో పోరాడే వారికి లభించేటంతటి పుణ్యం పొందాలంటే మేమేం చేయాలి చెప్పండి అని అడిగారు. అందుకాయన (స) “మీలో ఏ స్త్రీ అయితే ఇంట్లో కూర్చొని ఉంటుందో ఆమెకు దైవమార్గంలో పోరాడేవారికి సమానమైన పుణ్యం లభిస్తుంది” అని బదులిచ్చారు.

(ఇబ్నె కసీర్, తఫ్సీర్ అల్ ఖుర్ఆనుల్ అజీమ్ : 6/430)



# ముస్లిం మహిళ : ఇంట్లో, కుటుంబంలో...

కుటుంబం, సమాజంలో మొట్టమొదటి కార్యక్షేత్రం. దీని సరైన నిర్మాణంపైనే పూర్తి సమాజపు ఉత్తమ నిర్మాణం ఆధారపడి వుంది. ప్రధానంగా దీనిబాధ్యత స్త్రీపైనే మోపింది ఇస్లాం. కాని దీనివల్ల చట్టపరంగా, స్వాభావికంగా ఆమె స్థానాన్ని ఏమాత్రం గాయపరచలేదు. అది ఒకవైపు ఆమె చట్టపరమైన హక్కులను కాపాడుతూనే మరోవైపు సమాజం మొత్తాన్ని ఆమెతో మంచిగా మెలగాలని ఆదేశిస్తుంది. స్త్రీ ఏ స్థానంలో ఉన్నా కూడా ఆమె గౌరవ మర్యాదలకు ఎలాంటి లోటు రాకుండా ఉండేందుకు ఆమెకు చక్కని వాతావరణం కల్పిస్తుంది ఇస్లాం. ఇలాంటి వాతావరణం నెలకొని ఉన్నంతవరకు ఆమె గౌరవ మర్యాదలకు ఎలాంటి ఢోకా ఉండదు. ఇస్లామీయ సమాజంలో ఆమెకు చట్టపరమైన పూర్తి హక్కులు కూడా లభిస్తాయి. సామాజికంగా కూడా ఆమె స్థానం మరింత ఉన్నతమవుతుంది.

ఇంట్లోను, కుటుంబంలోను స్త్రీ తల్లిగా, ఆలిగా, కుమార్తెగా మూడు ప్రధానమైన స్థానాలను కలిగివుంది. ఆమె చెల్లిగా కూడా మరో పాత్రను పోషిస్తుంది. ఇస్లాం ఈ పాత్రలన్నింటిలోను ఆమెకు ఉన్నత స్థానాన్ని కల్పిస్తుంది. ఇస్లామీయ పరిమితుల్లో ఉంటూ ఏ ఒక్కరూ ఆమె నుండి ఆమె ఉన్నత స్థానాన్ని లాక్కోలేరు.

# తల్లి గొప్పతనం

ఇస్లాంలో దైవం, ఆయన ప్రవక్త(స) తర్వాత అందరికంటే ఉన్నత స్థానం తల్లిదే. తల్లిదండ్రులతో మంచిగా మెలగాలనీ, వారికి విధేయత చూపాలనీ ఇస్లాం బోధిస్తుంది. మనిషిపై వారిద్దరి ఉపకారాలున్నాయి. అయితే ఖుర్ఆన్ హదీసులో తల్లి మేళ్ళు మరింత స్పష్టం చేయబడ్డాయి. దివ్యగ్రంథంలో ఓ చోట ఇలా వుంది:

**మానవుడు తన తల్లిదండ్రుల హక్కులను గుర్తించాలని స్వయంగా మేమే అతనికి నిర్దేశించాము. అతని తల్లి బలహీనతపై బలహీనతను సహించి అతనిని తన కడుపున మోసింది. అతను పాలు విడిచిపెట్ట డానికి రెండు సంవత్సరాలు పట్టింది. (ఇందుకే మేము అతనికి ఇలా బోధించాము) 'నాకు కృతజ్ఞుడవై ఉండు. నీ తల్లిదండ్రులకు కృతజ్ఞ తలు తెలుపు. నా వైపునకే నీవు మరలి రావలసి వుంది.'**

***(లుఖ్మాన్ : 14)***

మరోచోట ఇలా ఉంది :

**"మేము మానవునికి, అతని తల్లిదండ్రుల పట్ల సద్భావంతో మెలగాలని ఉపదేశించాము. అతని తల్లి ఎంతో శ్రమతోనే అతనిని కన్నది. అతణ్ణి గర్భంలో పెట్టుకొని మోసేందుకు, అతనిచేత పాలు మాన్పించేందుకు ముప్ఫయి మాసాలు పట్టింది."**

***(అల్ అహ్ఖాఫ్: 15)***

పిల్లవాడి సంరక్షణ, పెంపకం, పరిచర్యలు ఇంకా విద్యాబుద్ధులు నేర్పించటం మొదలైన పనుల్లోతండ్రితోపాటు తల్లి కూడా కష్టపడుతుంది. కాని గర్భం, ప్రసూతి, పాలు తాపించే సమయాల్లో తల్లి ఒంటరిగానే కష్టాలను భరిస్తుంది. తొమ్మిది మాసాల వరకు గర్భాన్ని మోయటం, చావుబతుకుల సంఘర్షణ నుండి బయటపడి శిశువుకు జన్మనివ్వటం,

ఆపై తన రక్తాన్ని పాలగా మార్చి పిల్లాడికి తాపించటం ఈ మొత్తం ప్రక్రియలో జాగ్రత్తగా మసలుకోవటమనేది అంత సులువైందేమీ కాదు. ఈ కష్టనష్టాలను ఓర్చుకోవటంలో తండ్రి పాత్ర ఏమీ ఉండదు. అందుకే ఆమె మేళ్ళు తండ్రి కన్నా ఎక్కువే.

హదీసుల్లో తల్లిదండ్రుల సేవ, విధేయత వారిపట్ల సత్ప్రవర్తన కలిగి వుండాలని వివిధ కోణాల నుండి చెప్పటం జరిగింది. ఇక్కడ కొన్ని హదీసులు మీ ముందుంచబడ్డాయి. వీటిలో తల్లితో మంచిగా మెలగాలని, విభిన్న కోణాల నుండి చెప్పటం జరిగింది–

1. దైవప్రవక్త(స) తండ్రి యెడల ఏవిధంగా సత్ప్రవర్తన కలిగి వుండమని ఆదేశించారో అంతకంటే ఎక్కువగా తల్లి పట్ల సత్ప్రవర్తన కలిగి ఉండమని నొక్కి వక్కాణించారు.

**"నేను మనిషికి అతని తల్లి గురించి ఆదేశిస్తున్నాను. నేను మనిషికి అతని తల్లి గురించి తాకీదు చేస్తున్నాను. నేనతనికి అతని తల్లి గురించి ఆదేశిస్తున్నాను. నేను మనిషికి అతని తండ్రి గురించి ఆదేశిస్తున్నాను"[1] అని ఆయన(స) అన్నారు.**

హజ్రత్ ఆయెషా(రజి.అన్హా) అంటున్నారు :

**"నేను దైవప్రవక్త(స)తో స్త్రీపై అందరికంటే ఎక్కువ హక్కు ఎవరికి ఉంది? అని అడిగాను. అందుకు ఆయన (స) 'ఆమె భర్తకి' అన్నారు. నేను మళ్ళీ మగాడిపై అందరికంటే ఎక్కువ హక్కు ఎవరికి ఉందని అడిగాను. 'అతని తల్లికి' అని ఆయన(స) బదులిచ్చారు."[2]**

---

1. ఇబ్నెమాజా, కితాబుల్ అదబ్, బాబు బిర్రిల్ వాలిదైన్– హాకిమ్, అల్ ముస్తద్రక్ అలస్సహీహైన్, కితాబుల్ బిర్ర్ వస్సిలహ్, హదీసు నంబర్ 7243
2. హాకిమ్, అల్ ముస్తద్రక్ అలస్సహీహైన్, కితాబుల్ బిర్ర్ వస్సిలహ్, హదీసు నంబర్ 7244.

తండ్రికన్నా తల్లి బలహీనమైంది. కాబట్టి ఆమెతో మరీ ఎక్కువగా సత్ప్రవర్తన కలిగి వుండాలని ప్రవక్త(స) ఆదేశించారని కొందరు అభిప్రాయపడ్డారు. ఈ అభిప్రాయం కూడా సరైందే కావచ్చు. కాని అసలు కారణం తండ్రికన్నా తల్లి మేళ్ళు ఎక్కువగా ఉండటమే. వాస్తవానికి తనను మరింత కనిపెట్టుకుని ఉండాల్సిన అర్హత ఆమె కలిగివుంది.

2. ఖుర్ఆన్ హదీసుల ద్వారా స్పష్టమయ్యేదేమిటంటే 'కబాయిర్' అంటే, ఘోర పాపాల్లో అన్నింటికంటే ఘోర పాపం దైవానికి సాటి కల్పించటం. ఆ తర్వాత చాలా హదీసుల్లో తల్లిదండ్రుల అవిధేయత ప్రస్తావనే ఉంది.[1] దీనినిబట్టి ఇది ఎంతటి ఘోర పాపమో స్పష్టమవుతుంది. దీనితో పాటు తల్లి అవిధేయతకు దూరంగా ఉండమని ప్రత్యేకంగా ఆదేశించబడింది. ఇంకా దీన్ని నిషిద్ధమైనదిగా ఖరారు చేయటం జరిగింది.

**ప్రవక్త (స) ఇలా అన్నారు : 'అల్లాహ్ మీపై తల్లుల పట్ల అవిధేయతను.... ఇంకా ఆడపిల్లలను సజీవ సమాధి చేయటాన్ని నిషిద్ధం చేశాడు'.[2]**

దైవప్రవక్త(స) పది చెడుల గురించి ప్రస్తావించారు.

**'నా అనుచర సమాజం వీటిని చేస్తూ పోతే దానిపై ఆపదలు, ఇంకా దైవశిక్ష అవతరించటం మొదలవుతుంది. వాటిలో ఒకటి, మనిషి తన అర్ధాంగి చెప్పినట్లు వింటాడు, తల్లికి అవిధేయత చూపుతాడు. మిత్రుడితో మంచివైఖరి కలిగి వుంటాడు, తండ్రిని చీదరించుకుంటాడు.'**

---

1. బుఖారీ, కితాబుల్ అదబ్, బాబు ఉఖూఖుల్ వాలిదైని మినల్ కబాయిర్– ముస్లిం : కితాబుల్ ఈమాన్, బాబుల్ కబాయిరి వ అక్బరుహా.
2. బుఖారీ, కితాబుల్ అదబ్, బాబు ఉఖూఖుల్ వాలిదైని– ముస్లిం : కితాబుల్ అఖ్జియ్యహ్, బాబున్నహీ అన్ కస్రతిల్ మసాయిల్.

మరో ఉల్లేఖనంలో తల్లిదండ్రులకు అవిధేయత చూపించటం ప్రళయ సూచనల్లో ఒక సూచనగా పేర్కొనటం జరిగింది.[1] (అప్పుడు ఎటుచూసినా చెడే ప్రబలిపోయి వుంటుంది)

తల్లితో మంచిగా మెలిగినందువల్ల తప్పులు మన్నించి వేయబడతా యని, స్వర్గం లభిస్తుందని చెప్పబడింది.

హజ్రత్ ఆయెషా(ర.అ) చెప్పుకొచ్చారు. హారిసా బిన్ నోమాన్ (రజి) తన తల్లితో అందరికన్నా ఉత్తమంగా వ్యవహరించేవారు. ఓ రోజు ప్రవక్త(స) అన్నారు. 'నేను కలలో స్వర్గాన్ని చూశాను. అక్కడ నేను ఎవరో ఖుర్ఆన్ పారాయణం చేస్తుండగా విన్నాను. నేను ఈ స్వరం ఎవరిదని అడిగితే ఇది హారిసా బిన్ నోమాన్(రజి) గొంతు అని తెలియజేయబడింది. ఆ తర్వాత ఆయన(స) 'ఇది తల్లితో సత్ప్రవర్తన కలిగినందుకు లభించిన పుణ్యం. ఇది తల్లితో మంచిగా మెలిగినందుకు లభించిన పుణ్యఫలం' అని అన్నారు.[2]

హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్(ర) ఉల్లేఖించారు. ఒకతను దైవ ప్రవక్త(స)ను అడిగాడు. 'నా వల్ల ఒక తప్పిదం జరిగిపోయింది. దాని కోసం పశ్చాత్తాపం పడటానికి ఏదైనా మార్గముందా?'

'నీ తల్లి ఉందా?' అని ఆయన(స) అడిగారు.

'లేదు'

'సరే, నీకు పెత్తల్లి ఉందా?'

'ఉంది' అన్నాడతను.

---

1. తిర్మిజీ, అబ్వాబుల్ ఫితన్, బాబు మాజాఅ ఫీ అష్రాతిస్సాఅ.
2. మిష్కాతుల్ మసాబీహ్, కితాబుల్ ఆదాబ్, కితాబు ఫిల్ బిర్రివస్సిలతి. షరహుస్సున్నహ్ వ బైహఖీ సౌజన్యంతో– వ రవాహుల్ హాకిం ఫిల్ ముస్తద్రక్, కితాబుల్ బిర్రి వస్సిలతి. హదీసు నంబర్ 7247

'ఆమెతో సత్ప్రవర్తన కలిగివుండు' అని ప్రవక్త మహనీయులు (స)హితబోధ చేశారు.[1]

దీని అర్థం ఏమిటంటే కేవలం తల్లి సేవే కాదు ఆమె చుట్టాలు, బంధువుల సేవ కూడా పాపాలకు పరిహారం, మన్నింపుకు కారణమ వుతుంది.

తల్లి సేవ తండ్రి సేవకన్నా ప్రథమమైంది. మరే వ్యక్తి స్థానం అయినా తల్లి తర్వాతే. హజ్రత్ అబూహురైరా(రజి) ఉల్లేఖించారు: ఓ వ్యక్తి 'మన్ అహఖ్ఖు బి హుస్ని సహాబతీ' (నా సత్ప్రవర్తనకు ఎక్కువ అర్హులు ఎవరని) ప్రవక్త(స)ను అడిగాడు.

ఆయన(స) 'నీ తల్లి' అని పలికారు.

'ఆ తర్వాత ఎవరు?'

'నీ తల్లి'

'ఆ తర్వాత ఇంకెవరు?'

'నీ తల్లే'

నాలుగవ సారి తిరిగి ఇదే ప్రశ్న అడిగాడు. అప్పుడు ఆయన(స) 'నీ తండ్రి' అని పలికారు.[2]

మరో హదీసులో ఒక సహచరుడు ప్రవక్త(స)ను, 'నా సద్వ్యవహారా నికి అందరికన్నా ఎక్కువ అర్హులు ఎవరు?' అని అడిగాడు. ఆయన(స) 'నీ తల్లి' అన్నారు. అతను 'ఆ తర్వాత ఎవరూ?' అని మళ్ళీ ప్రశ్నించాడు.

---

1. తిర్మిజీ, అబ్వాబుల్ బిర్రి వస్సిలతి, బాబు మాజాఅ ఫీ బిర్రిల్ ఖాలతి– హాకిమ్, ముస్తద్రక్, కితాబుల్ బిర్రి వస్సిలతి హదీసు నంబర్ 7261
2. బుఖారీ, కితాబుల్ ఆదబ్, బాబు మన్ అహఖ్ఖున్నాస్ బి హుస్నిస్సుహ్‌బతి– ముస్లిం, కితాబుల్ బిర్రి వస్సిలతి, బాబు బిర్రిల్ వాలిదైని.

'నీ తల్లే' అని ఆయన(స) పలికారు. అతను మూడవసారి కూడా అలాగే ప్రశ్నించాడు. అందుకాయన(స) ఈసారి కూడా అలాగే సమాధాన మిచ్చారు. నాల్గవ సారి అతను ఇదే అడిగినప్పుడు ఆయన(స) 'నీ తండ్రి, ఆ తర్వాత చుట్టరికంలో నీకు అత్యంత చేరువలో ఉన్నవారు నీ సత్ప్రవర్త నకు అర్హులు' అని బదులు పలికారు.[1]

ఖాజీ అయాజ్(రహ్మాలై) అంటున్నారు : 'తల్లిదండ్రులు ఇద్దరూ సత్ప్రవర్తనకు సమంగా అర్హులని కొందరన్నారు. కాని ఎక్కువ మంది అభిప్రాయం ప్రకారం తల్లి హక్కే ఎక్కువగా ఉంద'న్నారు. ఇమామ్ నవవీ (రహ్మా) అంటున్నారు : "ఈ అభిప్రాయమే సరైంది. ఎందుకంటే స్పష్టమైన హదీసులన్నీ దీన్నే బలపరుస్తున్నాయి". హారిస్ మహాసబి అంటున్నారు: "సత్ప్రవర్తనకు తండ్రి కన్నా తల్లి ఎక్కువ అర్హురాలు అనే విషయంపై ఏకాభిప్రాయం ఉంది".[2]

తల్లితో రెండింతలు లేదా మూడింతలు ఎక్కువ సత్ప్రవర్తన కలిగి వుండాలనే విషయంపై అనేక ఉల్లేఖనాలున్నాయి.

ఇమామ్ తహావీ (రహ్మా) 'ఈ క్రమంలో మనిషికి తండ్రిని ఎంత ఆదరించాలో అంతకన్నా మూడింతలు తల్లిని ఆదరించాలనే ఉల్లేఖనాలు ఎక్కువ బలమైనవి' అని అంటున్నారు.[3]

'తండ్రికి విధేయత చూపాలి. ఆయన ఆదేశాన్ని పాటించాలి. కాని సత్ప్రవర్తన విషయంలో నాలుగు భాగాల్లో మూడు భాగాలు తల్లికి చెందినవి' అని ఇమామ్ అహ్మద్(ర) అంటున్నారు.[4]

---

1. అబూదావూద్, కితాబుల్ అదబ్, బాబు బిర్రుల్‌వాలిదైన్– తిర్మిజీ, కితాబుల్ బిర్రి వస్సిలతి, బాబు మాజాఅ ఫీ బిర్రిల్ వాలిదైని.
2. నవవీ, షర్హె ముస్లిం; సంపుటం 8, 16వ ఖండం, 83వ పేజీ.
3. వివరణ కోసం చూడండి. తహావీ, ముష్కిలుల్ ఆసార్: 270–273/2
4. ఇబ్నె ఖయ్యిమ్ : ఆలాముల్ మూఖియీన్ : 273/4

ఇస్లాం కేవలం తల్లిదండ్రుల చట్టపరమైన హక్కులను నెరవేర్చుటమే కాకుండా వారితో మరింత మంచిగా మెలగాలని తాకీదు కూడా చేస్తుంది. భారంగా అనుకోకుండా చట్టబద్ధంగా వారి హక్కులు మంచి మనసుతో, ప్రేమతో నిర్వర్తించమని చెబుతుంది. అంతేకాకుండా మనిషి తన శక్తిమేరకు మరికాస్త ముందుకెళ్ళి వారితో ఉత్తమంగా మెలగాలని బోధిస్తుంది. ఇందులో కూడా తల్లి హక్కు ప్రథమమైంది. తండ్రితో ఎలాంటి సత్ప్రవర్తన కలిగి ఉండాలో అంతకంటే ఎక్కువ ఉన్నతమైన ప్రవర్తన తల్లితోనూ కలిగి వుండమని బోధిస్తుంది.

## అర్ధాంగి హక్కులు

ఇస్లాం దృష్టిలో స్త్రీ స్థిరమైన అస్తిత్వం కలిగి వుంది. పెళ్ళి మూలంగా ఆమె వ్యక్తిత్వం, భర్త వ్యక్తిత్వం వెనుక మరుగున పడిపోదు. లేదా అతని దాసి, బానిసలా ఉండాల్సిన అవసరమూ లేదు. పెళ్ళి తర్వాత ఆమె కొన్ని కొత్త బాధ్యతలతోపాటు ఇంకొన్ని కొత్త హక్కులకు యజమానురాలిగా కూడా ఉంటుంది. ఎలాగైతే ఆమె తన బాధ్యతలను నిరాకరించ లేకపోతుందో అలాగే ఆమె హక్కులు కూడా ఆమె నుండి ఎవరూ లాక్కోలేరు.

రండి, ఇస్లాం ఆలుమగల బాంధవ్యాన్ని ఏ దృష్టితో చూస్తుందో పరిశీలిద్దాం. ఇంకా నైతికపరంగానూ, చట్టపరంగానూ వారికి ఎలాంటి ప్రాతిపదికను సమకూరుస్తుందో చూద్దాం.

ఆలుమగల బంధం వాస్తవానికి ప్రేమానురాగాల బంధం. వారి మధ్య దైవం సహజంగానే ప్రేమ, ఆకర్షణ, కోరికలు పెట్టాడు. దివ్యగ్రంథంలో ఒకచోట దీని ప్రస్తావన ఈ పదాల్లో ఉంది :

**'ఆయన సూచనలలో మరొకటి ఏమిటంటే ఆయన మీ కొరకు**

**భార్యలను మీ జాతిలోనుండే సృష్టించాడు. మీరు వారి వద్ద శాంతిని పొందటానికి మీ మధ్య ప్రేమానురాగాలు, కారుణ్యాన్ని సృజించాడు. నిశ్చయంగా ఆలోచనాపరులకు ఇందులో ఎన్నో సూచనలున్నాయి.'**

***(అర్రూమ్ : 21)***

ఆలుమగల మధ్య ప్రేమానురాగాలు, దయ, సానుభూతితో కూడిన సంబంధం ఉండాలి. ఇది వారిరువురి సహజ అవసరం కూడాను. ఒకవేళ ప్రేమకు బదులు ద్వేషం, వైరం చోటుచేసుకుంటే దైవం వారిని పుట్టించిన సహజ గుణానికి ఇది పూర్తిగా విరుద్ధమైనది.

1. ప్రతి చిన్న పెద్ద కార్యాలయాన్ని నడపటానికి ఒక నిర్వాహణాధి కారి ఉంటాడు. కుటుంబ సంబంధాలు, దాని సమస్యలు ఇతర అనేక కార్యాలయాలకన్నా వాటి సమస్యలకన్నా మరీ ఎక్కువ పేచీలతో, వివాదాలతో కూడుకొని ఉంటుంది. నిర్వాహకుడు లేకుండా దాని నిర్వహణ సాధ్యం కాదు. దానికంటూ ఓ నాయకుడు, బాధ్యుడు లేకపోతే అది అతలాకుతలం అయిపోతుంది. ఇస్లాం వివిధ కారణాల వల్ల మగాడికి కుటుంబ నిర్వాహకుడి స్థానాన్ని కల్పించింది. అంటే దీని భావం మగాడికి ఆడదానిపై మితిమీరిన స్వేచ్ఛ, ఆధిక్యతను ప్రసాదించి, ఆడదాన్ని అతని దాసిగా పరిగణించిందని భావం ఎంతమాత్రం కాదు. కాని ఎక్కడైతే ఆడది మగాడ్ని తన పెద్దగా ఒప్పుకొని న్యాయమైన అతని కోరికలను నిర్వర్తించి, ఇంటి నిర్వహణ చక్కదిద్దుకొనే బాధ్యత కలిగి ఉంటుందో అక్కడ ఆమెకు తనకంటూ కొన్ని హక్కులు కూడా ఉన్నాయి. ఈ హక్కులను మగాడు తప్పనిసరిగా నెరవేర్చాల్సిందే. అందుకే ఖుర్ఆన్‌లో ఇలా వుంది :

**'పురుషులు స్త్రీలకు అధికారులు (ఖవ్వామ్). ఎందుకంటే అల్లాహ్ వారిలో ఒకరికి మరొకరిపై ఆధిక్యతలను ప్రసాదించటం వల్ల, ఇంకా**

**పురుషులు తమ సంపదను వారి కొరకు ఖర్చుచేస్తున్నందువల్ల. కనుక సుగుణవంతులైన స్త్రీలు విధేయత కలిగివుంటారు. పురుషులు లేనప్పుడు అల్లాహ్ రక్షణలో ఉంటూ వారి హక్కులను కాపాడుతారు'.**

***(అన్ నిసా: 34)***

కుటుంబ జీవితంలో మగాడి ఉన్నతిని ఒప్పుకొని, ఆడది అన్న వస్త్రాలు, నివాసం, మహర్, రక్షణా భద్రతలు ఇంకా విద్యాశిక్షణ లాంటి ఎన్నో హక్కులు పొందుతుంది. ఈ హక్కులు నెరవేర్చటంలో మగాడు లోటు చేస్తే చట్టపరంగా ఆమె వాటిని పొందవచ్చు.

2. మగాడు కేవలం తన అర్ధాంగిని చట్టపరమైన హక్కులతోనే సరిపెట్టకుండా ఇంకొంచెం ముందుకెళ్ళి ఆమెతో వీలైనంత మంచిగా మెలగాలని ఇస్లాం బోధిస్తుంది. ఎలాంటి పరిస్థితుల్లోనైనాసరే ఆలితో మంచి ప్రవర్తన కలిగి వుండటం తప్పనిసరి. కొన్ని సమయాల్లో అర్ధాంగి రూపురేఖలు, స్వభావం, అలవాట్లు మగవాడికి నచ్చకపోవచ్చు. దాని ప్రభావం సాధారణంగా ఇరువురి సంబంధాలపై పడుతుంది. ఇలాంటి సందర్భాల్లో భర్త తన భార్యలోని మంచి కోణాలను చూడాలి. ఆమెలో ఏదో ఒక విషయం నచ్చకపోతే పది విషయాలు ప్రశంసించదగినవి ఉండవచ్చు. అందుకే సభ్యత, సంస్కారాలతోపాటు బుద్ధిజ్ఞానాలు కూడా ఇదే కోరుకుంటాయి. మనిషి విస్తారమైన ఇంటి ప్రయోజనాలు ముందుంచుకొని, బంధాలు పాడు చేసుకోరాదు. అతనికి ఒక వస్తువు నచ్చకపోవచ్చు కాని అందులో మేలైన మరెన్నో కోణాలు దాగివుంటాయి. ఈ వ్యవహారంలో ఇస్లాం ఎంతటి ఉన్నత పారదర్శక విధానాన్ని అవలంబించిందంటే, అలాంటి విధానం బహుశా ప్రపంచంలో మరెక్కడా కానరాదు.

దివ్యగ్రంథంలో చెప్పబడింది :

**'వారితో సద్భావంతో జీవితం గడపండి. ఒకవేళ మీకు వారు నచ్చకపోతే, బహుశా మీకు ఒక వస్తువు నచ్చకపోవచ్చు. కాని అందులోనే అల్లాహ్ ఎంతో మేలును పెట్టి ఉండవచ్చు.'** ***(అన్ నిసా : 19)***

భార్యతో ఏ విధంగా మసలుకోవాలో దైవప్రవక్త(స) ఉపదేశాలు అత్యుత్తమంగా బోధించాయి. హజ్రత్ ముఆవియా ఖుషైరీ(రజి) భార్యల హక్కుల గురించి ప్రవక్త(స)ను అడగ్గా –

**'నీవు తినేటప్పుడు ఆమెకు కూడా తినిపించు. నీవు తొడుక్కోవాలనుకున్నప్పుడు ఆమెకు కూడా తొడిగించు. (కోపంతో అసహనానికి లోనైతే) ఆమె ముఖం మీద కొట్టకు, ఇంకా ఆమెను దూషించకు. (ఆమెతో దూరంగా ఉండటం తప్పనిసరి అనుకుంటే) ఇంట్లోనుంచి పంపించకు. ఇంట్లోనే ఆమెతో దూరంగా ఉండు' అని ఆయన (స) అన్నారు.[1]**

**ఈ హదీసు ఈ పదాల్లో కూడా ఉల్లేఖించబడింది. "మీరు తినేదే వారికీ తినిపించండి. మీరు తొడిగేదే వారికి కూడా తొడిగించండి. వారిని కొట్టకండి. ఇంకా వారిని దూషించనూ వద్దు.[2]"**

దీనిద్వారా రెండు విషయాలు తేటతెల్లమవుతున్నాయి. మొదటిది, అన్నపానీయాలు, తొడుక్కునే, కప్పుకునే వస్త్రాలు సైతం భర్త తాహతుకు సరిపడేవే అతని భార్యవి కూడా అయివుండాలి. తను మాత్రం దర్జాగా ఉంటూ ఆమెను దీనస్థితిలో జీవించటానికి బలవంతం చేయటం మంచిది కాదు. రెండవది, ఆమెతో కలుపుగోలుతనం, బాంధవ్య విషయంలో సంస్కారం చూపించాలి. అహంకారం అమానుషత్వంతో మసలుకోరాదు.

---

1. అబూదావూద్, కితాబున్నికాహ్, బాబు ఫీ హఖ్ఖిల్ మర్అతి అలా జౌజిహా.
2. అబూదావూద్, కితాబున్నికాహ్, బాబు ఫీ హఖ్ఖిల్ మర్అతి అలా జౌజిహా.

భార్య ఏదైనా మాట బాధించే విధంగా మాట్లాడితే ఓర్పు సహనంతో వ్యవహరించమని ప్రవక్త(స) బోధించారు. సామాన్యంగా ఈ అసహనం తాత్కాలికమైనదే అయి వుంటుంది. ఆమెలో ఒక విషయం నొప్పించేదిగా ఉంటే మరో విషయం ఆనందింపజేసేదిగా కూడా ఉంటుంది. మాటిమాటికి దుఃఖం, కోపం, అయిష్టం ప్రదర్శించటం మూలాన ఇరువురి బంధం శాశ్వతంగా దెబ్బతినవచ్చు.

హ్రజత్ అబూహురైరా(రజి) ఉల్లేఖనం ప్రకారం ప్రవక్త(స) ఇలా అన్నారు :

**'ఏ విశ్వాసీ విశ్వాసురాలిని (భార్యను) అసహ్యించుకోరాదు. అతనికి ఆమెలో ఒక గుణం నచ్చకపోయినప్పటికీ అతనికి నచ్చిన మరో గుణం ఆమెలో ఉండవచ్చు'[1].**

కొన్ని సందర్భాలలో మనిషి ఇంటి బయట నీతిమంతునిగా వ్యవహరించినప్పటికీ భార్యతో మాత్రం అతని ప్రవర్తన చాలా నీచంగా ఉంటుంది. వాస్తవానికి ఆమె జీవిత సహచరిణి. కాబట్టి సత్ప్రవర్తనకు ఎక్కువ అర్హురాలు కూడా ఆమే అవుతుంది. భార్యతో మంచి ప్రవర్తన కలిగి ఉన్నవాడే అందరికంటే మంచి మనిషి అని హదీసులో చెప్పబడింది.

**'ఉత్తమ నడవడిక గలవారే విశ్వాసులలో పరిపూర్ణ విశ్వాసులు. మీలో తమ భార్యలపట్ల మంచిగా మెలిగేవారే అందరికన్నా శ్రేష్ఠులు[2]. (తిర్మిజీ)**

ఓ ఉల్లేఖనంలో ఆలుబిడ్డలతో ప్రేమానురాగాలు కలిగి వుండటం విశ్వాసం పరిపూర్ణం చేసే గొప్ప గుణంగా చెప్పబడింది.

'విశ్వాసులలో అందరికన్నా ఎక్కువ గుణవంతుడే పరిపూర్ణ

1. ముస్లిం– కితాబుర్రజాయి..
2. తిర్మిజీ– కితాబుర్రిజాయి...

విశ్వాసి. అలాగే తన భార్యాపిల్లల పట్ల ఎక్కువ ప్రేమానురాగాలు చూపే వాడు'[1] అని ప్రవక్త(స) అన్నారు. (హజ్రత్ ఆయెషా(రజి))

హజ్రత్ ఆయెషా (రజి) గారి మరో ఉల్లేఖనం ప్రకారం 'ఎవరైతే తన ఇంటివారల విషయంలో మంచివాడో అతనే మీలో మంచివాడు. నేను కూడా నా ఇంటివారల విషయంలో మంచివాడ్ని'[2] అని ఆయన(స) అన్నారు.

3. ఇస్లాం ప్రకారం ఆలుమగల బంధం పటిష్టంగా ఉండాలంటే వారిరువురు తగాదాలు, వివాదాలకు తావివ్వకూడదు. భార్య, భర్తను సంతోషంగా, మనశ్శాంతిగా ఉండేటట్లు చూసుకోవాలి. ధర్మసమ్మతమైన అతని పనుల్లో తోడ్పడాలి. అతని గౌరవ మర్యాదలను, ఆస్తిపాస్తులను కనిపెట్టుకొని ఉండాలి. మరోవైపు భర్త ఇలాంటి ఉత్తమురాలైన భార్యను విలువైన జీవన సామగ్రిగా భావించాలి. ఆమెతో అత్యుత్తమంగా వ్యవహరించాలి.

హజ్రత్ అబూహురైరా (రజి) కథనం ప్రకారం ఉత్తమ స్త్రీ గుణాల గురించి ప్రవక్త(స)ను అడిగినప్పుడు ఆయన(స) ఇలా జవాబిచ్చారు: 'భర్త ఆమె వైపు చూసినప్పుడు సంతోషపెట్టాలి. ఏదైనా ఆజ్ఞాపిస్తే శిరసా వహించాలి. తన శీల మర్యాదతోపాటు అతని ధనసంపత్తిని పరిరక్షించాలి. ఇంకా వాటిలో అతనికి వ్యతిరేకంగా, అయిష్టమైన పనులు చేయకుండా ఉండాలి.[3]

దైవప్రవక్త(స) ఇలా అన్నారని హజ్రత్ అబూ ఉమామ (రజి)

---

1. *తిర్మిజీ, కితాబుల్ ఈమాన్; మాజాఅ పీ ఇస్తిక్‌మాలిల్ ఈమాన్*
2. *తిర్మిజీ– కితాబుల్ మనాఖిబ్; ఇబ్నుమాజా– కితాబున్నికాహ్*
3. *ముస్నదె అహ్మద్, మస్నదే అబీ హురైరా, హదీసు నంబర్ 7373. నసాయి, కితాబున్నికాహ్, బాబు అయ్యునిస్సావు ఖైరున్.*

తెలిపారు. 'దైవభీతి తర్వాత ఒక విశ్వాసి ఏ వస్తువులతోనైతే ప్రయోజనం పొందుతాడో అందులో సజ్జనురాలైన భార్యకన్నా ఉత్తమమైనది మరొకటి లేదు. ఆ ఇల్లాలు ఎటువంటిదంటే (భర్త) ఆజ్ఞాపిస్తే శిరసావహిస్తుంది. తనవైపు చూసినప్పుడు అతన్ని ఆనందింపజేస్తుంది. ఏదైనా విషయంపై ప్రమాణం చేసి చేయమన్నప్పుడు దాన్ని నెరవేరుస్తుంది. అతను లేనప్పుడు ఆమె తన శీలాన్ని అతని సంపదను హితంగా కనిపెట్టుకొని ఉంటుంది.[1]

'ఈ ప్రపంచమంతా జీవన సామగ్రియే. అందులో అత్యుత్తమ సామగ్రి సుగుణవతి అయిన స్త్రీ' అని ఆయన(స) అన్నారని హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అమ్ర్ బిన్ ఆస్(ర) తెలిపారు.[2]

ఓసారి హజ్రత్ ఉమర్(ర), బంగారం, వెండిని సమీకరించడాన్ని దేవుడు నిషేధించాడు కదా! మరి ఎలాంటి సొమ్మును మన దగ్గర పెట్టుకోవాలి దైవప్రవక్తా(స)! అని అడిగారు. అందుకాయన (స) 'మీలో ప్రతి ఒక్కరూ కృతజ్ఞత కలిగిన హృదయం, దైవాన్ని స్మరించే జిహ్వా, పరలోకపు పనుల్లో సాయపడే విశ్వాసురాలైన భార్య తన దగ్గర పెట్టుకోవాలి' (ఇదే అన్నిటికంటే గొప్ప సంపద)[3] అని అన్నారు.

దీనినిబట్టి ఇస్లాం ఆలుమగల మధ్య ఎలాంటి బాంధవ్యం చూడాలనుకుంటుందో స్పష్టంగా అర్థమవుతుంది. ఇలాంటి బంధమే గనక ఉనికిలోకి వస్తే వారు ఒకరికొకరు తోడునీడగా ఉంటారు. వారి జీవితం మనోహరంగా ఆదర్శప్రాయంగా సాగిపోతుంది. గృహస్థ జీవనాన్ని నాశనం చేసే హక్కుల్లోని, అధికారాల్లోని అయిష్టకరమైన సమస్యల పర్వతం మరెప్పుడు నిలిచి వుండదు.

---

1. ఇబ్నెమాజ, కితాబున్నికాహ్, బాబు అఫ్జలున్నిసా
2. ముస్లిం, కితాబు ర్రిజాయి, బాబుల్ వసియ్యతి బిన్నిసాయి, ఇబ్నెమాజ, కితాబున్నికాహ్, బాబు అఫ్‌జలున్నిసాయి
3. తిర్మిజీ, కితాబుత్తఫ్‌సీర్ (సూరతుత్తౌబా)– ఇబ్నెమాజ, కితాబున్నికాహ్, బాబు అఫ్‌జలున్నిసా

## ఆడపిల్లలు ఇంటికి శుభాలు

అజ్ఞాన కాలంలో మగపిల్లలను గొప్ప సంపదగా తలచేవారు. వారి వల్ల తమ తెగ బలం పుంజుకుంటుందనీ, ఆర్థికంగా శ్రమించటంలో వారు తోడ్పడతారనీ, వారి పుట్టుక పట్ల గర్వించేవారు. కాని ఆడపిల్లలు అరబ్ వాసులకు భారంగా అనిపించేవారు. వాళ్ళను నామోషీగా తలచేవారు. కనీసం వారి ప్రస్తావన వచ్చినాసరే సిగ్గుతో తలదించుకునేవారు.

దివ్యగ్రంథం ఆడపిల్లల గురించి వారి ఆవేదనను ఈ విధంగా వ్యక్తపరిచింది.

> **'వారిలో ఎవడికైనా కూతురు పుట్టిందనే శుభవార్తను అందజేస్తే అతడి ముఖాన్ని నల్లని ఛాయలు ఆవరిస్తాయి. అతడు లోలోన కుమిలిపోతాడు. ఈ దుర్వార్త విన్న తర్వాత ఇక లోకులకు ఎలా ముఖం చూపాలి అని అతడు నక్కి నక్కి తిరుగుతూ ఉంటాడు. అవమానాన్ని భరిస్తూ కూతుర్ని ఇంట్లో ఉంచుకోవాలా లేక ఆమెను మట్టిలో పాతిపెట్టాలా? అని ఆలోచిస్తాడు.'** ***(అన్ నహ్ల్ : 58, 59)***

ఈ అనుచిత భావాల కారణంగా కొన్ని తెగల వారు ఆడపిల్లలను సజీవంగా పాతిపెట్టేవారు. ఖుర్ఆన్ గ్రంథం సంతానాన్ని హతమార్చటం గురించి తీవ్రంగా ఖండించింది. దాన్ని అతిపెద్ద నేరంగా పరిగణించింది. అంతేకాకుండా శాశ్వతంగా దాన్ని అంతమొందించింది. అంతిమ దినం నాడు ఇలాంటి కర్కశత్వం, కఠిన మనస్తత్వం గురించి దైవానికి జవాబు చెప్పుకోవాల్సి ఉంటుంది.

> **'(ఆ సమయాన్ని గుర్తుంచుకో) సజీవంగా పాతిపెట్టబడిన బాలికను, నీవు ఏ తప్పు వల్ల హత్య చేయబడ్డావని అడగబడు తుంది,'** ***(అత్ తక్వీర్: 8, 9)***

బాలికల విషయంలో అజ్ఞాన కాలపు ఆలోచనాసరళికి పూర్తి వ్యతిరేకంగా ఇస్లాం భిన్నమైన ఆలోచనా స్రవంతిని ప్రసాదించింది.

1) అది తొలుత ఇలా అంది : దేవుడు, ఒకరికి సంతానం అనుగ్రహిస్తాడు, మరొకరికి అసలు సంతానమే ఇవ్వడు. ఒకరికి కేవలం కొడుకులు మాత్రమే ఇస్తాడు, మరొకరికి కేవలం కూతుళ్ళనే ఇస్తాడు. ఇంకొకరికి కొడుకులను, కూతుళ్ళను కలిపి ఇస్తాడు. ఇది ఆయన ఇష్టం. వీటిలో ఏది కూడా గర్వించదగిన విషయమూ కాదు. మరేదీ పరాభవానికి కారణమూ కాదు. ఇవన్నీ దైవశక్తికి నిదర్శనాలు. వీటి వెనుక అంతులేని ఆయన జ్ఞానం, యుక్తి, ఔచిత్యం పని చేస్తుంది. ఎవరైతే దీన్ని అహంకారానికి, చిన్నతనానికీ చిహ్నంగా తలుస్తారో వారు ఆయన యుక్తిని తప్పు పడుతున్నట్లే.

**'భూమ్యాకాశాల సామ్రాజ్యానికి అల్లాహ్ ప్రభువు. ఆయన తాను కోరిన దానిని సృష్టిస్తాడు. తనకు ఇష్టమైన వారికి కూతుళ్లను, తాను కోరిన వారికి కొడుకులనూ ఇస్తాడు. తనకు ఇష్టమైన వారికి కొడుకులను, కూతుళ్ళనూ కలిపి ఇస్తాడు. తాను కోరిన వారికి అసలు సంతానమే ఇవ్వడు. ఆయనకు అంతా తెలుసు. ఆయనకు అన్నింటి పైనా అధికారం ఉన్నది'.** ***(అష్ షూరా 49, 50)***

2) ఆడపిల్ల పోషణ గురించి ప్రోత్సహించడం జరిగింది. ఇది పుణ్యకార్యంగా, స్వర్గప్రాప్తికి మూల కారణంగా చెప్పబడింది.

ప్రవక్త(స) ఇలా అన్నారని హజ్రత్ ఆయెషా(రజి) ఉల్లేఖించారు: 'ఆడపిల్లల వల్ల పరీక్షలకు గురైనప్పటికీ (సహనం వహిస్తూ) వారి పట్ల ఉత్తమంగా వ్యవహరించిన వ్యక్తి పాలిట ప్రళయదినాన ఆ ఆడపిల్లలే నరకాగ్నికి అడ్డుగా నిలుస్తారు'[1] అని ఆయన(స) అన్నారు.

---

1. బుఖారీ, కితాబుల్ అదబ్, బాబు రహ్మతిహి అల్‌వలద వతఖ్‌బీలిహి. ఇలాగే చివరి వరకు– ముస్లిం, కితాబుల్ బిర్రి వస్సిలతి, బాబు ఫజ్లిల్ ఇహ్సాని ఇలల్ బనాత్.

హదీసుల్లో ఇద్దరు ముగ్గురు అమ్మాయిలనే కాకుండా ఒకమ్మాయిని పెంచి పోషించినాసరే స్వర్గం లభిస్తుందనే శుభవార్త ఇవ్వబడింది. దీనిని బట్టి ముగ్గురు అమ్మాయిల కంటే ఎక్కువ మందిని పెంచి పోషించిన వారికి కలిగే పుణ్యఫలం ఇంకెంతో అర్థం చేసుకోవచ్చు.

ప్రవక్త మహనీయులు (స) ఇలా అన్నారని హజ్రత్ ఉఖ్బా బిన్ ఆమిర్(రజి) తెలిపారు.

'ఏ వ్యక్తికైనా ముగ్గురు అమ్మాయిలు వుండి, అతను వారి వల్ల కలిగే కష్టాలను సహించి, తన కష్టార్జితంతో వారికి తినిపించి, త్రాగించి, తొడిగించినట్లయితే, వారు అతన్ని నరకాగ్ని నుండి కాపాడే తెరగా మారుతారు.[1]

వేరొక హదీసులో ప్రవక్త(స) ఇలా అన్నారు : 'ఏ వ్యక్తి అయితే ఇద్దరమ్మాయిలను యుక్త వయసుకు చేరుకొనే వరకు పెంచి పోషిస్తాడో, అతను, నేను ప్రళయదినాన ఇలా కలిసి వస్తాము అని ప్రవక్త(స) తన రెండు వేళ్ళను కలిపి చూపించారు.[2]

*(హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అబ్బాస్(రజి)*

మరో హదీసులో ఆయన(స) "ఎవరికైతే ముగ్గురు అమ్మాయిలు ఉండి, అతను వారి కారణంగా కలిగే కష్టాలు, ఆర్థిక ఇబ్బందులపై సహనం వహిస్తే, వారి పట్ల అతనికున్న సానుభూతితో దైవం అతణ్ణి స్వర్గంలో ప్రవేశింపజేస్తాడు" అని అన్నారు. ఇద్దరు అమ్మాయిలుంటేనూ? (వారి వల్ల కష్టాలను ఓర్చుకుంటే?) అనడిగాడు ఒకతను. "ఇద్దరు అమ్మాయిలు ఉన్నా సరే!" (అల్లాహ్ స్వర్గం ప్రసాదిస్తాడు)

---

1. మస్నదే అహ్మద్ : ఉఖ్బా బిన్ ఆమిర్, హదీసు నంబరు 16950, ఇబ్నెమాజ, కితాబుల్ అదబ్, బాబు బిర్రిల్ వాలిది వల్ ఇహ్సాని ఇలల్ బనాతి.
2. ముస్లిం, కితాబుల్ బిర్రి వస్సిలతి, బాబు మాజాఅఫీన్నఫఖతి అలల్ బనాతి.

'ఒకవేళ ఒకే అమ్మాయి ఉంటే?' మరొకతను ప్రశ్నించాడు. "ఒకమ్మాయి ఉన్నా సరే" అని ఆయన(స) బదులు పలికారు. [1]

2. అమ్మాయిలను పెంచిపోషించడంతోపాటు వారికి మంచి విద్యాబుద్ధులు నేర్పాలనీ, తగిన సంబంధం చూసి పెళ్ళి చేయాలని ఆ తర్వాత కూడా వారి పట్ల సత్రృవర్తన కలిగి వుండాలనే విషయాన్ని హదీసుల్లో ప్రోత్సహించడం జరిగింది.

"ఎవరైనా ముగ్గురు అమ్మాయిలను పెంచి పోషించి, వారికి విద్యా బుద్ధులు నేర్పించి, వారికి వివాహం జరిపించి, (ఆ తర్వాత కూడా) వారి పట్ల సత్రృవర్తన కలిగి ఉంటే, అతనికి స్వర్గం లభిస్తుంది."[2] (హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ (రజి)

3. సాధారణంగా మగపిల్లలను ఎక్కువగా ప్రేమించటం జరుగు తుంది. తిండి, బట్ట, వైద్యం, విద్యాబుద్ధులు మొదలగు అన్ని వ్యవహారాల్లో వారికి ప్రాధాన్యత ఇస్తూ ఉంటారు. ఇది పూర్తిగా అన్యాయం, అధర్మం. హదీసులో దీన్ని వారించటం జరిగింది.

'ఏ వ్యక్తికైనా ఆడపిల్ల ఉండి, అతను ఆమెను సజీవ సమాధి చేయ కుండా, ఆమెను చిన్నచూపు చూడకుండా ఆమెపై మగపిల్ల వానికి ప్రాధాన్యత ఇవ్వకుండా ఉంటే అల్లాహ్ అతన్ని స్వర్గంలో ప్రవేశింపజేస్తాడు'.[3] (హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అబ్బాస్(రజి))

ఈ హదీసుల్లో ఆడపిల్లల పెంపకం, వారికి విద్యాబుద్ధులు

---

1. హాకిం, అల్ ముస్తద్‌రిక్, కితాబుల్ బిర్రి వస్సిలతి, హదీసు-నంబరు 7346-4/95.
2. అబూదావూద్, కితాబుల్ అదబ్, బాబు ఫజ్లి మిన్ ఆలి యతామా.
3. అబూదావూద్, కితాబుల్ అదబ్, బాబు ఫజ్లి మిన్ ఆలి యతామా -అల్ హాకిం, అల్ ముస్తద్రిక్ : కితాబుల్ బిర్రివస్సిలహ్ హదీసు నంబరు 7348.

నేర్పించటం, పెళ్ళిచేయడం ఇంకా వారితో సమభావంతో మెలగటం మూలాన నరకాగ్ని నుండి విముక్తి లభిస్తుందని, స్వర్గం ప్రాప్తం అవుతుందనీ శుభవార్త ఇవ్వబడింది. ఎవరికైతే దైవం, అంతిమ దినం మీద విశ్వాసం లేదో అతను ఈ లోకాన్నే సమస్తం అనుకుంటాడు. దీని ప్రాముఖ్యతను తెలుసుకోలేడు. కాని ఒక విశ్వాసి ప్రధాన లక్ష్యమే పరలోక సాఫల్యం. అతనికి ఈ శుభవార్తలోనే కోరుకున్నదంతా దొరుకుతుంది.

ఈ ప్రోత్సాహంతోపాటు లోకం అనుకుంటున్నట్లు ఆడపిల్లలు దౌర్భాగ్యులో, అభాగ్యులో కాదు అని చెప్పటం జరిగింది. నిజానికి వారు అమూల్యమైన దైవప్రసాదితం. వారిలో ఉండే ప్రేమానురాగాలు మగ పిల్లల్లో కూడా ఉండవు.

దైవప్రవక్త(స) అన్నారనీ, హజ్రత్ ఉఖ్బా బిన్ ఆమిర్(ర) తెలిపారు 'బాలికలను ద్వేషించకండి. వారు సానుభూతిపరురాళ్ళు, ఇంకా ఎంతో విలువైన వాళ్ళు.'[1]

ఇదీ ఆడపిల్లలతో సత్ప్రవర్తన కలిగి ఉండమని చెప్పే బోధన. ఇలాంటి ఉదాహరణ మరెక్కడా కానరాదు. ఇస్లామీయచట్టం ప్రకారం ఒకవేళ సంతానం స్థితిమంతులు కాక, వారి వద్ద సరైన జీవనాధారం గనక లేకపోతే తండ్రిపై వారి పోషణాభారం తప్పనిసరి అవుతుంది. ఈ నియమం ప్రకారం మగపిల్లల మాదిరిగానే ఆడపిల్లల పోషణభారం కూడా అతనికై తప్పనిసరి అవుతుంది. అమ్మాయి పోషణ భారం ఆమె పెళ్ళి అయ్యేంతవరకు తండ్రిపై, తండ్రి లేకపోతే ఆమె దగ్గరి బంధువుపై ఉంటుంది. పెళ్ళి తర్వాత భర్త ఆమె అన్న వస్త్రాలకు బాధ్యుడు. భర్త చనిపోయినా, లేదా అతడు ఆమెకు విడాకులిచ్చినా, స్త్రీ ఆర్థికంగా స్వయాన సంపాదనాపరురాలు కాకపోతే సంతానంపై ఆమె బాధ్యత

1. ముస్నదే అహ్మద్ : ఉఖ్బాబిన్ ఆమిర్ హదీసు, హదీసు నెంబరు- 16922.

ఉంటుంది. సంతానం లేకపోతే తండ్రిపై లేదా ఇతర సమీప బంధువులపై ఆమె బాధ్యత ఉంటుంది. ఇది ఆమె చట్టపరమైన హక్కు కూడాను.

హదీసులో దీనికి మరీ ప్రాముఖ్యత ఇవ్వబడింది.

హజ్రత్ సురాఖా బిన్ మాలిక్(ర) చెప్పుకొచ్చారు. ప్రవక్త(స) 'అన్నింటికంటే గొప్ప దానమేదో నీకు చెప్పనా?' అని నన్ను అడిగారు. తప్పకుండా చెప్పండి అన్నాను.

'(విడాకులు ఇవ్వబడటం వల్ల గాని లేదా వైధవ్యం వల్ల గాని) నీ దగ్గరకు తిప్పి పంపబడిన నీ కుమార్తెకు నువ్వు తప్ప మరెవ్వరూ సంపాదించి పెట్టేవారు లేనప్పుడు నువ్వామెకు మేలు చెయ్యాలి' అని హితబోధ చేశారు.[1]

## సోదరి సేవ, బాధ్యత

స్త్రీ మరోస్థానం చెల్లి. అన్నాచెల్లెళ్ళ బంధం రక్త సంబంధం. వారి మధ్య సహజంగానే ప్రేమానురాగాలు ఉంటాయి. వారి అనుబంధాన్ని ఒక ఆదర్శప్రాయం అనుకుంటూ వుంటారు. కాని కుటుంబ జీవితంలో దీని ప్రాముఖ్యతను పూర్తిగా అర్థం చేసుకోరు. ఇస్లాం ఈ బంధాన్ని పటిష్టపరుస్తుంది. కొన్ని సందర్భాల్లో చెల్లికి అన్న సహాయ సహకారాలు అవసరమవుతాయి. వాటిని పూర్తి చేయడం వల్ల గొప్ప పుణ్యఫలంతోపాటు స్వర్గం వరకు చేరే అవకాశం దొరుకుతుంది. హదీసులో కూతురి మాదిరి చెల్లిని పోషించాలనీ, విద్యాబుద్ధులు నేర్పించాలని, పెళ్ళి జరిపించాలనీ ప్రోత్సహించడం జరిగింది.

1. మస్నదే అహ్మద్ సురాఖా బిన్ మాలిక్ హదీసు 17136– ఇబ్నె మాజ, కితాబుల్ అదబ్, బాబు బిర్రిల్ వాలిది వల్ ఇహ్సాని ఇలల్ బనాతి. హాకిం, అల్ ముస్తద్రక్, కితాబుల్ బిర్రి వస్సిలహ్, హదీసు నంబరు 7345

'మీలో ఎవరికైనా ముగ్గురు కూతుళ్ళు లేదా ముగ్గురు చెల్లెళ్ళు ఉండి అతను వారి పట్ల సత్ప్రవర్తన కలిగి ఉంటే అతను తప్పనిసరిగా స్వర్గంలో ప్రవేశిస్తాడు.' (హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ(ర))[1]

వేరొక హదీసులో ప్రవక్త(స) ఇలా అన్నారని హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ(ర) గారే ఉల్లేఖించారు. ఇద్దరు కూతుళ్ళు లేదా ఇద్దరు చెల్లెళ్ళను ఆదరించి, వారిపట్ల సత్ప్రవర్తన కలిగివుంటే అలాంటి వారికి స్వర్గప్రాప్తి శుభవార్త ఇవ్వబడింది.

'ఎవరికైనా ముగ్గురు కుమార్తెలు లేదా ముగ్గురు అక్కాచెల్లెళ్ళు లేక ఇద్దరు కూతుళ్ళు లేదా ఇద్దరు చెల్లెళ్ళు ఉండి అతను వారితో మంచిగా ప్రవర్తించి వారి పట్ల దైవానికి భయపడితే అతనికి స్వర్గం లభిస్తుంది'.[2]

మరో ఉల్లేఖనంలో కూతుళ్ళను, అక్కాచెల్లెళ్ళను పోషించి, సంరక్షించినందుకు స్వర్గంలో ప్రవక్త(స) సాంగత్యం లభిస్తుందనే శుభవార్త ఇవ్వబడింది.

'ఎవరయినా ఇద్దరు లేదా ముగ్గురు కుమార్తెలను, లేక ఇద్దరు లేదా ముగ్గురు చెల్లెళ్ళను పెంచి, చివరికి వారు చనిపోతే లేదా వారిని వదిలిపెట్టి అతనే చనిపోతే, నేను – అతను స్వర్గంలో ఇలా (కలిసి) ఉంటాం' అంటూ ఆయన(స) తన రెండు వేళ్ళను, చూపుడు వేలుని మధ్యవేలుతో కలిపి సైగ చేసి మరీ చూపించారు.[3]

ప్రవక్త (స) ఇలా ప్రవచించారని హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అబ్బాస్ (ర) అన్నారు.

"ముగ్గురు కుమార్తెలు లేక ముగ్గురు చెల్లెళ్ళు పెరిగి పెద్దవారై ఎవరి

---

1. తిర్మిజీ, కితాబుల్ బిర్రి వస్సిలతి, బాబు మాజాఅఫీన్నఫఖతి అలల్ బనాతి
2. తిర్మిజీ, కితాబుల్ బిర్రి వస్సిలతి...
3. మస్నదె అహ్మద్ : మస్నదె అనస్ బిన్ మాలిక్, హదీసు నంబర్ 12089

మీదా ఆధారపడకుండా ఉండే స్థితికి చేరుకునే వరకూ వారిని పోషించి, విద్యాబుద్ధులు నేర్పి, వారి పట్ల ప్రేమ, వాత్సల్యం కలిగి ఉండే వ్యక్తికి దేవుడు విధిగా స్వర్గప్రాప్తి కలిగిస్తాడు.

ఈ పుణ్యఫలం గురించి విని ఒకతను 'దైవప్రవక్తా(స)! మరి ఇద్దరు అమ్మాయిలు లేదా ఇద్దరు అక్కాచెల్లెళ్లు ఉంటేనూ?' అని అడిగాడు. "అవును, ఇద్దరైనాసరే ఇదే పుణ్యం లభిస్తుంది" అని ఆయన(స) పలికారు. ఒకవేళ అతను ఒకమ్మాయి గురించి అడిగినా, ఆయన(స) ఇదే బదులిచ్చే వారు అని ఉల్లేఖకుడు అన్నారు.[1]

ఈ హదీసుల వల్ల తెలిసేదేమిటంటే ఒకమ్మాయి లేదా ఓ చెల్లిని పోషించి, విద్యాబుద్ధులు నేర్పించినాసరే మనిషి స్వర్గానికి అర్హుడవుతాడు. ఒకవేళ ఒకరికన్నా ఎక్కువ మంది భారం మోయవలసివస్తే అతని అంతస్తులు మరింత పెరుగుతాయని ఆశించవచ్చు.

సహజంగా మనిషికి కూతురిపై ఉండే మమకారం చెల్లిపై ఉండదు. అందుకే ఆమె బెంగ కూడా అతనికి అంతగా ఉండదు. కూతురితో సత్ప్రవర్తన, ఆమె అవసరాలను తీర్చటం మూలాన కలిగే పుణ్యం ఏపాటిదో, చెల్లి పట్ల సత్ప్రవర్తన, ఆమెను ఆదరించటం వల్ల కలిగే పుణ్యఫలం కూడా అలాంటిదే అని ఈ హదీసుల్లో తెలియజేయబడింది. అందుకే మనిషికి కూతురి పట్ల ఉన్న ఆసక్తి చెల్లిపై కూడా ఉండాలి. ఈ బోధనల వల్ల కలిగిన పరివర్తనను ఈ సంఘటన ద్వారా తెలుసుకోవచ్చు.

హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ హరామ్ అన్సారీ(రజి) గారి సంఘటన– ఆయన ఉహుద్ యుద్ధంలో పాల్గొనాలని అనుకున్నప్పుడు, తన కొడుకు హజ్రత్ జాబిర్ (ర)తో ఇలా అన్నారు:

---

1. మిష్కాతుల్ మసాబీహ్, కితాబుల్ ఆదాబ్, బాబు ఫిల్ బిర్రి వస్సిలహ్, షరహుస్సున్నహ్ సౌజన్యంతో.

'బాబూ! ఈ యుద్ధంలో, అందరికన్నా ముందు ప్రాణ త్యాగం చేసేవారిలో నేను కూడా ఉండాలని అనుకుంటున్నాను. నాపై కొంత అప్పు ఉంది. నా తర్వాత నీవు దాన్ని తీర్చు. నీ చెల్లెళ్ళ పట్ల మంచి ప్రవర్తన కలిగివుండాలని, నేను నిన్ను ఆజ్ఞాపిస్తున్నాను'[1].

అప్పుడు హజ్రత్ జాబిర్ (ర) యుక్త వయసులో ఉన్నారు. ఆయన ఒక వితంతువును తన పెళ్ళి కోసం ఎంచుకున్నారు. ప్రవక్త(స), జాబిర్ (ర) వయసును దృష్టిలో పెట్టుకుని "నీవు ఎవరైనా పడుచు అమ్మాయిని చూసి ఎందుకు పెళ్ళాడలేదు? నీవు ఆమెతో ఆటలాడుకుంటే, ఆమె కూడా నీతో సరదాగా ఆడుకుంటుంది కదా! నీవు ఆమెతో సరసాలాడితే, ఆమె కూడా నీతో సరసాలాడుతుంది కదా!" అని అన్నారు.

'దైవప్రవక్తా(స)! నా తండ్రి ఉహూద్ యుద్ధంలో అమరగతి నొందారు. ఆయన తన వెనుక తొమ్మిది మంది అమ్మాయిలను వదిలి వెళ్ళారు. వారు నాకు చెల్లెళ్లు. ఆ అమ్మాయిల సంరక్షణను దృష్టిలో ఉంచుకున్నాను. వాళ్ళతోపాటు వారి మాదిరి అనుభవంలేని మరో అమ్మాయిని చేర్చటం నాకిష్టం లేదు. వాళ్ళకు తల దువ్వి, జడవేసి, ఇంకా వాళ్ళను కనిపెట్టుకొని ఉంటుందని అలాంటి స్త్రీని ఎంచుకున్నాను' అని సమాధానం ఇచ్చారు హజ్రత్ జాబిర్(ర). ఇది విని

'నీవు మంచి పని చేశావు'[2] అన్నారు ప్రవక్త(స).

వాస్తవానికి ఇది ఇస్లామీయ బోధనల ప్రభావమే. ఒక నవ యువకుడు, తన ఎదలో సముద్రపు కెరటాల్లా ఎగిసిపడే కోరికలు

---

1. ఇబ్నె అసీర్ అల్ జజ్‌రీ, అసదుల్ గాబ్బహ్ : 3/344
2. బుఖారీ, కితాబుల్ మగాజీ, ముస్లిం : కితాబుర్రజాయి...

పెట్టుకుని, అతని పడుచుదనం సమ వయస్కురాలు అయిన జోడి కావాలనుకున్నప్పుడు అతను తన చెల్లెళ్ళ కొరకు తన వాంఛల సౌఖ్యాన్ని, యవ్వనపు ఉడుకుదనం అంత సులువుగా అంగీకరించలేని పరిష్కారం వెతుక్కున్నాడు.

చెల్లెలి పట్ల ప్రేమ ఉందని నోటితో చెప్పటం చాలా సులువు. కాని దైవప్రసన్నత పొందాలన్న కోరిక, అంతిమ దినం నాటి పుణ్యఫలం మీద విశ్వాసం లేకుంటే ఇలాంటి త్యాగం చేయటం అంత సులువేమీ కాదు.

ఇస్లాం, అవసరమైనప్పుడు చెల్లెలి పోషణా భారం మోయాలని, విద్యాబుద్ధులు నేర్పించాలని మాత్రమే ప్రేరేపించలేదు. ఇంకా అన్నాచెల్లెలికి చట్టపరంగా హక్కులు కూడా ఇచ్చింది. వారు కొన్ని సందర్భాలలో ఆస్తివాటాలో ఒకరికొకరు హక్కుదారులవుతారు. ఇంకా వారిపై, వారి పోషణాభారం కూడా తప్పనిసరి అవుతుంది. ఇది ఎలాంటి సాహసమంటే స్త్రీ చరిత్రలోనే మరెక్కడా కానరాని నిదర్శనం.



# ముస్లిం మహిళ చరిత్ర

## విశ్వాసం, ఆరాధనల కాంతిమయ తార్కాణాలు

నేటి ఆధునిక కాలంలో స్త్రీ అభ్యుదయం గురించి గొప్ప గొప్ప చర్చలు జరుగుతున్నాయి. కాని ఈ ప్రగతి సాధించటం కోసం ఆమెకు పెద్ద మూల్యం చెల్లించాల్సి వచ్చింది. అది ఇంటిని నాశనం చేసి అంగళ్ళను ప్రకాశింప జేసింది. ఇల్లు, కుటుంబం నిర్మితమైంది. దీనికి పూర్తి విరుద్ధంగా ముస్లిం మహిళలు ఇంటి బాధ్యతలను నెరవేరుస్తూ వాటి హక్కులను నిర్వర్తిస్తూ దైవంతో చేసి వున్న తమ ఒప్పందాన్ని పూర్తి చేశారు. ఆయనతో ఆధ్యాత్మిక సంబంధాన్ని బలపరచుకుంటూనే విద్య, సమాజ, రాజకీయ, అధికారపుటంచుల వరకు తమ లోతైన ఆనవాళ్ళు వదిలి వెళ్ళారు. ఇక్కడ తొలుత ధర్మంపై వారి స్థిరత్వం, ఆరాధనల పట్ల వారికున్న మక్కువ గురించి కాస్తంత చర్చించటం జరిగింది.

## ఇస్లాం స్వీకరణలో ముందడుగు

ఇస్లామీయ చరిత్రను స్త్రీ పురుషులిద్దరూ కలిసి నిర్మించారు. ఒకవేళ ఇందులో నుంచి అతివల భాగాన్ని తీసేస్తే అది అసంపూర్ణంగా, పాక్షికంగా ఉండిపోతుంది. దైవప్రవక్త(స) ఇస్లాం వైపునకు పిలిచినప్పుడు మగ వారితోపాటు ఆడవాళ్ళు కూడా ముందుకొచ్చి మరీ దాన్ని స్వీకరించారు.

ఇస్లాం కోసం తమ ఇల్లూ వాకిళ్ళను, ఆస్తిపాస్తులను వదిలారు. ఆప్తులను, మిత్రులను వీడారు. అన్నివిధాల కష్టనష్టాలకు ఓర్చుకుని పరీక్షల ఈ పెనుతుఫానులో కొండల్లా స్థిరంగా ఉండిపోయారు. తమ ధనప్రాణాలను సైతం త్యాగం చేశారు. ఆమోదయోగ్యమైన ప్రార్థనలు చేస్తూ పశ్చాత్తాపం చెందుతూ మన్నింపు కోసం వేడుకుంటూ ముందుకు నడిచారు. అల్లాహ్ వారి ప్రార్థనలు ఆలకించాడు. పురుషులతోపాటు స్త్రీలకు కూడా స్వర్గప్రాప్తి శుభవార్త ఇచ్చాడు. ఇరువురినీ తన అనుగ్రహాలు, బహుమానాలకు అర్హులు చేశాడు.

అల్లాహ్ ఇలా సెలవిస్తున్నాడు :

**'మీలోని ఎవరి శ్రమనూ నేను వృథాగా పోనివ్వను. పురుషుడైనా స్త్రీ అయినా మీరంతా ఒకే రాశికి చెందినవారు. కనుక నా కొరకు తమ దేశాన్ని విడిచిపెట్టినవారు, నా మార్గంలో తమ గృహాల నుండి గెంటి వేయబడినవారు, హింసించబడిన వారు, నా కొరకు పోరాడి చంప బడినవారు– అటువంటి వారి తప్పులన్నింటినీ నేను క్షమిస్తాను. క్రింద సెలయేళ్ళు ప్రవహించే ఉద్యాన వనాలలోకి వారిని ప్రవేశింపజేస్తాను' ఇది అల్లాహ్ వద్ద వారికి లభించే ప్రతిఫలం. ఉత్తమమైన ప్రతిఫలం అల్లాహ్ వద్దనే ఉంది. *(ఆలి ఇమ్రాన్: 195)***

దైవప్రవక్త ముహమ్మద్(స) దౌత్య ప్రకటన చేసిన వెంటనే హజ్రత్ ఖదీజా(ర) ఇస్లాం స్వీకరించారు. ఇలా అందరికంటే ముందు ఆయన్ను (స) విశ్వసించే అదృష్టం ఒక స్త్రీకి దక్కింది.

అల్లామా ఇబ్నె అసీర్ అంటున్నారు :

'ఆమె దైవసృష్టిరాసుల్లో అందరికంటే ముందు ఇస్లాం స్వీకరించిన

మహిళ. ఈ విషయంతో ముస్లింలందరూ ఏకీభవించారు. ఈ విషయంలో ఏ ఒక్క పురుషుడు గానీ, మహిళ గానీ ఆమెను అధిగమించలేదు.[1]

హజ్రత్ ఉమర్(ర), హజ్రత్ హమ్జా (ర) కన్నా మునుపు ఇస్లాం స్వీకరించిన వారిని ఇమామ్ జహబీ(రహ్మ), **అస్సాబి ఖూనల్ అవ్వలూన్** (అందరికంటే ముందు ఇస్లాం స్వీకరించారు)లో చేర్చారు. వీరు యాభై ఒక్క మంది ఉన్నారు. ఇలాంటి సాహసికుల్లో దిగువనున్న స్త్రీలు కూడా ఉన్నారు.

హజ్రత్ ఖదీజా(రజి), హజ్రత్ అస్మా బిన్తె అబూబకర్(ర), హజ్రత్ అస్మా బిన్తె సలామా(ర), హజ్రత్ అస్మా బిన్తె ఉమైస్(ర), ఫాతిమా బిన్తె అల్ ముజ్లిల్(ర), ఫాకిహా బిన్తె యసార్(ర), రమ్లా బిన్తె అబీ ఔఫ్(ర), అమీనా బిన్తె ఖల్ఫ్(ర)[2]

## ధర్మంపై స్థిరత్వం

మక్కా నగరంలో, దైవప్రవక్త(స)ను విశ్వసించి ఏకేశ్వర నినాదం చేసిన వారికి కఠిన పరీక్షలు తప్పేవి కావు. బానిసలను, దాసీలను కాపాడేవాళ్ళు, విడిపించేవాళ్ళు లేకపోవటం మూలాన వారిని ఇలా ఎక్కువగా పీడించి హింసించేవారు. వారిని ఏవిధంగా కష్టాలకు, బాధలకు గురిచేసేవారో ఊహించుకుంటేనే వణుకు పుట్టుకొస్తుంది. అయినప్పటికీ వారి నిలకడను చూసి లోకం సైతం నివ్వెరపోయింది. వారిలో ఎవరైతే ఇస్లాం స్వీకరించారో వారి స్థిర అడుగులు ఏ మాత్రం తడబడలేదు.

మక్కా తొలి రోజుల్లో ఏ అదృష్టవంతులు, సాహసవంతులు అయితే ఇస్లాంలో వచ్చారో వారిలో అమ్మార్ బిన్ యాసిర్ కుటుంబం కూడా

1. ఇబ్నుల్ అసీరి అల్ జజ్రీ, అసదుల్ గాబ్బాహ్ ఫీమఅరిఫతిల్ సహాబా: 7/80
2. జహబీ, సియరు ఆలాముమ్నుబలాయి : 10/99-101

ఉంది. మిట్ట మధ్యాహ్నం వేళ ఆ కుటుంబీకులందరినీ బాగా వేడెక్కిన ఇసుకపై పడుకోబెట్టేవారు. ప్రవక్త(స) అట్నుంచి వెళుతూ వారిని 'ఓ యాసిర్ కుటుంబీకుల్లారా! సహనం వహించండి. స్వర్గంలో కలుసు కుందాం' అని ఓదార్చేవారు. అమ్మార్ బిన్ యాసిర్(ర) తల్లి పేరు సుమయ్యా. ఆమె అబూహుజైఫా బిన్ ముగీరా దాసిగా ఉండేవారు. ముసలితనం వల్ల మరింత బలహీనురాలై పోయారు. ఆ ముసలి ప్రాణా లను అన్నివిధాల బాధలకు గురిచేయడం జరిగేది. కాని ఈ యాతన ఆమెను, ఆమె ధర్మం నుంచి గానీ విశ్వాసం నుంచి గానీ మరల్చలేక పోయింది. ఓ రోజు అబూజహల్ ఆమెను సత్యధర్మం స్వీకరించినందుకు శాస్తిగా ఆమె మర్మ స్థానంలో బల్లెం పొడిచి చంపేశాడు. ఇది ప్రవక్త(స) సందేశం స్వీకరించినందుకు ప్రాప్తమయిన తొలి వీర మరణం.

'అమ్మార్ తల్లి సుమయ్యా(ర) ఇస్లాం (మార్గం)లో అమరగతి నొందినవారిలో తొలి అమరగతి నొందిన మహిళ'[1] అని హజ్రత్ ముజాహిద్ అంటున్నారు.

జన్నీరా ఒక రోమన్ బానిసరాలు. ఇస్లాం స్వీకరించాక ఆమెను కఠినశిక్షలకు గురి చేయడం జరిగేది. చివరికి అబూబకర్(ర) ఆమెను కొనుగోలు చేసి స్వేచ్ఛను ప్రసాదించారు. దాంతో ఆమె బానిసత్వం నుండి బయటపడ్డారు. దురదృష్టవశాత్తు ఆ కాలంలోనే ఆమె చూపుపోయింది. లాత్, ఉజ్జా దేవతలు ఆమెను అంధురాలిగా చేశారని అవిశ్వాసులు దెప్పిపొడిచేవారు. కాని ఆ దైవదాసురాలి నమ్మకం, విశ్వాసంలో ఏమాత్రం మార్పు రాలేదు. పైగా ఆమె 'మీరు అబద్ధమాడుతున్నారు. లాత్, ఉజ్జా లాభం కానీ నష్టం గానీ కల్పించలేవు' అనేవారు. ఆమె మాటలు దైవానికి ఎంతగా నచ్చాయంటే ఆమె కంటి చూపు తిరిగి వచ్చింది.[2]

---

1. ఇబ్నెసాద్, అత్తబఖాతుల్ కుబ్రా : 8/264, 265.
2. ఇబ్నెహిషాం, అస్సీరతున్నబవియ్యహ్ : 1/ 355- ఇబ్నె అసీర్, అసదుల్ గాబ్బహ్: 7/124- ఇబ్నె హజర్ అల్ ఇసాబాఫీత్తమీజిస్సహాబా : 8/150-151

బనీ మో'మిల్‌కు చెందిన ఒక దాసి, హజ్రత్ ఉమర్(ర) ఇస్లాం స్వీకరించక మునుపే ముస్లిం అయ్యారు. ఉమర్(ర) ఆమెను ఇస్లాం వదలిపెట్టమని శిక్షించేవారు. ఆయన అలసిపోయినప్పుడు 'ఇప్పుడు బయటపడ్డానని అనుకోకు, కొద్దిసేపు విశ్రాంతి తీసుకున్నాక మళ్ళీ నీ పని చెప్తాను' అనేవారు.

ఉమర్(ర) కరుకుదనం కూడా ఆమెను ఇస్లాం నుంచి మరల్చలేక పోయింది. ఆమె కేవలం 'పైవాడు నీతో కూడా ఇలాగే చేయాలి' అనేవారు. హజ్రత్ అబూబకర్(ర) ఆమెను కొని స్వేచ్ఛ ఇచ్చేవరకు ఆమె ఈ యాతన భరిస్తూనే ఉండేది.[1]

'హజ్రత్ బిలాల్ (ర) తల్లిపేరు హమామ. ఇస్లాం స్వీకరించినందుకు (బిలాల్(ర) లానే) ఆమెను కూడా తీవ్ర యాతనలకు గురిచేసేవారు. అబూబకర్(ర) కొని, స్వేచ్ఛను ప్రసాదించినవారిలో ఆమె కూడా ఉన్నారు' అని అల్లామా ఇబ్నె అబ్దుల్ బర్ర్ తెలిపారు.[2]

ఉమ్మె ఉబైస్(ర), బనూతైమ్ బిన్ మర్రా లేదా బనూ జుహ్రా సేవకురాలు, ఆమెను కూడా విశ్వసించినందుకు తీవ్ర బాధలకు లోను చేసేవారు. అబూబకర్(ర) ఆమెను కూడా కొని స్వేచ్ఛనిచ్చారు.[3]

హవ్వా బిన్తె జైద్ బిన్ సకన్(ర) హిజ్రత్ కంటే చాలా ముందు మదీనాలో ముస్లింగా మారారు. కాని ఆమె భర్త ఖైస్ బిన్ హతీం ఇస్లాం స్వీకరించలేదు సరికదా! ఆమెను అతిహీనంగా కష్టపెట్టేవారు. అయినా

---

1. ఇబ్నె హిషాం. అస్సీరతున్నబవియ్యహ్ : 1/653
2. ఇబ్నె అబ్దుల్ బర్ర్, అల్ ఇస్తీఆబ్ : 4/872– ఇబ్నె అసీర్, అసదుల్ గాబ్బహ్, 7/17– ఇబ్నెహజర్ అల్ ఇసాబహ్ : 8/88
3. ఇబ్నెహిషాం, అస్సీరతున్నబవియ్యహ్ : 1/355– ఇబ్నెహజర్, అల్ ఇసాబహ్ ఫీ తమీజిస్సహాబా : 8/434

ఆమె స్థిరంగానే ఉండేవారు. ఆయన(స)కు ఈ వార్త తెలిసింది. జుల్ మజాజ్ తిరునాళ్ళలో ఖైస్ బిన్ హతీం వచ్చాడు. ఆయన(స), అతణ్ణి కలిసి ఇస్లాం గురించి చెప్పారు కానీ అతను ఇస్లామ్ స్వీకరించలేదు. 'నీ ఇల్లాలు నీ ధర్మాన్ని వీడినప్పట్నుంచి నీవు ఆమెతో నీచంగా ప్రవర్తిస్తున్నావని తెలిసింది. దైవానికి భయపడు. ఈ విషయంలో నా మాటలు గుర్తుంచుకో, ఆమెను ఏడ్పించకు' అని ఆయన(స) హితబోధ చేశారు. తన అర్ధాంగిని కష్టపెట్టనని మాటిచ్చి అతను మదీనా వెళ్ళిపోయాడు. తర్వాత భార్యతో ఆయన్ను(స) కలిసిన సంగతి చెబుతూ నీవు నీ ధర్మాన్ని అనుసరించు, నేను నిన్ను అడ్డగించను అని అన్నాడు.[1]

హ(జత్ ఉమ్మె హబీబా బిన్తె అబూ సుఫ్యాన్(ర), ఆమె భర్త ఉబైదుల్లాహ్ బిన్ జహష్ మక్కా లో తొలి రోజుల్లోనే ఇస్లాం స్వీకరించారు. ఇద్దరూ హబ్షాకు హి(జత్ చేసి వెళ్ళారు. అక్కడికి వెళ్ళాక ఉబైదుల్లాహ్ క్రైస్తవ మతాన్ని తీసుకున్నారు. పరదేశంలో ఉమ్మె హబీబా(ర) కోసం అది పరీక్షా సమయం. అయినా కూడా ఆమె తన ధర్మంపై స్థిరంగా ఉన్నారు. ఆ తర్వాత దైవప్రవక్త(స) ఆమెకు వివాహ సందేశాన్ని పంపించారు. ఆమెను వివాహమాడారు.[2]

## ఆరాధన పట్ల మక్కువ

ఆరాధన, ధర్మానికి ప్రాణంలాంటిది. ఇది దైవంతో దాసుడికి ఉన్న సంబంధాన్ని తెలియజేస్తుంది. ఆచరణ, ఆరాధనల వల్ల దైవంతో

---

1. ఇబ్నెసాద్. అత్తబఖాతుల్ కుబ్రా : 8/323, 324– ఆమె, ఆమె భర్త వంశ పరంపర విషయంలో కొద్దిపాటి భేదం ఉంది. అసదుల్ గాబ్బహ్ : 7/75,76
2. ఇబ్నెసాద్. అత్తబఖాతుల్ కుబ్రా : 8/96,97. ఇబ్నె అసీర్ జజ్రీ, అసదుల్ గాబ్బహ్ : 7/303

ఉన్న బంధం మరింత దృఢమవుతుంది. ఆరాధన పట్ల అశ్రద్ధ, అజాగ్రత్తలు ఈ బంధాన్ని బలహీనంపై బలహీనం చేసస్తూ పోతాయి. దీన్ని అధిగమించకపోతే దైవంతో దాసుడికి ఉన్న బంధం తెగిపోగలదు. మునుపటి కాలంలోని పురుషుల్లాగే స్త్రీలు కూడా ఆరాధన పట్ల చాలా ఆసక్తి కనబరచేవారు. ఉమ్ముహాతుల్ మోమినీన్ (విశ్వాసుల తల్లులు) ఈ విషయంలో అందరికంటే ముందుండేవారు.

విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ జైనబ్ బిన్తె జహష్ గురించి హజ్రత్ ఉమ్మె సలమా ఇలా అంటున్నారు.

**'ఆమె సజ్జనురాలు, చాలా ఎక్కువగా ఉపవాసాలు ఉండేది, రాత్రి పొద్దుపోయేవరకు మేల్కొని (నమాజ్‌లో) ఉండే మహిళ ఆమె.**[1]

'ధర్మం విషయంలో దైవభీతి, యదార్థవాదం, బంధువుల హక్కులు నెరవేర్చటం, దానధర్మాల్లోనూ, ఆమెకన్నా ఉత్తమురాలైన మరో స్త్రీని నేను చూడలేదు' అని హజ్రత్ ఆయెషా(ర) అన్నారు.[2]

ఓ సందర్భంలో స్వయంగా దైవప్రవక్త(స) ఆమె మంచితనం, దైవభీతి గురించి సాక్ష్యమిస్తూ హజ్రత్ ఉమర్(ర)తో, 'జైనబ్ బిన్తె జహష్ వినయ విధేయతలు కలిగినది. దైవానికి భయపడే స్త్రీ' అన్నారు.[3]

## నమాజ్ పట్ల శ్రద్ధ

ఆరాధనల్లో నమాజ్ అన్నిటికన్నా ఎక్కువ ప్రాముఖ్యత కలది. దీనికి కొన్ని నియమాలు, పద్ధతులు ఉన్నాయి. వాటిని పాటించకుండా దాని

---

1. ఇబ్నెసాద్, అత్తబఖాతుల్ కుబ్రా : 8/103
2. ఇబ్నె అబ్దుల్ బర్ర్, అల్ ఇస్తీఆబ్ ఫీ అస్మాయిల్ అస్‌హాబ్ : 4/407
3. ఇబ్నె అబ్దుల్ బర్ర్, అల్ ఇస్తీఆబ్ ఫీ అస్మాయిల్ అస్‌హాబ్ : 4/408

హక్కును నిర్వర్తించలేం, అలాగే దాంతో పూర్తి లాభాన్ని కూడా పొందలేం. ఈ నియమాల్లోని ఓ నియమం సకాలంలో నమాజ్ చేయటం.

ఒక అన్సారీ మహిళ ఉమ్మె అనస్(ర), 'దైవప్రవక్తా(స)! ఇషా నమాజ్ కంటే ముందే నాకు నిద్ర ముంచుకొస్తుంది. (ఎక్కడ నమాజ్ తప్పిపోతుందోనన్న భయం ఉంటుంది)' అన్నారు.

'అలాగైతే ఉమ్మె అనస్(ర)! నమాజ్ తొందరగా చదివేసేయి. రాత్రిపూట చీకటి అన్నివైపులా అలుముకుంటే ఇషా వేళ అయినట్టే. అప్పుడు నమాజ్ చేసేయి, నీపై ఏ పాపము ఉండదు' అని ఆయన(స) సలహా ఇచ్చారు.[1]

దీనినిబట్టి ఆమె నమాజ్‌ను ఏ మేరకు నిర్వర్తించేదో తెలుస్తుంది. ఎక్కడ తన నమాజ్ తప్పిపోతుందోనన్న బెంగ ఆమెకు ఉండేది.

మైమూన్ బిన్ మహ్‌రాన్ 'నేను నమాజ్‌వేళల్లో ఎప్పుడు హజ్రత్ ఉమ్మె దర్దా(ర)ను కలవటానికి వెళ్ళినా ఆమె నమాజ్‌లోనే కనిపించేవార'ని అన్నారు.[2]

## సామూహిక నమాజ్‌లో పాల్గొనటం

మహిళలు మస్జిద్‌లో సామూహికంగా నమాజ్ చేయవల్సిన అవసరం లేదు. వారు ఇంట్లోనే నమాజ్ నిర్వర్తించటం మరింత ప్రీతికరమైనది. అయితే సామూహిక నమాజ్ వల్ల చాలా లాభాలున్నాయి. ఒకవేళ పరిస్థితులు అనుకూలిస్తే నైతిక పతనం వాటిల్లే ప్రమాదం లేకుంటే, వారు కూడా మస్జిద్‌కి వెళ్ళవచ్చు. ఈ కారణం చేతనే షరీఅత్ ఓ వైపు

1. ఇబ్నె అసీర్ జజ్రీ, అసదుల్ గాబ్బహ్ : 7/289– ఇబ్నె హజర్, అల్ ఇసాబహ్ : 8/357
2. నవవీ, తహ్‌జీబుల్ అస్మాయి వల్లుగాతి : 2/361

వాళ్ళను ఇంట్లోనే నమాజ్ చేయమని ప్రేరేపిస్తూనే మరోవైపు వాళ్ళు గనక మస్జిద్ వెళ్లదలిస్తే వారిని ఆపకండని మగవాళ్ళను ఆదేశిస్తుంది.

'మీలో ఎవరితోనైనా అతని స్త్రీ, మస్జిద్ వెళ్ళటానికి అనుమతి కోరితే ఆమెను ఆపవద్దని ఆయన(స) చెప్పారని హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ ఉమర్(ర) తెలిపారు'.[1]

ఇదే హదీసు ఈ పదాల్లో కూడా ఉంది–

'మస్జిద్‌లలో స్త్రీల కోసం కేటాయించిన వారి భాగం నుంచి వారిని వారించవద్దు'[2]

వేరొక ఉల్లేఖనంలో 'మీ స్త్రీలు మస్జిద్ వెళ్ళాలనుకుంటే అడ్డగించకండి. కానీ వాళ్ళకు వారి ఇల్లే మేలైంది' అని ఉంది.[3]

ఈ అనుమతి ఎక్కువగా ఇషా, ఫజ్ర్‌లకు సంబంధించింది. ఎందుకంటే ఇదే హదీసు ఈ పదాల్లోనూ ఉల్లేఖించబడింది. 'మీ స్త్రీలు రాత్రిపూట మస్జిద్ వెళ్ళటానికి అనుమతి కోరితే వారిని అనుమతించండి'[4]

దీనివల్ల తెలిసేదేమిటంటే దైవప్రవక్త(స) కాలంలో ముఖ్యంగా ఇషా, ఫజ్ర్ వేళల్లో మహిళలకు జమాఅత్‌లో పాల్గొనే అనుమతి ఉండేది. వాస్తవానికి వారు ఈ నమాజుల్లోనే పాల్గొనేవారనీ ఉల్లేఖనాల ద్వారా స్పష్టమవుతుంది. దిగువన ఈ క్రమంలోని కొన్ని ఉల్లేఖనాలు మీ ముందుంచబడుతున్నాయి.

---

1. బుఖారీ, కితాబుల్ అజాన్, బాబు ఇస్తీజానిల్ మర్అతి జౌజహా– ముస్లిం, కితాబుస్సలాతి, బాబు ఖురూజిన్నిసాయి ఇలల్ మసాజిద్...
2. ముస్లిం– కితాబుస్సలాతి, బాబు ఖురూజిన్నిసాయి ఇలల్ మసాజిద్,
3. అబూదావూద్, కితాబుస్సలాతి, బాబు మాజాఅ ఫీ ఖురూజిన్నిసాయి ఇలల్ మస్జిద్
4. బుఖారీ, కితాబుల్ అజాన్, బాబు ఖురూజిన్నిసాయి ఇలల్ మసాజిద్, బిల్లైలి వల్ గల్స్– ముస్లిం, కితాబుస్సలాతి, బాబు ఖురూజిన్నిసాయి ఇలల్ మసాజిద్

1. 'దైవప్రవక్త(స) ఫజ్ర్ నమాజ్ ఎంతటి చీకట్లో చేసేవారంటే స్త్రీలు దుప్పట్లు చుట్టుకొని తమ ఇండ్లకు వెళ్ళిపోయేవారు. చీకటి కారణంగా గుర్తించబడేవారు కాదు' అని ఆయెషా(ర) తెలిపారు.[1] హజ్రత్ ఉమ్మె సలమా (ర) చెప్పుకొచ్చారు.
2. దైవప్రవక్త(స) కాలంలో మహిళలు ఫర్జ్ నమాజు నుంచి సలాం తిరిగిన వెంటనే లేచి నిలబడేవారు. ఆయన(స), ఆయనతోపాటు నమాజు ముగించిన మగవాళ్ళు దైవం కోరేవరకు తమ స్థానాల్లోనే కూర్చుండి పోయేవారు (స్త్రీలు ముందుగా మస్జిద్ నుంచి బయటికి వెళ్ళేందుకు). ఆయన(స) లేచాక వారు కూడా లేచేవారు.[2]
3. 'నేను నమాజ్ కోసం నిలబడినప్పుడు పెద్ద సూరాలు పఠించాలను కుంటాను. ఇంతలో ఎవరో పిల్లవాడి ఏడ్పు వినబడి నమాజును క్లుప్తంగా చేసేస్తాను. అతని తల్లిని ఇరకాటంలో పడేయటం నాకు నచ్చదు' అని ఆయన(స) అన్నారని హజ్రత్ అబూ ఖతాదా(ర) చెప్పారు.[3]
4. ఒకసారి ఇషా నమాజుకు అసాధారణంగా ఆలస్యం అయిపోయింది. ప్రవక్త(స) నమాజ్ చేయించటానికి గది నుండి బయటికి రాలేదు. హజ్రత్ ఉమర్(ర) ఆయన(స)కు తెలియజేయటం కోసం పెద్ద గొంతుతో 'మహిళలు, పిల్లలు పడుకున్నారు' అని అన్నారు. ఇది విని ఆయన(స) నమాజు కోసం వేంచేశారు.[4]

---

1. బుఖారీ, కితాబుల్ అజాన్, బాబు ఖురూజిన్నిసాయి ఇలల్ మసాజిది బిల్లైలి వల్ గల్సి- ముస్లిం, కితాబుల్ మసాజిద్, బాబు ఇస్తిహ్‌బాబిత్తబ్‌కీరి బిస్సుబ్‌హ్...
2. బుఖారీ, కితాబుల్ అజాన్, బాబు ఖురూజిన్నిసాయి ఇలల్ మసాజిది బిల్లైలి.
3. బుఖారీ, కితాబుల్ అజాన్, బాబు ఖురూజిన్నిసాయి ఇలల్ మసాజిది బిల్లైలి..
4. బుఖారీ, కితాబుల్ అజాన్, బాబు ఖురూజిన్నిసాయి ఇలల్ మస్జిది బిల్లైలి..

5. 'మీలో ఏ స్త్రీ అయితే ఇషా నమాజులో పాల్గొంటుందో ఆమె ఆ రేయి సువాసన పూసుకోకూడదు' అని ఆయన(స) అన్నారని జైనబ్ అస్సఖఫియా ఉల్లేఖించారు.[1]
6. ఇదే ఉల్లేఖనం హజ్రత్ అబూహురైరా(ర) నుంచి కూడా వచ్చింది. 'ఏ మహిళ అయితే సుగంధాన్ని పూసుకుందో ఆమె మాతోపాటు ఇషా నమాజులో పాల్గొనకూడదు' అని ఆయన(స) అన్నారు.[2]

ఈ ఉల్లేఖనాల ద్వారా తెలిసేదేమిటంటే మహిళలు సామూహిక నమాజ్ చేయటానికి ఇషా, ఫజ్ర్ వేళల్లో మస్జిద్‌కు వెళ్ళేవారు. బహుశా ఈ నమాజుల్లో ఎక్కువగా పెద్దవారు, వయస్సు పైబడిన మహిళలు పాల్గొనేవారేమో! ఉమ్మె సలమా బిన్తె అబూ హకీం 'వృద్ధ మహిళలు ఆయన(స)తోపాటు ఫర్జ్ నమాజులు చేయటం నేను చూశాన'[3]ని అన్నారు.

## దైవస్మరణ

దైవప్రవక్త(స) స్త్రీలకు ప్రార్థన, దైవ సంస్మరణ, దేవుని పవిత్రతను కొనియాడటం గురించి కూడా ఆదేశించారు. యుసైరా బిన్తె యాసిర్(ర), దైవప్రవక్త(స) అన్నారని తెలియపరిచారు-

'మహిళల్లారా! మీరు తస్బీహ్ (సుబ్‌హానల్లాహ్), తహ్లీల్ (లా ఇలాహ ఇల్లల్లాహ్), తఖ్దీస్(సుబ్బూహున్, ఖుద్దూసూన్)ని తప్పనిసరి చేసుకోండి. చేతివేళ్ళ కణుపులతో వాటిని లెక్కించండి. ఎందుకంటే వేళ్లను

---

1. ముస్లిమ్ : కితాబుస్సలాతి, బాబు ఖురూజిన్నిసాయి ఇలల్ మసాజిద్.
2. ముస్లిమ్ : కితాబుస్సలాతి, బాబు ఖురూజిన్నిసాయి ఇలల్ మసాజిద్.
3. ఇబ్నె అబ్దుల్ బర్ర్, అల్ ఇస్తీఆబ్‌ఫీ అస్మాయిల్ అస్‌హాబ్ : 4/49– ఇబ్నె హజర్, అల్ ఇసాబా : 8/410, 411– ఇబ్నె అసీర్ అల్ జజ్రీ, అసదుల్ గాబ్బహ్ : 7/331

కూడా అడగటం జరుగుతుంది. వాటితో చెప్పించటం జరుగుతుంది. ధ్యానం పట్ల అశ్రద్ధ వహించకండి. లేకపోతే దైవ కారుణ్యం నుండి దూరమైపోతారు.'[1]

దైవప్రవక్త(స) కొన్ని సందర్భాల్లో పడతులను ప్రత్యేకమైన ప్రార్థనలు చేయమని ఉపదేశించారు. హజ్రత్ అలీ(ర) చెప్పుకొచ్చారు: హజ్రత్ ఫాతిమా(ర) వద్ద ఒక్క దాసి కూడా లేదు. ఇంటి పనంతా ఆమె చేసుకొచ్చేది. పిండి విసరటం వల్ల చేతులు బొబ్బలెక్కాయి. ఒకసారి కొందరు బానిసలు వచ్చి ఉన్నారని తెలిసింది. హజ్రత్ ఫాతిమా(ర) ఆయన(స)తో తన కష్టాలు చెప్పుకొని ఒక దాసిని అడుగుదామని వెళ్లారు. అప్పుడు ఆయన(స) ఇంట్లో లేరు. హజ్రత్ ఆయెషా(ర)తో విషయం చెప్పి వచ్చేశారు. తర్వాత ఆయెషా(ర), దైవప్రవక్త(స) ముందు ఫాతిమా(ర) వచ్చి వెళ్ళిన విషయం, ఆమె అవసరం గురించి ప్రస్తావించారు. ఆయన(స) ఆ రేయి మా ఇంటికొచ్చారు. అప్పటికే మేం నడుం వాల్చాం. ఆయన్ను(స) చూసి లేచి కూర్చున్నాం. ఆయన(స) "ఫర్వాలేదు, పడుకొనే ఉండండి" అన్నారు. ఆయన(స) మా ఇద్దరి మధ్య ఎలా కూర్చున్నారంటే మంగళప్రదమైన ఆయన పాదం నా పొట్టకు ఆనుకొని ఉంది. నేను దాని చలువను ఆస్వాదిస్తున్నాను. ఆయన(స) "మీరు అడిగిన దానికన్నా ఉత్తమమైన వస్తువు గురించి చెప్పనా?" అన్నారు. అదేమిటంటే పడక మీదకు చేరుకున్నప్పుడు ముప్పైమూడు సార్లు సుబ్‌హానల్లాహ్, ముప్పై మూడు సార్లు అల్‌హమ్దులిల్లాహ్ ఇంకా ముప్పై నాలుగు సార్లు అల్లాహు అక్బర్ పఠించండి. ఇది మీకు దాసీకన్నా ఉత్తమమైంది" అని అన్నారు.[2]

---

1. తిర్మిజీ కితాబుద్దఅవాత్, బాబు మాజాఅ ఫీ తస్బీహ్– అబూదావూద్, కితాబుల్ విత్ర్, బాబుత్తస్బీహ్ బిల్‌హుస్సా.
1. బుఖారీ, కితాబు ఫజాయిలి అస్‌హాబిన్నబియ్యి, బాబు మునాఖిబి అలీ బిన్ అబీ తాలిబ్ అల్ ఖుర్షీ

వేరొక ఉల్లేఖనంలో ఆయన(స) ఈ వచనాలు ప్రతి నమాజ్ తర్వాత ఇంకా పడుకొనేటప్పుడు పఠించమన్నారు.[1]

హజ్రత్ ఫాతిమా(ర) సేవకురాలి కోసం అడగ్గా, బదులుగా ఆయన(స) దేవుని తస్బీహ్, తహ్మీద్, తక్బీర్‌ల గురించి ఉపదేశించారు. అల్లాహ్ ధ్యానం వల్ల మనిషిలో పనిచేసే శక్తి సామర్థ్యాలు మరింత పెరుగుతాయి అని దీనిద్వారా తెలియజేయడం జరిగింది.

ప్రవక్త(స) గారి ఓ కుమార్తె, ఆయన(స) ఈ దుఆ చేయమని బోధించేవారని చెప్పారు.

**"సుబ్‌హానల్లాహి వ బిహమ్దిహీ వలా ఖువ్వత ఇల్లాబిల్లాహి మాషా అల్లాహు కాన వమా లమ్ యషాలమ్ యకున్ ఆలము అన్నల్లాహ అలా కుల్లి షైయిన్ ఖదీర్. వ అన్నల్లాహ ఖద్ అహాత బికుల్లి షైయిన్ ఇల్మా".**

(నేను అల్లాహ్‌ను స్తుతించడంతోపాటు ఆయన పరిశుద్ధతను కొనియాడుతున్నాను. శక్తి కేవలం దైవం తరఫున లభిస్తుంది. ఆయన కోరుకున్నదే జరుగుతుంది. ఆయన ఇష్టపడనిది ఏదీ జరగదు. ఇంకా ఆయన జ్ఞానం ప్రతి వస్తువుపై ఆవరించి ఉన్నది)

ఏ వ్యక్తి అయితే ఉదయం పూట ఈ దుఆ చదువుతాడో అతను సాయంత్రం వరకు, ఎవరైతే సాయంకాలం చదువుతాడో అతను పొద్దున వరకు దేవుని సంరక్షణలో ఉంటాడని ఆయన(స) అన్నారు.[2]

ఈ వచనాల్లో దైవంపై భరోసా, నమ్మకం, సమర్పణల గురించి స్పష్టం చేయబడింది. ఒకవేళ అవి వాస్తవానికి మనసులో జనించి ఆపై

---

1. ముస్లిం, కితాబుజ్జిక్రీ వద్దుఆయి, బాబుత్తస్బీహి అవ్వలిన్నహారి వ యిందన్నౌం
2. అబూదావూద్, కితాబుల్ అదబ్, బాబు మాయఖూలు ఇజా అస్బహ

మనిషి తన నోటితో కూడా ఉచ్చరిస్తే రేయింబవళ్ళు అతన్ని అల్లాహ్ తన రక్షణలో తీసుకుంటాడనే నమ్మకం ఉంది.

విశ్వాసుల మాతృమూర్తులు, ఇంకా ఇతర స్త్రీలు నిత్య పారాయణం, ధ్యానం, దైవస్మరణలో ఎంతగా లీనమయ్యేవారో ఆ వైనాన్ని కింద ఇవ్వబడిన ఒకట్రొండు సంఘటనల ఆధారంగా తెలుసుకోవచ్చు.

దైవప్రవక్త(స) ఫజ్ర్ నమాజు తర్వాత విశ్వాసుల తల్లి హజ్రత్ జువైరియా(ర) దగ్గరి నుండి బయటికెళ్ళారు. అప్పుడు ఆమె తన జానిమాజ్‌పై ఉన్నారు. ఆయన(స) చాష్త్ నమాజ్ ముగించుకొని వచ్చినా ఆమె అదే స్థలంలో కూర్చొని ఉన్నారు. ఆమెను చూసి, 'నేను (దైవ స్మరణలో) నిన్ను వదిలి వెళ్ళినప్పట్నుంచి అలాగే ఉన్నావా?' అని ఆయన (స) అడిగారు. ఆమె అవునని బదులు పలికారు. 'నీ దగ్గర్నుంచి వెళ్ళాక నేను నాలుగు వచనాలు పలికాను. అవి (అర్థవంతం రీత్యా) బరువులో నీవు ఇంతవరకు చేసిన ధ్యానానికి సమానంగా తూగుతాయి. ఆ వచనాలు ఇవిగో' అన్నారు.

**'సుబ్‌హానల్లాహి వ బిహందిహీ అదద ఖల్ఖిహీ వ రిజా నఫ్సిహీ వ జినత అర్షిహీ వ మిదాద కలిమాతిహీ'.** [1]

(నేను అల్లాహ్‌ను ఆయన సృష్టితాల సంఖ్యకు సమానంగా ఆయన ప్రసన్నతకు సమానంగా, ఆయన సింహాసనం బరువుకు సమానంగా ఇంకా ఆయన వచనాల సిరాకు సమానంగా స్తుతిస్తూ ఆయన పరిశుద్ధతను కొనియాడుతున్నాను)

హజ్రత్ సాద్ బిన్ అబీ వఖ్ఖాస్(ర) చెప్పుకొచ్చారు. ఓసారి దైవ ప్రవక్త (సఅసం)తోపాటు నేనూ ఓ మహిళ (బహుశా, ఆమె ఉమ్మహాతుల్

1. ముస్లిం, కితాబుజ్జిక్ర్ వద్దుఆయి, బాబుత్తస్బీహి అవ్వలిన్నహారి వ ఇందన్నౌం

మోమినీన్ లోనే ఒకరు అయివుండవచ్చు) వద్దకు వెళ్ళాం. ఆమె ఎదుట టెంకలు, కంకరరాళ్ళు పడివున్నాయి. ఆమె వాటితో లెక్కిస్తూ, ధ్యానం చేయటం ఆయన(స) చూశారు. 'నీకు ఇంతకంటే సులువుగా ధ్యానం చేసే అత్యుత్తమ పద్ధతి చెప్పమంటావా?' అంటూ, ఆయన(స) ఇలా పలకమన్నారు:

**'సుబ్హానల్లాహి అదద మా ఖలఖల్లాహు ఫిస్సమాయి వ సుబ్హానల్లాహి అదద మా ఖలఖల్లాహు ఫిల్ అర్జి వ సుబ్హానల్లాహి అదద మాబైన జాలిక వ సుబ్హానల్లాహి అదద మా హువ ఖాలిఖున్ వల్లాహు అక్బరు మిస్లు జాలిక వల్ హందు లిల్లాహి మిస్లు జాలిక."**[1]

(నేను అల్లాహ్‌ను ఆకాశంలోని ఆయన సృష్టితాలకు సమానంగా స్తుతిస్తున్నాను. నేను ఆయన పరిశుద్ధతను భూమిలోని ఆయన సృష్టితాలకు సమానంగా కొనియాడుతున్నాను. నేను ఆయన్ను భూమ్యాకాశాల్లో ఉన్న వస్తువులకు సమానంగా కీర్తిస్తున్నాను. ఇక మీదట ఆయన సృష్టించబోయే సృష్టిరాశులకు సమంగా నేను ఆయన్ను కొనియాడుతున్నాను. దానికి సమానంగానే ఆయన ఔన్నత్యాన్ని, ఆయన స్తోత్రాన్ని కూడా స్తుతిస్తున్నాను).

మనిషి అల్లాహ్‌ను ఎంతగా స్తుతించినా, మరెంతగా ధ్యానించినా అది తక్కువే. అందులోనే రేయింబవళ్ళు నిమగ్నమైనా కూడా ఆయన హక్కు నెరవేరదు. ఈ హదీసులో ధ్యానం కోసం ఎలాంటి సంఖ్యలు ఆధారం చేసుకోవటం జరిగిందంటే కనీసం వాటి పరిమితులు కూడా తెలియవు.

---

1. తిర్మిజీ, కితాబుద్దాఅవాత్, బాబు ఫీ దుఆయిన్నబియ్యి(స) వ తఅవ్వుజిహీ దుబుర కుల్లి సలాతిన్.

## అత్యధిక ఆరాధనలు

కొంతమంది ప్రసిద్ధి చెందని సహాబియాత్‌లకు (స్త్రీలకు) కూడా ఆరాధనల పట్ల చాలా ఆసక్తి ఉండేది. హజ్రత్ ఉమర్(ర) సేవకురాలి పేరు జాయిదా. ఆమె గురించి ఇలా అనబడింది:

ఆరాధన విషయంలో ఎక్కువగా శ్రమించే స్త్రీలలో ఆమె కూడా ఉండేది. ఆమె గారి ఈ గుణం కారణంగానే దైవప్రవక్త(స) ఆమెను చేరువలో ఉంచేవారు.[1]

మరికొంతమంది సహాబియాత్‌లు ఏ మేరకు ఆరాధనలో నిమగ్నులయ్యేవారంటే దైవప్రవక్త(స) వారిని మధ్యస్థ మార్గం అవలంబించమని ఆదేశించేవారు. హజ్రత్ ఆయెషా(ర) తెలిపారు: ఒకసారి హౌలా బిన్తె తవీత్ నా దగ్గర కూర్చొని ఉన్నారు. అంతలో దైవప్రవక్త (స) వచ్చారు. 'ఈవిడ హౌలా బిన్తె తవీత్. ఈమె రాత్రిళ్ళు పడుకోకుండా నమాజ్ చదువుకుంటూ ఉంటుందనీ ఈమె ఆరాధన గురించి గొప్పగా చెప్పుకుంటారు' అని అన్నాను. ఆయన (స) దీన్ని అయిష్టపడ్డారు.

**'అలా చేయకు, నీ శక్తిమేరకే దైవాన్ని ఆరాధించు. దైవసాక్షి! ఆయన తన కారుణ్యం ప్రసాదించటంలో విసుగు చెందదు. కాని నువ్వే విసుగెత్తిపోతావు. ధర్మకార్యాన్ని ఎల్లప్పుడూ క్రమం తప్పకుండా నిర్వహించేవారి ఆచరణే దైవానికి అత్యంత ప్రీతికరమైంది' అని ఆయన(స) బోధించారు.**[2]

---

1. ఇబ్నె అసీర్, అసదుల్ గాబ్బహ్ : 7/123 ఇది ఓ దీర్ఘ ఉల్లేఖనంలోని భాగం. దీన్ని కొందరు ముహద్దిసీన్, మౌజూ హదీసు అని తీర్మానించారు. ఇబ్నెహజర్ : అల్ ఇసాబహ్ : 8/149, 150
2. బుఖారీ, కితాబుల్ ఈమాన్, బాబు అహబ్బుద్దీని ఇలల్లాహి అద్‌వమున్–ముస్లిం, కితాబుస్సలాత్, బాబు ఫజీలతుల్ అమలిద్దాయిం (చివరి వరకు)

హజ్రత్ అనస్(రజి) కథనం ప్రకారం ఒకసారి ప్రవక్త(స) మస్జిద్‌లోకి ప్రవేశించగా అక్కడ రెండు నిట్టాడుల మధ్య తాడు కట్టి ఉండటం ఆయన(స) చూశారు. ఈ తాడు ఏమిటి? అని అడిగారు. ఇది జైనబ్ (ర) గారిది. (బహుశ ఆమె జైనబ్ బిన్తె జహష్) ఆమె రాత్రంతా నమాజ్ చేస్తూ ఉంటారు. అలసిపోయినప్పుడు దీని ఆధారంగానే నిలబడతారు అని అక్కడున్నవారు అన్నారు.

'అలా కాదు, ఈ పద్ధతి సరైందికాదు. దాన్ని విప్పేయండి. మీలో ఎవరైనాసరే ఉత్సాహంగా, ఉల్లాసంగా ఉన్నంత వరకు నమాజ్ చేయండి. అలసట అనిపిస్తే పడుకోండి' అని ఆయన(స) అన్నారు. [1]

తాబయీన్ కాలంలో హజ్రత్ రాబిఅ బస్రియ దైవదాస్యం, కఠోర సాధనల విషయంలో చాలా ప్రఖ్యాతి చెందారు. అల్లామ ఇబ్నె ఖల్కాన్ రాస్తున్నారు : 'ఆమె తన కాలానికి చెందిన గొప్పవారిలో ఒకరు. మంచితనం, దైవభీతి, ఆరాధనలో ఆమె సంఘటనలు ప్రసిద్ధికెక్కినవి'[2]

ఆమె రాత్రంతా నమాజ్ చేస్తుండేవారు. తెల్లవారుజామున కొద్దిసేపు మాత్రమే జానిమాజుపై మేను వాల్చేవారు. పొద్దుపొడిచినప్పుడు కలవరపడుతూ దబదబా తన పడకతో 'ఓ ప్రాణమా! ఎంతసేపని పడుకుంటావు? ఎప్పటివరకు పడుకుంటావు? ఆ సమయం దగ్గర్లోనే ఉంది. నీవప్పుడు ఎలా పడుకుంటావంటే ఇక అంతిమ దినం వరకు లేవవు' అంటూ లేచి కూర్చునేవారని ఆమె సేవకురాలు అన్నారు. ఆమె దైవాన్ని వేడుకుంటూ 'ఓ అల్లాహ్! నిన్ను ప్రేమించే ఈ హృదయాన్ని

---

1. బుఖారీ, కితాబుత్తహజ్జుద్, బాబు మా యుక్రహు మినత్తష్దీది ఫిల్ ఇబాదతి, ముస్లిం, కితాబుస్సలాహ్, బాబు ఫజీలతిల్ అమలిద్దాయిమి.

3. ఇబ్నె ఖల్కాన్, వఫియాతుల్ ఆయాన్ : 2/ 48

అగ్నిలో పడవేస్తావా?' అనేవారు. ఒకరోజు అదృశ్యంగా 'ఇలా జరగదు, నీకు మా గురించి మంచి ఆలోచన ఉండాలి' అనే స్వరం వినబడిందని చెప్పుకుంటారు.

ఓసారి హజ్రత్ సుఫ్యాన్ సౌరీ(రహ్మాలై) ఆమె ఎదుట అంతిమ దినాన్ని గుర్తుచేసుకుంటూ 'వా హుజ్నాహ్' (అయ్యో! ఏంటి ఈ దు:ఖం) అన్నారు. దానికి ఆమె 'తప్పుడు మాట మాట్లాడకు, అయ్యో! ఈ దు:ఖం ఎంత తక్కువగా ఉందని చెప్పు, ఎందుకంటే అక్కడి శోకసంద్రంలో మునిగినప్పుడు శ్వాస తీసుకోవటం కూడా కష్టతరమైపోతుంది' అని అన్నారు.[1]

ఉమ్మె అస్సుహ్‌బా, ముఆజా బిన్తె అబ్దుల్లాహ్‌ను ఇబ్నె హిబ్బాన్ అత్యధికంగా ఆరాధన చేసే మహిళగా పరిగణించారు. ఆమె భర్త అబూ అస్సుహ్‌బా మరణించిన తర్వాత ఆమె కన్నుమూసే వరకు ఏనాడూ పక్క మీద మేను వాల్చలేదని చెప్పుకుంటారు. ఆమె రాత్రిళ్ళు ఆరాధనలో నిమగ్నమయ్యేవారు. 'సమాధిలో దీర్ఘనిద్రకు ఉపక్రమించాలని తెలిసి కూడా నిద్రిస్తూ ఉండే కళ్ళను చూస్తే ఆశ్చర్యం కలుగుతుందని ఆమె తరచూ అనేవారు. ఆమె షరీఅత్‌కు కట్టుబడి ఉండేవారు. ఈ విషయంలో తనకు దైవ సహాయం ఎలా లభించిందో చెప్పుకొచ్చారు–

ఒకసారి ఆమెకు ఉదర సంబంధమైన వ్యాధి వచ్చింది. చికిత్స నిమిత్తం కుండలో పెట్టి ఉన్న నబీజ్ (మత్తు పదార్థం) తాగమని సూచించటం జరిగింది. ఆ పాత్ర ఆమె ముందుంచబడినప్పుడు, ఆమె దాన్ని అలాగే పెట్టేసి 'దైవమా! నీకు తెలుసు, దీన్ని వినియోగించకూడదని ప్రవక్త(స) గారి ఆదేశం ఆయెషా(ర) నాకు వినిపించారు. నువ్వే నన్ను దీని బారి నుండి కాపాడాలి. నీ కారుణ్యంతో నాకు ఆరోగ్యాన్ని ప్రసా

1. ఇబ్నె ఖల్కాన్, వఫియాతుల్ అయాన్ : 2/48

దించు' అని వేడుకున్నారు. ఈ ప్రార్థనతో ఆ పాత్ర బోర్లా పడిపోయింది. ఆమె రోగం కూడా నయమైంది.[1]

## ఉపవాసం పట్ల ఆసక్తి

ఉపవాసం, ధర్మానికి ఒక మూల స్తంభం. దైవభీతి, పవిత్రత, ఇంకా దైవంతో సంబంధం ఏర్పరచుకోవటానికి నమాజ్‌లాగే ఉపవాసం కూడా చాలా ప్రాధాన్యత కలిగివుంది. అందుకే ఫర్జ్ ఉపవాసాలే కాకుండా నఫిల్ ఉపవాసాలక్కూడా చాలా ప్రాముఖ్యత ఉంది. వాటిని పాటించాలని ప్రేరేపించబడింది. మహిళలు నఫిల్ ఉపవాసాలు అధికంగా పాటించే వారని హదీసు, సీరత్ పుస్తకాల ద్వారా తెలుస్తుంది.

ఉమ్ముల్ మోమినీన్ హజ్రత్ ఆయెషా(ర) గురించి సాద్ బిన్ ఇబ్రాహీం ఇలా అంటున్నారు : 'ఆమె ఎక్కువగా ఉపవాసాలు పాటించేవారు.'[2]

సాద్ సోదరుడి కుమారుడు ఖాసిం బిన్ ముహమ్మద్ 'ఆమె ఎడతెగక ఉపవాసాలు పాటించేవార'ని అన్నారు.[3]

---

1. ఇబ్నె హజర్, తహ్‌జీబుత్తహ్‌జీబ్ : 12/401– సఫీయుద్దీన్ అల్ ఖజ్‌రజీ, ఖులాసతు తహ్‌జీబుల్ కమాలి : 3/393– ఇక్కడ ఒక విషయం తేటతెల్లం చేయటం తప్పనిసరి. ఏదైనా ఆచరణ, అది మంచిదా చెడ్డదా అన్నది ఖుర్ఆన్, హదీసు వెలుగులోనే తీర్మానించటం జరుగుతుంది. ఈ పుస్తకంలో వెల్లడి అయిన సంఘటనల్లో ఎక్కడైనా హెచ్చుతగ్గులు కనిపిస్తే అవి కొలమానం మాత్రం కావు. వీటిని కేవలం మునుపటి మహిళలు ఆరాధన ఏ మేరకు నిర్వహించేవారో, దైవంతో వారి సంబంధం ఎంత పటిష్టంగా ఉండేదో తెలియ జేయడానికి ప్రస్తావించటం జరిగింది.
2. ఇబ్నె సాద్, అత్తబఖాతుల్ కుబ్రా : 8/68
3. ఇబ్నె సాద్, అత్తబఖాతుల్ కుబ్రా : 8/75

ఉమ్మెల్ మోమినీన్ హజ్రత్ హఫ్సా (ర) కూడా నఫిల్ ఉపవాసాలు ఎక్కువగా పాటించేవారు.

'ఎడతెగకుండా ఉపవాసాలు పాటిస్తూ ఉన్న కాలంలోనే హజ్రత్ హఫ్సా (ర) మరణించారని హజ్రత్ నాఫె (రహ్మాలై) అన్నారు.[1]

ఉల్లేఖనాల్లో వచ్చిందేమిటంటే ఒకసారి దైవప్రవక్త(స) ఆమెకు విడాకులు ఇవ్వాలనుకున్నప్పుడు దైవవాణి అవతరించింది. హజ్రత్ జిబ్రయీల్(అ) అన్నారు: 'హఫ్సా వైపునకు మరలు, ఎందుకంటే ఆమె ఎక్కువగా ఉపవాసాలు పాటిస్తుంది. రాత్రిళ్ళు నమాజ్‌లో నిలబడి ఉంటుంది. ఇంకా ఆమె స్వర్గంలో కూడా నీకు అర్థాంగిగా ఉంటుంది.'[2]

సహాబియాత్‌ల నఫిల్ ఉపవాసాల గురించి అక్కడక్కడ కొన్ని సంఘటనలు హదీసు పుస్తకాల్లో కానవస్తాయి. వాటినిబట్టి ఉపవాసం పట్ల వారికి ఉన్న ఆసక్తి ఎటువంటిదో అర్థమవుతుంది.

హజ్రత్ ఆయెషా(ర) వివరించారు : నేను, హజ్రత్ హఫ్సా ఇద్దరం ఉపవాసం ఉన్నాం. ఆ సమయంలోనే భోజనం వచ్చింది. ఆమె తిన్నారు. తర్వాత ఆమె దీని గురించి ఆయన(స) ఎదుట ప్రస్తావించారు. మరుసటి రోజు దాని ఖజా ఉపవాసం పాటించమని ఆయన(స) ఆదేశించారు.[3]

దైవప్రవక్త(స), ఉమ్మెల్ మోమినీన్ హజ్రత్ జువైరియా (ర) దగ్గరికి వచ్చారు. అది శుక్రవారం రోజు. ఆమె ఉపవాసంతో ఉన్నారు. 'నిన్న కూడా ఉపవాసం పాటించావా?' అని ఆయన(స) అడిగారు. ఆమె

---

1. ఇబ్నె సాద్, అత్తబఖాతుల్ కుబ్రా : 8/86
2. ఇబ్నె సాద్, అత్తబఖాతుల్ కుబ్రా: 8/84– ఇబ్నె అబ్దుల్ బర్ర్, అల్ ఇస్తీఆబ్ : 4/373
3. తిర్మిజీ, అబ్‌వాబుస్సౌం, బాబు మాజాఅ ఫీ ఈజాబిల్ ఖజా– అబూదావూద్, కితాబుస్సౌం, బాబు మన్‌రఅ అలైహిల్ ఖజా

లేదన్నారు. తిరిగి ఆయనే(స) 'మరి రేపు ఉపవాసం ఉండాలనుకుంటు న్నావా?' అనడిగారు. ఆమె మళ్ళీ లేదనే అన్నారు. అందుకాయన (స) అలాగైతే ఉపవాసం విరమించేయి అన్నారు.[1]

ఓ ఉల్లేఖనంలో ఆమె ఉపవాసం విరమించారని ఉంది.

హజ్రత్ ఉమ్మె హానీ (ర) మక్కా జయించిన రోజు జరిగిన ఓ సంఘటన గురించి చెప్పారు. ఆయన(స) కూర్చొని ఉండగా కుడి వైపు నేను, ఎడమ వైపు ఫాతిమా(ర) కూర్చొని ఉన్నాం. ఒక సేవకురాలు ఏదో తాగే పదార్థం తీసుకొచ్చింది. ఆయన(స) తాగినాక నా వైపునకు దాన్ని అందించారు. నేను దాన్ని (మహాభాగ్యంగా భావించి వెంటనే) త్రాగేశాను. ఆ తర్వాత దైవప్రవక్తా(స)! నేను ఉపవాసంతో ఉన్నాను. అయినప్పటికీ నేను (మీ ఎంగిలి) తాగేశాను అన్నాను. 'ఖజా ఉపవాసం కాదు కదా?' అని ఆయన(స) అడిగారు. 'లేదండి, నఫిల్ ఉపవాసం' అన్నాను. 'నఫిల్ ఉపవాసమయితే పాటించేవారి ఇష్టం. ఇష్టమైతే దాన్ని పూర్తి చేయవచ్చు. లేదా మధ్యలోనే విరమించవచ్చు' అని ఆయన(స) చెప్పారు.[2]

ఉమ్మె అమ్మారా(ర.అ) ఇలా అంటున్నారు : ఓ రోజు దైవప్రవక్త(స) ఆమె ఇంటికి విచ్చేశారు. ఆమె భోజనం ముందుంచారు. 'నీవు కూడా

---

1. బుఖారీ, కితాబుస్సౌం, బాబు సౌమి యౌమిల్ జుముఅహ్, ఎక్కువ మంది అభిప్రాయం ప్రకారం ప్రత్యేకించి జుమా (శుక్రవారం) ఉపవాసం పాటించటం మక్రూహ్.

2. తిర్మిజీ, అబ్వాబుస్సౌం, బాబు మాజాఅ ఫీ ఇఫ్తారిస్సాయిమిల్ ముతతవ్వెఅ, అబూదావూద్, కితాబుస్సౌం, బాబుర్రుఖ్సతిఫీజాలిక్, దారిమీ, కితాబుస్సౌం, బాబు ఫీ మయ్ యుస్బహుసాయిమన్ తతవ్వుఅన్ సుమ్మ యుఫ్తిరు– ధర్మశాస్త్రవేత్తల (ఫుఖహా) వద్ద హజ్రత్ ఆయిషా (ర)గారి హదీసుపై (అహ్నాఫ్) హనఫీ ప్రజలు, ఉమ్మెహానీ (ర) హదీసుపై (షవాఫె) షాఫయి ప్రజలు ఆచరిస్తారు.

తిను' అని ఆయన(స) పిలిచారు. 'నేను ఉపవాసంతో ఉన్నాను' అన్నారామె. 'ఉపవాసి దగ్గర భోం చేస్తున్నప్పుడు, తినడం పూర్తయ్యేంత వరకు దైవదూతలు ఆ ఉపవాసి కోసం ప్రార్థిస్తూ ఉంటారు' అని అన్నారు.[1]

రబీ బిన్తె ముఅవ్వజ్ తెలిపారు : దైవప్రవక్త(స) ఆషూరా రోజు (ముహర్రం పదవరోజు) అన్సార్ వీధుల్లో 'ఎవరైతే తిని త్రాగేశారో, వారు సాయంకాలం వరకు ఏమి తినకూడదని, మరెవరైతే ఉపవాసం పాటించారో వారు తమ ఉపవాసాన్ని పూర్తి చేయాలి' అని చాటింపు వేయించారు. ఆ తర్వాత మేం కూడా ఉపవాసం పాటించేవాళ్ళం. మా పిల్లలక్కూడా ఉపవాసం ఉంచేవాళ్ళం. ఆకలితో ఏడుస్తుంటే ఉన్నితో ఆట వస్తువులు చేసి పొద్దుపోయేవరకు వాళ్ళను సముదాయించేవాళ్ళం.[2]

ఇతరుల తరఫున కూడా ఉపవాసాలు పాటించేవారని తెలుస్తుంది. ఒక మహిళ ప్రవక్త(స)తో 'నా తల్లి చనిపోయింది, ఆమెపై పదిహేను ఉపవాసాలు విధిగా ఉన్నాయి. (మరో ఉల్లేఖనంలో ఆమెపై నెల ఉప వాసాలు విధి అయిఉన్నాయి అని ఉంది. వేరొక ఉల్లేఖనంలో రెండు మాసాలు అని ఉంది). ఆమె తరఫున నేను ఉపవాసాలు ఉండవచ్చా?' అనడిగింది.

'ఒకవేళ ఆమెపై ఎవరిదైనా అప్పు ఉంటే నువ్వు తీర్చవా?'.

'అవును, తప్పకుండా'.

'దైవానికి తీర్చాల్సిన అప్పు అన్నిటికంటే ఎక్కువ అర్హత కలిగి వుంటుంది' అని ఆయన(స) అన్నారు.

---

1. తిర్మిజీ : అబ్వాబుస్సౌం, బాబు మాజాఅ పీ పజ్లిస్సాయిమి ఇజా అకల ఇందహు. వ రవాహు అహ్మద్ వ ఇబ్నెమాజ వద్దారిమీ (మిష్కాతుల్ మసాబీహ్, కితాబుస్సౌం)
2. బుఖారీ, కితాబుస్సౌం, బాబు సౌమిస్సిబ్యాన్– ముస్లిం, కితాబుస్సియాం, బాబు సౌమి యౌమి ఆషూరా

వేరొక ఉల్లేఖనంలో ప్రశ్నించినవాడు మగవాడని తెలుస్తుంది.[1] అడిగిన ప్రశ్నలు కూడా వేర్వేరుగా ఉండటం దీన్ని మరింత బలపరు స్తుంది.

## దైవమార్గంలో ఖర్చు పట్ల ఆసక్తి

ఖుర్‌ఆన్, హదీసులలో నమాజ్ తర్వాత అన్నిటికంటే ఎక్కువగా దైవమార్గంలో ఖర్చు గురించి నొక్కి వక్కాణించబడింది. దీనికి ఒక చట్టపరమైన రూపమే జకాత్. నమాజ్‌లో మనిషి తన మనోమస్తిష్కాలతో పాటు అవయవాలన్నీనూ దైవం ముందు మోకరిల్లి ఉన్నాయని తెలియజేస్తాడు. అలాగే దైవమార్గంలో ఖర్చు కూడా. సంపదను తన ఆస్తిగా భావించకుండా ఎక్కడైతే దేవుడు దాన్ని వెచ్చించమని ఆదేశించాడో అక్కడ ఖర్చుపెట్టడానికి సదా సిద్ధంగా ఉన్నానని చాటుతాడు.

ఖర్చు చేయమన్న ఆదేశం పురుషులతోపాటు స్త్రీలక్కూడా ఉంది. ఖుర్‌ఆన్ గ్రంథంలో ఖర్చు పెట్టే ఆలుమగలకు గొప్ప పుణ్యం లభిస్తుందని వాగ్దానం చేయబడింది.

**'స్త్రీ, పురుషుల్లో దానధర్మాలు (సదఖా) చేసి అల్లాహ్‌కు మంచి రుణం ఇచ్చేవారికి, ఎన్నో రెట్లు పెంచి దానిని తిరిగి ఇవ్వటం జరుగుతుంది. వారికి ఎంతో మంచి ప్రతిఫలం లభిస్తుంది' *(అల్ హదీద్ : 18)***

హదీసుల్లో మహిళలను విభిన్న కోణాల నుండి ఖర్చు పెట్టమని ప్రేరేపించటం జరిగింది. ఈ విషయంలో వారి స్వభావం, నైజం పరిస్థితు లను కూడా పూర్తిగా లక్ష్యపెట్టడం జరిగింది.

---

1. బుఖారీ, కితాబుస్సాం, బాబుమన్ మాత వ అలైహిసౌం- ముస్లిం, కితాబుస్సియాం.

హజ్రత్ జాబిర్(ర), హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అబ్బాస్(ర) వివరించారు : ఒక పండగ సందర్భంగా ప్రవక్త(స) స్త్రీలను వేరుగా సంబోధించారు. అందులో ఆయన(స) వారిని దానధర్మాలు చేయమని ప్రోత్సహించారు. దాంతో వారు తమ నగ నట్రాదులను ఇంకా ఇతర వస్తువులను సమర్పించసాగారు. హజ్రత్ బిలాల్(ర) వాటిని తన దుప్పటిలో సమీకరించసాగారు.[1]

అబూబకర్(ర) కుమార్తె అస్మా(ర)కు ఆయన(స) ఇలా హితబోధ చేశారు.

'ఖర్చు పెట్టు, పదేపదే లెక్క పెట్టకు (ఏమి ఇవ్వాలి, ఏమి ఇవ్వకూడదని). అలా చేస్తే దేవుడు కూడా లెక్కపెట్టి మరీ ఇస్తాడు. అలాగే మిగిల్చి మిగిల్చి దాచిపెట్టమాకు, అలా చేస్తే దేవుడు కూడా నీ పట్ల అలాగే వ్యవహరిస్తాడు'.[2]

హజ్రత్ ఆయెషా(ర) అన్నారు: ఓసారి మేము ఒక మేకను కోశాం. (దాన్ని పంచిపెట్టేశాం) 'ఇంకా అందులో ఏమైనా మిగిలివుందా?' అని ఆయన(స) అడిగారు. 'ముంగాలు మాత్రమే మిగిలింది' అని అన్నాం. అందుకాయన(స) 'ఆ ముంగాలు తప్ప తతిమ్మా మాంసమంతా మిగిలే ఉందని చెప్పు' అన్నారు.[2]

మనిషి ఏదైతే దానం చేస్తాడో అది వృథా కాదు. వాస్తవానికి తాను తిని తాగి అయిపోగొట్టిందే వృథా అయిపోతుంది. దానధర్మాలు మాత్రమే

---

1. బుఖారీ, కితాబుల్ ఈదైన్, బాబు మౌయిజతిల్ ఇమామి న్నిసాఅ యౌముల్ ఈద్. ముస్లిం, కితాబుల్ ఈదైన్.
2. బుఖారీ, కితాబుల్ హిబతి, బాబు హిబతిల్ మర్అతి లిగైరి జౌజిహా, ముస్లిం, కితాబుజ్జకాత్, బాబుల్ హస్సి అలల్ ఇన్ఫాఖ్ వ కరాహియతిల్ ఇమ్సాక్.
3. తిర్మిజీ; అబ్వాబు సిఫతిల్ ఖియామహ్, బాబ్ 33

మిగిలి ఉంటాయి. ఎందుకంటే వాటి పుణ్యఫలం దేవుని దగ్గర భద్రంగా ఉంటుంది అనే తలంపును ఆయన(స) మనసులో నాటారు.

కొన్ని సందర్భాల్లో మనిషి ఎవరికైనా ఏదైనా పెద్ద సహాయం చేసే స్థితిమంతుడు కాకపోవచ్చు. చిన్నపాటి సహాయం చేయటానికి కూడా సంకోచిస్తూ ఉంటాడు. ఇలాంటి అవస్థ ఎక్కువగా స్త్రీలకు వస్తుంది. దానధర్మాలు చిన్న చిన్న వస్తువుల రూపేణా కూడా చేయొచ్చు. ఆర్తుడి అసలు అవసరం పూర్తి కాకపోయినా అది సమయానుసారం కాస్తోకూస్తో ఊతమిస్తుందని ఆయన(స) స్త్రీలకు ఉపదేశించారు.

'ఒక ఖర్జూరపండు దానం చేసైనాసరే నరకాగ్ని బారి నుండి కాపాడుకోండి. అది కడుపు నిండిన మనిషికి ఉపయోగపడినట్లే ఆకలితో అలమటిస్తున్న వాడికీ పనికొస్తుంది' అని ఆయన(స) అన్నారని ఆయెషా (ర) తెలిపారు.[1]

ఉమ్మె బుజైద్ అంటున్నారు : నేను దైవప్రవక్త(స)ను అడిగాను. యాచకుడు నా తలుపు దగ్గరికి వస్తాడు. ఒక్కొక్కప్పుడు అతనికివ్వటానికి ఇంట్లో ఏమి ఉండదు. అంచేత సిగ్గనిపిస్తుంది అన్నాను. అందుకాయన(స) "(యాచకుణ్ణి వట్టి చేతులతో పంపించకు) ఏమి లేకపోతే కాల్చిన మేక కాలి గిట్ట అయినా సరే, అదే ఇచ్చి పంపించు." అన్నారు.[2]

కాల్చిన మేక కాలిగిట్ట ఎందుకూ పనికిరాని వస్తువు. ఇందులో యాచకుణ్ణి ఒట్టి చేతులతో పంపించటాన్ని తీవ్రంగా ఆక్షేపించటం జరిగింది. ఏదో ఒకటి ఇచ్చి పంపించమని ఆదేశించబడింది.

---

1. ఖాలల్ ముజ్రీ : రవాహు అహ్మద్ బిఇస్నాది హసన్– అత్తర్‌గీబు వత్తర్‌హీబ్ : 2/6
2. తిర్మిజీ, అబ్‌వాబుజ్జకాహ్, బాబు మాజాఅ ఫీ హఖ్ఖిస్సాయిలి

స్త్రీలకు ఎక్కువగా సంబంధం చుట్టాలు, ఇరుగు పొరుగు వారితో ఉంటుంది. వారి హక్కు కూడా ఎక్కువే. హదీసుల్లో స్త్రీలను, ఈ హక్కును నెరవేర్చమని ప్రేరేపించటం జరిగింది.

హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ మస్ఊద్ గారి ఇల్లాలు, మరొక అన్సారీ మహిళ 'తమ భర్తా పిల్లలక్కూడా దానం చేయొచ్చా?' అని తెలుసుకోవటానికి హజ్రత్ బిలాల్‌ను దైవప్రవక్త(స) దగ్గరికి పంపించారు. దానికాయన (స) 'అవును, వారిక్కూడా దానం చేయవచ్చు. వారికి రెండింతల పుణ్యం లభిస్తుంది. చుట్టరికానిగ్గాను, దానం చేసినందుకుగ్గాను పుణ్యం లభిస్తుంది" అని బదులు పలికారు.[1]

హజ్రత్ ఉమ్మె సలమా (ర) దైవప్రవక్త(స)తో 'నేను నా భర్త అబూ సలమా పిల్లలపై ఖర్చు చేయవచ్చా? వారు నా పిల్లలే కదా, వారిని వారి మానాన వదిలిపెట్టలేను కదా!. దేవుడు నాకు దానిగ్గాను పుణ్యఫలం ఇస్తాడా?' అని అడిగారు. "వారిపై ఖర్చుపెట్టు. నీవు వారి కోసం ఏమి ఖర్చు చేసినా దానికి నీకు పుణ్యం లభిస్తుంది" అని ఆయన(స) బదులిచ్చారు.[2]

హజ్రత్ మైమూన (ర) ఒక దాసికి స్వేచ్ఛనిచ్చారు. ఆమె ఈ విషయాన్ని ఆయన (స) ముందు ప్రస్తావించారు. అందుకాయన(స) "నీవు ఆమెను నీ మామయ్యలకు ఇచ్చివేస్తే మరింత పుణ్యం లభించేదిగా" అన్నారు. (బహుశా, వారికి ఆ అవసరం ఉంది కాబోలు)[3]

---

1. బుఖారీ, కితాబున్నఫఖాత్, బాబుజ్జకాతి అలజ్జౌజి వల్ ఐతామి ఫిల్ హుజ్ర్, ముస్లిం, కితాబుజ్జకాహ్, బాబు ఫజ్లిస్సదఖతి అలల్ అఖ్రబీన వజ్జౌజి... చివరి వరకు.
2. బుఖారీ, కితాబున్నఫ్ఖాత్, బాబుజ్జకాతి అలజ్జౌజి వల్ ఐతామి ఫిల్ హుజ్ర్-ముస్లిం, కితాబుజ్జకాహ్. బాబు ఫజ్లిస్సదఖతి అలల్ అఖ్రబీన వజ్జౌజి..
3. *బుఖారీ, కితాబుల్ హిబతి, బాబు హిబతిల్ మర్అతి లిగైరిజౌజిహా... ముస్లిం, కితాబుజ్జకాహ్, బాబు ఫజ్లిన్నఫ్ఖతి వస్సదఖతి అలల్ అఖ్రబీన్...*

హజ్రత్ అబూ హురైరా (రజి) కథనం ప్రకారం దైవప్రవక్త(స) ఇలా ప్రబోధించారు :

'ఓ ముస్లిం మహిళల్లారా! మీలో ఏ ఇరుగింటి స్త్రీ అయినా తన పొరుగింటావిడకు (ఇచ్చిన కానుకను) అల్పమైందిగా భావించకూడదు. అది మేక కాలి గిట్ట అయినా సరే! (ఎలాంటిదైనా సరే, కానుక ఇవ్వండి)[1].

దీనికి రెండు అర్థాలు కావచ్చు. మొదటిది, ప్రతి ముస్లిం మహిళ ఉన్నంతలోనే తన పొరుగింటావిడకు కానుకలు ఇస్తూ ఉండాలి. ఒకవేళ పెద్ద వస్తువు ఇవ్వలేకపోతే చిన్న వస్తువు అయినా సరే ఇవ్వాలి. ఇంత చిన్న వస్తువు కానుకగా ఎలా ఇవ్వాలి అని అనుకోకూడదు. దీనికి మరో అర్థం, ఎవరికైనా కానుక ఇవ్వబడినప్పుడు అది ఏ వస్తువు? దాని విలువెంత? అని వారు చూడకూడదు. అసలు దాని వెనుకున్న ప్రేమాభిమానాలను చూడాలి. వస్తువు ఎంత చిన్నదైనా నిరాకరించకూడదు.

"నేను దైవప్రవక్త(స)తో, నాకు ఇద్దరు పొరుగువాళ్ళున్నారు. వారిలో ఎవరికి కానుక ఇవ్వాలి?" అని అడిగాను. అందుకాయన(స) 'వారిలో ఎవరి గడప అయితే నీకు దగ్గరగా ఉందో వారికి ఇవ్వు' అని బదులు పలికారని ఆయెషా(ర) అన్నారు.[2]

దీనినిబట్టి అవగతమయ్యేదేమిటంటే, హజ్రత్ ఆయిషా(ర.అ) గారు పొరుగు వారి హక్కుల ప్రాముఖ్యతను తెలుసుకున్నారు. కాకపోతే పొరుగు వారు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నప్పుడు, వారిలో అత్యధిక ప్రాధాన్యత ఎవరికివ్వాలి? అనే విషయాన్ని ఆమె తెలుసుకోగోరారు.

సూత్రప్రాయమయిన ఈ ప్రబోధనల తరువాత తొలికాలపు ముస్లిం మహిళామణులలోని త్యాగనిరతి గురించి ప్రస్తావించబడుతోంది:

---

1. బుఖారీ, కితాబుల్ హిబహ్
2. బుఖారీ, కితాబుల్ హిబహ్

ఉమ్ముల్ మోమినీన్ హజ్రత్ జైనబ్(రజి) గారికి దైవమార్గంలో ఖర్చు పట్ల అసాధారణమైన ఆసక్తి ఉండేది. ఆమె చాలా ఎక్కువగా దానధర్మాలు చేస్తుండేవారు. ఇమామ్ జహబీ(రహ్మాలై) ఆమె గురించి ప్రస్తావిస్తూ రాశారు:

'ధర్మం, దైవభీతి, దానధర్మాలు చేయటం, ఇంకా సత్కార్యం, మంచి పనుల్లో ఆమె ప్రముఖ స్త్రీలలో లెక్కించబడేది' (రజియల్లాహు అన్హా) [1]

ఆమె పరిస్థితి ఎలాంటిదంటే కష్టపడి సంపాదించినదంతా బీదసాదల్లో పంచిపెట్టేసేవారు.

హజ్రత్ ఆయెషా(రజి) చెప్పుకొచ్చారు: ఓసారి దైవప్రవక్త(స) తమ సతీమణులను ఉద్దేశించి, "మీలో అందరికన్నా పొడుగాటి చేతులున్నావిడ నన్ను అందరికంటే ముందు కలుస్తుంది" అని అన్నారు.

మాలో ముందుగా ఎవరు మరణిస్తారో తెలుసుకోవటానికి మేము మా చేతులను కొలుచుకునేవాళ్ళం. హజ్రత్ జైనబ్ (రజి) పొట్టిగా ఉండే వారు. కాని ఆవిడే ముందుగా తనువు చాలించారు. దైవప్రవక్త(స) పలుకుల్లోని అంతరార్థం దానధర్మాల్లో అందరికంటే ముందుండే ఆవిడ అని మాకు అర్థమయ్యింది. ఆమె ముందుగా చనిపోయారు. ఆమె తన స్వహస్తాలతో సంపాదించగా వచ్చిన పైకాన్నంతా దానం చేసేవారు. [2]

బర్జా బిన్తె రాఫె అంటున్నారు: హజ్రత్ ఉమర్(ర) పన్నెండు వేల దిర్హంలు ఆమె కోసం కోశాగారం నుండి పంపించారు. పెద్ద మొత్తంలో డబ్బు ఆమె వద్దకు వచ్చినప్పుడు 'నేను దీన్ని ఏం చేసుకోనూ? నా మిగతా సోదరీమణులకు (ప్రవక్త సతీమణులు) దీని పంపకం గురించి బాగా తెలుసు' అని అన్నారు. 'అయ్యో! ఈ సొమ్మంతా మీ కోసమేనండీ' అని

1. జహబీ, సియరు ఆలామిన్నుబలాయి : 2/ 149
2. ముస్లిం, కితాబుల్ ఫజాయిల్...

అన్నప్పుడు 'సుబ్‌హానల్లాహ్! దీన్ని పెట్టేసి ఓ వస్త్రాన్ని కప్పేసెయి' అని ఆమె నాతో అన్నారు. తర్వాత అందులో చేయిపెట్టి, ఒక పిడికిలి ఫలానా వారికి, మరో పిడికిలి ఫలానా వారికి ఇచ్చి రమ్మన్నారు. అలా ఆమె తన బంధువులు, అనాథల మధ్య పంచేస్తూ ఉన్నారు. చివరికి కొంత పైకం మాత్రమే మిగిలిపోయినప్పుడు ఇందులో మాక్కూడా హక్కు ఉంది కదా! అన్నాను. 'సరే! వస్త్రం క్రింద మిగిలినదంతా నీదే' అన్నారు. అందులో ముప్పై ఐదు దిర్హాంలు ఉన్నాయి. వేరొక ఉల్లేఖనంలో హజ్రత్ ఉమర్(ర)కు ఆవిడ సొమ్మంతా అలా ఖర్చుపెట్టేశారని తెలిసి, ఆమె నుండి మంచినే ఆశించగలం అని అన్నారు. తర్వాత స్వయాన ఆయనే ఇంటికెళ్ళి గడప దగ్గర నిల్చొని సలాం చేశారు. మరో వెయ్యి దిర్హాంలు ఇచ్చి, వాటిని తమ అవసరాలకు వినియోగించుకోవాల్సిందిగా సూచించారు. కాని ఆవిడ వాటిని కూడా పంచిపెట్టేశారు.

ఇక ఆమె స్వాభిమానం గురించి ఏమని చెప్పేది! కోశాగారం నుంచి ఈ భృతి అందిన తర్వాత ఆకాశం వైపు చేతులెత్తి 'ఓ అల్లాహ్! ఉమర్ (రజి) వేతనం తీసుకోవటానికి ఇక నన్ను సజీవంగా ఉంచకు' అని ప్రార్థించారు.

అలాగే ఆమె అదే ఏడాది మరణించారు[1].

ఆమె తన కఫన్ వస్త్రాన్ని తనే సిద్ధం చేసిపెట్టుకున్నారు. అటు ఉమర్(ర) కూడా ఆమె చనిపోయినప్పుడు కోశాగారం నుండి ఐదు వస్త్రాలను ఎంపిక చేసి మరీ పంపించారు. ఆ వస్త్రాలనే ఆమెకు కఫన్‌గా వినియోగించటం జరిగింది. ఆవిడ తన కోసం అని పెట్టుకున్న కఫన్ వస్త్రాన్ని ఆమె సోదరి హమ్నా బిన్తె జహష్ దానం చేసేశారు.[2]

---

1. ఇబ్నె సాద్, అత్తబఖాతుల్ కుబ్రా : 8/109, 110
2. ఇబ్నె సాద్, అత్తబఖాతుల్ కుబ్రా : 8/ 110

హజ్రత్ జైనబ్ బిన్తె జహష్ (రజి) చనిపోయినప్పుడు ఆయెషా(రజి) ఆవిడ గురించి 'ఆమె ప్రశంసితురాలు,సాటిలేనిది, అనాధులకు, వితంతువులకు ఆశ్రయంగా ఉండేది' అన్నారు.[1]

ఉస్మాన్ బిన్ అబ్దుల్లాహ్ జహషీ 'జైనబ్ బిన్తె జహష్ (ర) ఏ ఒక్క దిర్హంను గానీ, దీనార్‌ను గానీ తన వెనుక వదలిపెట్టలేదు. చేతికి అందిన దంతా దానం చేసేవారు. ఆమె దీనులకు అండగా నిలిచేవారు' అని అన్నారు.[2]

ఆమె మరణానంతరం ఆమె నివాసం ఉన్న ఇంటిని వలీద్ బిన్ అబ్దుల్ మలిక్, మస్జిదె నబవీ విస్తరణ కోసం యాభై వేల దిర్హంలకు కొన్నారని ఆయనే అన్నారు.

దైవప్రవక్త(స) ఉమ్మె హాతుల్ మోమినీన్ (సతీమణులలో)లో హజ్రత్ ఆయెషా(ర)ను అందరికంటే ఎక్కువగా ప్రేమించేవారు. ఈ కారణంగా హజ్రత్ ఉమర్(ర) ఆమెకు పెన్షన్ కూడా ఎక్కువగా ఇచ్చేవారు. ఆయన(ర) ప్రవక్త (స) సతీమణుల్లో ప్రతి ఒక్కరికీ పదివేల దిర్హాంలు, ఆయెషా(ర)కు పన్నెండువేల దిర్హాంలు వేతనంగా నిర్ణయించారు.[3]

అయితే ఆమె గొప్ప ఉదార స్వభావం గల మహిళామణి. తనకు ముట్టినదంతా ఖర్చు పెట్టేసేవారు. ఆమె దాతృత్వం, దానధర్మాలను ఈ క్రింది సంఘటనల ద్వారా అంచనా వేయవచ్చు.

ఉమ్మె జర్రా తెలిపారు: ఓసారి హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ జుబైర్(రజి) ఒక లక్ష దిర్హంలు రెండు సంచుల్లో ఆయెషా(ర) వద్దకు పంపించారు. ఆమె

---

1. ఇబ్నె సాద్, అత్తబఖాతుల్ కుబ్రా : 8/110
2. ఇబ్నె సాద్, అత్తబఖాతుల్ కుబ్రా, 8/114
3. ఇబ్నె సాద్, అత్తబఖాతుల్ కుబ్రా, 8/67

పళ్ళాన్ని తెప్పించి దాంతోనే డబ్బంతా ప్రజల్లో పంచిపెట్టేశారు. ఆ రోజు ఆమె ఉపవాసంతో ఉన్నారు. సాయంకాలం అయినప్పుడు ఆమె నాతో 'ఓ అమ్మాయి! ఇఫ్తార్ తీసుకురా' అన్నారు. 'ఈ రోజు మీరు అంత పెద్ద మొత్తాన్ని పంచిపెట్టారు. అందులోనుంచి ఇఫ్తార్ కోసం మాంసాన్ని తెప్పించుకుంటే బాగుండేది కదా!' అన్నాన్నేను. 'పోనీ లే, ఇప్పుడు నిందలు, నిష్ఠూరాలు వద్దు. ముందుగా గుర్తు చేస్తే తెప్పించేదాన్ని కదా'[1] అన్నారామె.

అతా బిన్ అబీ రబాహ్ కథనం : ఒకసారి హజ్రత్ ముఆవియా (రజి) గారు ఉమ్ముల్ మోమినీన్ హజ్రత్ ఆయిషా(ర.అ)కు లక్ష దిర్హమ్‌లు పంపారు. అయితే ఆమె ఆ సొమ్ము అంతటినీ తన సవతులకు పంచిపెట్టేశారు.[2]

ఒకసారి ఆయెషా(ర) డెబ్బై వేల దిర్హంలు దానధర్మాలు చేశారు. అప్పుడు స్వయాన ఆమె పరిస్థితి ఎలా ఉందంటే ఆమె తన బట్టలకు అతుకులు వేసుకుని ఉండటం నేను చూశాను అని ఉర్వా బిన్ జుబైర్ (రజి) అన్నారు.[3]

ఉమ్ముల్ మోమినీన్ హజ్రత్ జైనబ్ బిన్తె ఖుజైమా(ర) ఇస్లాం స్వీకరించక ముందు నుండే బీదసాదలకు ఎక్కువగా సాయపడేవారు. అందుకే ఆమెను 'ఉమ్ముల్ మసాకీన్' (నిరుపేదల తల్లి) అనేవారు.[4]

విశ్వాసుల తల్లి హజ్రత్ సౌదా బిన్తె జమఅ(ర.అ) వద్దకు ఉమర్(ర) దిర్హంలతో నిండిన ఓ గంపను పంపించారు. అది ఆమె వద్దకు తీసుకురాబడినప్పుడు, ఆమె అందులో ఏముందని అడిగారు. దిర్హంలున్నాయని

1. ఇబ్నె సాద్, అత్తబఖాతుల్ కుబ్రా : 8/67.
2. జహబీ : సియర్ ఆలాముస్నుబలాయి–2/141.
3. ఇబ్నెసాద్, అత్తబఖాతుల్ కుబ్రా : 8/66
4. ఇబ్నెసాద్, అత్తబఖాతుల్ కుబ్రా : 8/115,
   ఇబ్నె అబ్దుల్ బర్ర్, అల్ ఇస్తీఆబ్ : 4/409

చెప్పటం జరిగింది. ఏంటీ ఖర్జూర పండ్లకు బదులు దిర్హాంలు నింప బడ్డాయా? అన్నారు. తర్వాత ఓ అమ్మాయిని పిలిచి పళ్ళాన్ని తీసుకు రామన్నారు. దాంతోనే డబ్బంతా పంచిపెట్టారు.[1]

అస్మా (ర), హజ్రత్ అబూబకర్(రజి) తనయురాలు. హజ్రత్ ఆయెషా(ర) అక్క. ముహమ్మద్ బిన్ మున్కదిర్ (రహ్మా) 'ఆమె ఉదార స్వభావం కలది' అన్నారు.[2]

ఆమె తన కూతుళ్ళకు, కుటుంబీకులకు హితబోధ చేస్తుండేవారు: 'ఖర్చుపెట్టండి, దానధర్మాలు చేయండి. అవసరాలు తీరాక మిగిలింది మంచిపనుల్లో ఖర్చుచేద్దామని అనుకోకండి. మిగులు కోసం వేచి ఉంటే ఏ వస్తువూ మిగలదు. అలాకాకుండా ఖర్చుపెడితే దాని కొరత కూడా ఉండదు.'[3]

హజ్రత్ ఉమర్(ర) ఆమెకు వెయ్యి దిర్హంల భృతిని నిర్ధారించారు[4]: కాని ఆమె వెచ్చించే విధానం చూస్తే ఆశ్చర్యం కలగకమానదు.

'నేను ఆయెషా(ర), అస్మా(ర) కంటే ఎక్కువ మరే దాతనూ చూడలేదు. కాని ఇద్దరి విధానంలో తేడా వుండేది. హజ్రత్ ఆయెషా(ర) ఒక్కొక్క వస్తువు కూడబెట్టేవారు. ఆపై అవసరమున్న చోట ఖర్చుపెట్టేవారు. కాని హజ్రత్ అస్మా(ర) రేపటి కోసం ఏదీ ఎత్తి పెట్టేవారు కాదు. చేతికి అందినదంతా అప్పటికప్పుడే ఖర్చు చేసేవారు' అని అబూ జుబైర్ అంటున్నారు.[5]

---

1. ఇబ్నెసాద్, అత్తబఖాతుల్ కుబ్రా : 8/56– ఇబ్నె హజర్– అల్ ఇసాబహ్ : 8/197
2. ఇబ్నె సాద్, అత్తబఖాతుల్ కుబ్రా : 8/252
3. ఇబ్నెసాద్, అత్తబఖాతుల్ కుబ్రా : 8/252
4. ఇబ్నె సాద్, అత్తబఖాతుల్ కుబ్రా : 8/252
5. బుఖారీ, అల్ అదబుల్ ముఫ్రద్ : 1/377– జహబీ, సియరు ఆలామిన్ను బలాయి : 2/211

'ఆమె ఎప్పుడైనా జబ్బు పడితే తన దగ్గరున్న సేవకులకు స్వేచ్ఛ ప్రసాదించేవార'ని ఫాతిమా బిన్తె మున్జిర్ అన్నారు.[1]

## హజ్జ్, ఉమ్రాలు

ఇస్లాం మూల స్తంభాల్లో హజ్జ్ కూడా ఒకటి. ప్రత్యేకదినాల్లో కాబా గృహానికి చేరుకొని ప్రత్యేక కార్యాచరణలు నెరవేర్చడమే హజ్జ్. హజ్జ్‌లో ఆచరించే కొన్ని ఆచరణలు హజ్జ్ దినాల్లో కాకుండా మిగతా రోజుల్లో నిర్వర్తించటమే ఉమ్రా.

హజ్జ్, ఉమ్రాలకు గొప్ప ప్రాధాన్యత ఉంది. హదీసుల్లో వీటిని మహిళల జిహాద్ (ధర్మ పోరాటం)గా చెప్పటం జరిగింది.

హజ్రత్ ఆయెషా(ర), ప్రవక్త(స)తో 'మేము కూడా మీతోపాటు జిహాద్‌లో పాల్గొనవచ్చా?' అనడిగారు. అందుకాయన(స) "మీకు అన్నిటికంటే మంచి, సుందరమైన జిహాద్ హజ్జె మబ్రూర్ (కేవలం దైవం కోసం చేసేది)" అన్నారు.[2]

వేరొక ఉల్లేఖనంలో హజ్రత్ ఆయెషా(ర), దైవప్రవక్త(స)తో 'నాకు ఖుర్ఆన్ గ్రంథంలో జిహాద్ కంటే ఎక్కువ ప్రాధాన్యత కలిగిన మరో ఆచరణ కనిపించటం లేదు. అంచేత మేం కూడా మీతోపాటు జిహాద్‌లో ఎందుకు పాలుపంచుకోకూడదూ?' అన్నారు. దానికాయన, "లేదు. మీ కోసం అన్నిటికంటే ప్రాధాన్యత కలిగిన, సుందరమైన జిహాద్ హజ్జె బైతుల్లాహ్ అంటే హజ్జె మబ్రూర్" అని బదులు పలికారు.[3]

"వృద్ధులకు, పిల్లలకు, స్త్రీలకు జిహాద్, హజ్జ్ ఉమ్రాల"ని ప్రవక్త(స) చెప్పారనీ అబూ హురైరా (ర) ఉల్లేఖించారు.[4]

1. ఇబ్నెసాద్, అత్తబఖాతుల్ కుబ్రా : 8/252
2. బుఖారీ, కితాబుల్ హజ్జ్, బాబు హజ్జిన్నిసాయి
3. నసాయి, కితాబు మనాసికిల్ హజ్జ్, బాబు ఫజ్లిల్ హజ్జ్
4. నసాయి, కితాబు మనాసికిల్ హజ్జ్, బాబు ఫజ్లిల్ హజ్జ్

ప్రవక్త(స)తోపాటు ఆయన సతీమణులు కూడా హజ్జ్ చేశారు. ఆయన(స) తదనంతరం హజ్రత్ సౌదా(ర), హజ్రత్ జైనబ్(ర) హజ్జ్ చేయలేదు. కాని మిగతా భార్యలు హజ్‌యాత్రకు వెళ్ళేవారని హజ్రత్ అబూ హురైరా(ర) తెలిపారు.[1]

వీడ్కోలు హజ్ యాత్రలో పదివేల మంది సహచరుల వెంట దైవప్రవక్త(స) హజ్జ్ విధిని నిర్వర్తించారు. అందులో మహిళలు కూడా పెద్దసంఖ్యలో పాల్గొన్నారని తెలుస్తుంది. వారి ఆసక్తి అభిరుచులు ఏమేరకు ఉన్నాయంటే వ్యాధిగ్రస్తులు, గర్భవతులు, పిల్లల తల్లులు కూడా పాల్గొన్నారు.

జబాఅ బిన్తె జుబైర్(ర) ప్రవక్త(స)తో, 'నేను హజ్జ్ చేయాలని నిర్ణయించుకున్నాను. కాని జబ్బుపడ్డాను' అని అన్నారు. అందుకాయన(స) 'దైవం ఎక్కడైతే నిలిపి వేస్తాడో అక్కడ ఇహ్రాం విడుస్తానని సంకల్పం చేసుకొని ఇహ్రాం కట్టుకో, హజ్ చేసేయి' అని సలహా ఇచ్చారు.[2]

హజ్రత్ జాబిర్ (ర) అంటున్నారు : దైవప్రవక్త(స) హిజ్రీ పదో సంవత్సరం హజ్‌యాత్ర కోసం చాటింపు వేయించినప్పుడు మేమందరం హజ్జ్ కోసం బయల్దేరాం. 'జుల్ హులీఫా' ప్రాంతానికి చేరుకున్నప్పుడు అక్కడ అస్మా బిన్తె ఉమైస్(ర) తనయుడు ముహమ్మద్ బిన్ అబూబకర్(ర) జన్మించారు.[3]

దైవప్రవక్త(స) 'రౌహా' ప్రాంతంలో కొందరు రౌతులను కలిశారు.

---

1. *నసాయి, కితాబు మనాసికిల్ హజ్జ్....*
2. *ఇబ్నె సాద్, అత్తబఖాతుల్ కుబ్రా : 8/55*
3. *బుఖారీ, కితాబున్నికాహ్, బాబుల్ ఇక్ఫాయిఫీద్దీని– ముస్లిం, కితాబుల్ హజ్జ్, బాబు జవాజి ఇష్రాతిల్ ముహ్‌రమిత్తహ్ లీల్... చివరి దాకా*

వారిలో ఒకస్త్రీ, పిల్లవాడ్ని ఎత్తి చూపుతూ, ఇతని హజ్జ్ కూడా అవుతుందా? అని అడిగింది. దానికాయన(స) "అవును, అతని హజ్జ్ కూడా అవుతుంది. పుణ్యం నీకు లభిస్తుంది" అన్నారని హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అబ్బాస్ అన్నారు.[1]

ఒక అన్సార్ మహిళ ఉమ్మె సన్నాన్(ర) వీడ్కోలు హజ్‌యాత్రలో పాల్గొనలేకపోయింది. హజ్జ్ నుండి తిరిగొచ్చాక ప్రవక్త(స) కారణం అడిగారు. 'మా దగ్గర రెండే రెండు ఒంటెలున్నాయి. ఒకదానిపై నా భర్త, నా కొడుకు హజ్జ్ యాత్రకు బయల్దేరారు. మరో దాంతో పొలానికి నీరు తోడే పని జరుగుతుంది అని ఆమె సంజాయిషి చెప్పుకున్నారు. అందుకాయన(స) "సరే నీవు రమజాన్ నెలలో ఉమ్రా చేయి. అల్లాహ్ నీకు హజ్జ్‌కు సమానంగా పుణ్యాన్ని ప్రసాదిస్తాడు" అని అన్నారు.[2]

మరో స్త్రీ, ఆమె పేరు ఉమ్మె ము'ఖిల్. ఆమె కూడా హజ్జ్ చేయలేకపోయింది. ఆమెను కూడా రమజాన్ మాసంలో ఉమ్రా చేయమని సలహా ఇచ్చారు.[3]

ఇలా సంకల్పం చేసుకొని కూడా హజ్జ్ యాత్రకు బయల్దేరలేకపోయిన వారికి ఉమ్రా చేయమని ఆయన(స) ప్రోత్సహించారు. ఈ క్రమంలో స్త్రీలకు సౌలభ్యం సమకూర్చాలనీ వారి ఆటంకాలను తొలగించాలనీ హితబోధ చేయటం జరిగింది.

ఒకతను ప్రవక్త(స)తో 'నా అర్ధాంగి హజ్జ్ చేయాలని అనుకుంటుంది, నేనేమో యుద్ధంలో పాల్గొనాలని నా పేరు రాయించాను'

---

1. ముస్లిం, కితాబుల్ హజ్జ్, బాబు సిహ్హతి ఇహ్రామిన్నుఫసాయి అబూదావూద్, కితాబుల్ మనాసిక్, బాబు సిఫతి హజ్జతిన్నబియ్యి
2. ముస్లిం, కితాబుల్ హజ్జ్, అబూదావూద్, కితాబుల్ మనాసిక్
3. అబూదావూద్, కితాబుల్ మనాసిక్ ....

అన్నాడు. 'నీవు నీ ఇల్లాలితోపాటు హజ్ యాత్రకు ప్రయాణమవ్వు' అని ఆయన(స) సలహా ఇచ్చారు.[1]

మహిళలు తమ తరఫున కూడా హజ్జ్ చేసేవారు. అవసరమైనప్పుడు ఇతరుల కోసం కూడా ఈ విధిని నిర్వర్తించేవారు.

అబ్దుల్లాహ్ బిన్ అబ్బాస్(రజి) కథనం : జుహైనా తెగకు చెందిన ఓ పడతి దైవప్రవక్త(స)ను 'నా తల్లి హజ్జ్ చేయాలని మొక్కుకుంది. కాని హజ్జ్ చేయకముందే ఆమె తనువు చాలించింది. నేను ఆమె తరఫున హజ్జ్ చేయవచ్చా? అనడిగింది. అందుకాయన (స) "నీవు ఆమె తరఫున హజ్జ్ చేయి, ఒకవేళ నీ తల్లిపై అప్పుంటే నీవు తీర్చవా! అలాగే దేవుడి అప్పును కూడా తీర్చు. అప్పు తీర్చే విషయంలో ఆయనే ఎక్కువ హక్కు కలిగి వున్నాడు"[2] అని అన్నారు.

'ఖస్అం' తెగకు చెందిన ఓ స్త్రీ ప్రవక్త(స)తో ఇలా అన్నది : 'దైవం తన దాసులపై హజ్జ్ విధిగా నిర్ణయించాడు. ఈ విధి మా నాన్న గారిపై కూడా అనివార్యమయింది. కాని ఆయన చాలా ముసలివారైపోయారు. వాహనంపై కూర్చోలేని స్థితిలో ఉన్నారు. నేను ఆయన తరఫున హజ్ చేయవచ్చా? దాంతో ఆయన విధి నెరవేరుతుందా?' అనడిగింది. "అవును, నెరవేరుతుంది" అని ఆయన(స) బదులు పలికారు.[1] (హజ్రత్ ఫజ్ల్ బిన్ అబ్బాస్(రజి) ఉల్లేఖనం)

ధర్మంలో కాఠిన్యం అయిష్టకరమైనవి. ఓ మహిళ హజ్జ్ చేసే పద్ధతిలో ఇలాంటి వైఖరినే అవలంబించింది. దాన్ని ప్రవక్త మహనీయులు (స) వారించారు.

ఉఖ్బా బిన్ ఆమిర్ జుహ్నీ(ర) తెలిపారు : నా చెల్లి, తను కాలి

---

1. *బుఖారీ, అబ్‌వాబు ఉమ్రా, బాబు ఉమరతి ఫీ రమజాన ముస్లిం, కితాబుల్ హజ్జి– బాబు ఫజ్లిల్ ఉమరతి ఫీ రమజాన*
2. *బుఖారీ, అబ్‌వాబుల్ ఉమ్‌రతి, బాబుహజ్జిన్నిసాయి, ముస్లిం, కితాబుల్ హజ్జి, బాబు సఫరిల్ మర్అతి మఅ మహ్రమి ఇలల్ హజ్జి మొదలైనవి*
3. *బుఖారీ, అబ్‌వాబు ఉమ్రా, బాబు మన్ నజరల్ మష్య ఇలల్ కాబతి*

నడకన బైతుల్లాహ్ (దైవ గృహం) సందర్శించుకుంటానని మొక్కుబడి చేసుకుంది. ఈ విషయం గురించి వాకబు చేయటానికి నన్ను ప్రవక్త(స) వద్దకు వెళ్ళమని చెప్పింది. నేను ఆయన్ను(స) అడిగితే "ఆ అవసరం లేదు ఆమె కాలినడక కూడా వెళ్ళవచ్చు వాహనాన్ని కూడా వినియోగించు కోవచ్చు" అని ఆయన(స) అన్నారు.

వేరొక ఉల్లేఖనంలో ఆయన(స) మొక్కుబడికి పరిహారం చెల్లించ మన్నారని ఉంది.[1]

హజ్ ప్రయాణాన్ని హదీసుల్లో దైవమార్గంలో పయనించటంతో పోల్చటం జరిగింది. ఇంకా హాజీ (యాత్రికుడి) ప్రార్థన స్వీకరిస్తాడని ఉంది. అంచేత అతనితో ప్రార్థన చేయించుకోమని ప్రేరేపించబడింది.

ఒక సందర్భంలో హజ్రత్ ఉమ్మె దర్దా(ర), హజ్రత్ సఫ్వాన్(ర)తో 'మీరు హజ్ యాత్రకు బయల్దేరే ఉద్దేశం ఉందా?' అనడిగారు. ఆయన(ర) అవునన్నారు. ఆమె 'మా మేలు కోసం ప్రార్థించండ'ని కోరారు. మనిషి తన సోదరుని కోసం అతని వెనుక చేసే ప్రార్థన స్వీకరించబడుతుంది. ప్రార్థించేవాని తలాపి వద్ద ఓ దైవదూత అతని ప్రార్థనపై ఆమీన్ (అలాగే జరుగుగాక!) అంటూ ఉంటాడు. అంతేకాకుండా నీక్కూడా ఇలాంటి మేలు కల్గుగాక! అని అంటూ ఉంటాడని ప్రవక్త(స) గారి ప్రవచనం విన్పించారామె.

సఫ్వాన్ (ర) అంటున్నారు: నేను అక్కణ్ణుంచి బయల్దేరివెళ్ళాను. వీధిలో అబూదర్దా(రజి) కలిశారు. ఆయన కూడా ప్రవక్త(స) గారి ఇలాంటి ప్రవచనాన్నే వినిపించారు.[2]

ఇది ఆనాటి స్త్రీల ఆరాధనల స్థితి. మరిప్పుడు వారి విద్యా వికాసాల స్థితిని కూడా తెలుసుకోండి–

---

*1. బుఖారీ, అబ్వాబు ఉమ్రా, బాబు మన్ నజరల్ మష్‌య ఇలల్ కాబతి*

*2. ముస్లిం, కితాబుజిక్రి వద్దుఆయి లిల్‌ముస్లిమీన బిజహరిల్‌గైబ్– ఇబ్నెమాజ, కితాబుల్ మనాసిక్, బాబు ఫజ్లి దుఆయిల్ హాజి*

# విద్యా విషయికంగా ముస్లిం వనిత

ఇస్లాం ధార్మిక విద్య అభ్యసించటం, నేర్పించటాన్ని కడవరకు ప్రోత్సహించింది. అన్నివిధాలా దాన్ని ఉత్సాహపరిచింది. ఫలితంగా చాలా వేగంగా ప్రతిచోట ధార్మిక విద్య గురించి చర్చ మొదలైంది. గొప్ప గొప్ప విద్యావేత్తలు వెలుగులోకి వచ్చారు. వారిలో పురుషులతోపాటు స్త్రీలు కూడా ఉన్నారు. ఇక్కడ మునుపటి కాలంలోని ప్రఖ్యాతిగాంచిన కొందరు స్త్రీల గురించి చర్చించటం జరిగింది.

## హజ్రత్ ఆయెషా(ర)

సహాబియాత్‌లో ఆయెషా (ర) విజ్ఞానస్థాయి అందరికంటే ఉన్నతంగా ఉండేది. సహాబాలో కూడా లెక్కించదగిన కొందరికి మాత్రమే ఆ స్థానం లభించింది. ఆమె విద్యాజ్ఞానాలు, దూరదృష్టిని నాటి విద్వాంసులు సైతం అంగీకరించారు. ఆమె ముఖ్య విద్యార్థి అయిన ఉర్వా బిన్ జుబైర్(ర) అంటున్నారు-

**"నేను ఆయెషా(ర) సహచర్యంలో ఉండేవాణ్ణి. దివ్య వచనాల అవతరణ, వాటి సమయ సందర్భాలను, ఫరాయిజ్, సున్నత్‌లను, కవితా సాహిత్యాన్ని, అరబ్ చరిత్రను, తెగల వంశపరంపర మొదలైన వాటినే కాకుండా వివాదాలు పరిష్కరించటంలోను, చివరికి వైద్యంలోను ఆమె కన్నా ఎక్కువ పరిజ్ఞానం కలవారిని నేను ఎప్పుడూ ఎవర్నీ చూడలేదు."**[1]

---

1. జహబీ, సియరు ఆలామిన్నుబలాయి : 2/128, 129

నేనొకసారి ఆమెను 'పిన్నమ్మా! మీరు వైద్యం ఎలా నేర్చుకున్నార'ని అడిగాను. అందుకామె 'ఎప్పుడైనా నేను లేదా మరొకరు జబ్బు బారినపడితే దాని చికిత్స చెప్పటం జరుగుతుంది కదా, అలా ప్రజలు ఒకరికొకరు చెబుతూ ఉంటారు. నేను దాన్ని గుర్తుంచుకునేదాన్ని' అని అన్నారు.

'ఒకవేళ ప్రజలందరి జ్ఞానం కూడబెట్టి ఆపై ప్రవక్త(స) సతీమణుల జ్ఞానం కూడా కలిపి రెట్టింపు చేసినా, హజ్రత్ ఆయెషా(ర) జ్ఞానమే ఎక్కువ విస్తరించి ఉంటుంద'ని ఇమామ్ జుహ్రీ అంటున్నారు.[1]

'హజ్రత్ ఆయెషా(ర) ప్రజలందరిలోకీ గొప్ప ధర్మశాస్త్రవేత్త. అందరికంటే ఎక్కువ విద్యావంతురాలు. ప్రజలందరిలోకీ మంచి అభిప్రాయం కలవారు' అని అతా బిన్ రబాహ్ అన్నారు.[2]

'దైవప్రవక్త(స) గారి అనుచర సమాజంలోను, అలాగే మొత్తం ప్రజలందరిలోనూ ఆమెకంటే గొప్ప విద్యావంతురాలు అయిన మరో స్త్రీ గురించి నాకు తెలియదు' అని ఇమామ్ జహబీ(రహ్మ) అంటున్నారు.[3]

అందరికంటే ఎక్కువగా ఏ సహచరులు అయితే ప్రవక్త(స) హదీసులను ఉల్లేఖించారో వారిలో హజ్రత్ ఆయెషా(ర) కూడా ఉన్నారు. ఈ హదీసులు ఆమె ప్రత్యక్షంగా దైవప్రవక్త(స)నుండి, మరి కొన్నింటిని హజ్రత్ అబూబకర్ (ర), హజ్రత్ ఉమర్(ర), హజ్రత్ ఫాతిమా(ర), హజ్రత్ సాద్ బిన్ అబీ వఖ్ఖాస్ (ర), హమ్జా బిన్ అమ్ర్ అల్ అస్లమీ(ర) ఇంకా జుజామా బిన్తె వహబ్ (ర) మొదలైనవారి నుండి విని ఉల్లేఖించారు. ఆమె

---

1. *హాకిం, అల్ ముస్తద్‌రక్ అలస్సహీహైన్, కితాబు మఅరిఫతిస్సహాబతి హదీసు నంబర్ 6734/2332*
2. *జహబీ, తల్ఖీసుల్ ముస్తద్‌రక్ : 4/14*
3. *జహబీ, సియరు ఆలామిన్నుబలాయి : 1/101*

ఉల్లేఖనాలు మొత్తం రెండు వేల రెండు వందల పది (2210). వాటిలో నూట డెబ్బై నాలుగు (174) హదీసులు ముత్తఫకున్ అలైహ్. అంటే బుఖారీ, ముస్లిం రెండింటిలోనూ ఉన్నాయని అర్థం. అవే కాకుండా యాభై నాలుగు (54) హదీసులు ఇమామ్ బుఖారీ, అరవై తొమ్మిది (69) ఇమామ్ ముస్లిం వేర్వేరుగా ఉల్లేఖించారు. మిగతా హదీసులు ఇతర హదీసు పుస్తకాల్లో ఉన్నాయి.

## హజ్రత్ ఉమ్మె సలమా (ర.అ)

విశ్వాసుల మాత హజ్రత్ ఉమ్మె సలమా (ర) కూడా చాలా హదీసులు దైవప్రవక్త(స)నుండి నేరుగా మరికొన్ని హదీసులను అబూ సలమా (ర), ఫాతిమా(ర) ద్వారా ఉల్లేఖించారు. ముప్ఫై ఐదు (35) కంటే ఎక్కువ హదీసులు సహాబా, తాబయీన్‌లు ఆమె నుండి నకలు చేశారు. (వారిలో స్త్రీ, పురుషులు ఇరువురూ ఉన్నారు)

ఆమె గారి మొత్తం ఉల్లేఖనాలు మూడు వందల డెబ్భై ఎనిమిది (378) ఉన్నాయి. వాటిలో పదమూడు (13) ఉల్లేఖనాలు బుఖారీ, ముస్లిం రెండింటిలోనూ ఉన్నాయి. అవికాకుండా మూడు (3) హదీసులు బుఖారీలో, పదమూడు (13) ముస్లింలో ఉన్నాయి.

ఆమె ధర్మశాస్త్రంలో కూడా ప్రత్యేక స్థానాన్ని కలిగివున్నారు. 'సహాబాల్లో ఉన్న ధర్మశాస్త్రవేత్తల్లో ఆమె కూడా లెక్కించబడేవార'ని ఇమామ్ జహబీ అంటున్నారు.[1]

## హజ్రత్ హఫ్సా (ర.అ)

విశ్వాసుల మాతృమూర్తి హజ్రత్ హఫ్సా(ర), ఉమర్(ర) ముద్దుల కూతురు. ఆమె ప్రవక్త(స) నుండి, ఉమర్(ర) నుండి హదీసులు

*1. జహబీ, సియరు అలామిన్నుబలాయి : 2/ 143*

ఉల్లేఖించారు. ఆమె నుండి హదీసులు చేరవేసిన వారిలో ఆమె సోదరుడు హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ ఉమర్(ర), ఆయన తనయుడు హమ్జా, ఆయన అర్ధాంగి సఫియా, ఉమ్మె బషరుల్ అన్సారియా, ముత్తలిబ్ బిన్ వదాఅ, హారిసా బిన్ వహబ్ మొదలైన వారు పన్నెండు కన్నా ఎక్కువ మంది ఉన్నారు.[1]

హజ్రత్ హఫ్సా(ర) అరవై 60 హదీసులు ఉల్లేఖించారు. వాటిలో నాలుగు బుఖారీ, ముస్లిం రెండింటిలోనూ ఉన్నాయి.[2]

## హజ్రత్ ఉమ్మె హబీబా (ర.అ)

విశ్వాసుల తల్లి ఉమ్మె హబీబా(ర) అబూ సుఫ్యాన్ కుమార్తె. ఆమె దైవప్రవక్త(స) నుండి అరవై ఐదు (65) హదీసులు ఉల్లేఖించారు. వాటిలో రెండు బుఖారీ, ముస్లిం రెండింటిలోనూ ఉన్నాయి. మరొకటి ముస్లింలో ఉంది. ఆమె నుండి ఆమె కుమార్తె హబీబా(రజి), సోదరుడు ముఆవియా (రజి), మేనల్లుడు అబ్దుల్లాహ్ బిన్ ఉత్బా ఇంకా ఉర్వా బిన్ జుబైర్, సఫియా బిన్తె షైబా, జైనబ్ బిన్తె అబూ సలమా (ర) మొదలైనవారు హదీసులు ఉల్లేఖించారు.[3]

## హజ్రత్ మైమూనా బిన్తె హారిస్ (ర.అ)

ఉమ్ముల్ మోమినీన్ మైమూనా బిన్తె హారిస్(రజి) ఆమె భర్త అబూరహ్మ్ మరణించాక హిజ్రీ 7వ సంవత్సరంలో ప్రవక్త(స)ను వివాహ మాడారు. 'ఆమె మాలో అందరికన్నా ఎక్కువగా దైవానికి భయపడేవారు.

1. *ఇబ్నె హజర్, తహ్జీబుత్తహ్జీబ్ : 12/361*
2. *జహబీ, సియరు ఆలామిన్నుబలాయి : 2/164*
3. *జహబీ, సియరు ఆలామిన్నుబలాయి : 2/155– ఇబ్నెహజర్, తహ్జీబు తహ్జీబ్ : 12/369*

బంధుప్రీతి కలవారు' అని ఆమె గురించి హజ్రత్ ఆయెషా(రజి) అన్నారు. ఆమె దైవప్రవక్త(స) నుండి నలభై ఆరు హదీసులు ఉల్లేఖించారు. ఆమె నుంచి ఉల్లేఖించిన వారిలో హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అబ్బాస్(రజి), అబ్దుల్లాహ్ బిన్ షద్దాద్, అబ్దుర్రహ్మాన్ బిన్ అస్సాయిబ్, యజీద్ బినుల్ అసమ్మ (వీరందరూ ఆమె మేనల్లుళ్ళు), ఆమె పెంచిన అబ్దుల్లాహ్ ఖౌలానీ, దాసి నదియ, ఆమె స్వేచ్ఛ ప్రసాదించిన సేవకుడు అతా బిన్ యసార్, సులైమాన్ బిన్ యసార్ ఇంకా ఆలియా బిన్తె సబీ మొదలైనవారు ఉన్నారు.

## హజ్రత్ లుబాబా బిన్తె హారిస్(ర.అ)

ఈమె ప్రవక్త(స) గారి బాబాయి హజ్రత్ అబ్బాస్(ర) అర్ధాంగి. హజ్రత్ ఖదీజా(రజి) తర్వాత (బహుశా స్త్రీలలో) అందరికంటే ముందు ఆమె ఇస్లాం స్వీకరించారని చెప్పుకుంటారు. ఇబ్నె అబ్దుల్ బర్ర్ 'కానత్ మినల్ మున్జిబాత్' అంటే సజ్జనులు, బుద్ధిమంతులు అయిన సంతానాన్ని కలిగిన స్త్రీలలో ఆమె కూడా ఉన్నారని అంటున్నారు. ఆమె సంతానంలో ఫజ్ల్ బిన్ అబ్బాస్(రజి), ప్రఖ్యాతిగాంచిన ధర్మ శాస్త్రవేత్త అబ్దుల్లాహ్ బిన్ అబ్బాస్(రజి), ము'బిద్, ఖస్అం, అబ్దుర్రహ్మాన్ ఇంకా ఉమ్మె హబీబా(రజి) ఉన్నారు. వీరిలోని ప్రతి ఒక్కరూ పేరు ప్రఖ్యాతులు పొందారు. హజ్రత్ లుబాబా(ర) సోమవారం, గురువారం ఉపవాసం పాటించేవారు. దీంతో ఆమె మంచితనం, దైవభీతి గురించి తెలుస్తుంది. ఆమె ప్రవక్త(స) నుండి ముప్పై హదీసులు ఉల్లేఖించారు.[1]

## హజ్రత్ ఉమ్మె హానీ బిన్తె అబీ తాలిబ్(ర.అ)

ఉమ్మె హానీ(రజి), ప్రవక్త(స) గారి బాబాయి కుమార్తె. హజ్రత్ అలీ

1. ఇబ్నె అబ్దుల్ బర్ర్, అల్ ఇస్తీఆబ్ : 4/461– సఫియుద్దీన్ అల్ ఖజ్రజీ ఖులాసతు తజ్హీబితహ్జీబిల్ కమాలి : 3/392

(ర) సొంత సోదరి. మక్కా విజయం తర్వాత ఇస్లాం స్వీకరించిన వారిలో ఆమె కూడా ఉన్నారు. ఆమె నుండి 'సిహాహెసిత్తా' ఇంకా మిగతా హదీసు పుస్తకాల్లో నలభై ఆరు హదీసులు ఉల్లేఖించబడ్డాయి. ఆమె నుండి ఉల్లేఖించిన వారిలో ఆమె కుమారులు, మనుమలతో పాటు ఇతర సహాబాలు (సహచరులు) కూడా ఉన్నారు.[1]

## హజ్రత్ అస్మా(ర.అ)

హజ్రత్ అస్మా(ర), హజ్రత్ అబూబకర్(ర) తనయ. హజ్రత్ జుబైర్(రజి) ఇల్లాలు. తొలి కాలంలోనే ఇస్లాం స్వీకరించారు. ఆమెకంటే మునుపు కేవలం పదిహేడు మంది మాత్రమే ఇస్లాం స్వీకరించారు. ఆమె ప్రవక్త(స) నుండి చాలా హదీసులు ఉల్లేఖించారు. ఆమె నుండి ఈ హదీసులను ఇతరుల వరకు సహాబా తాబయీన్‌లు చేరవేశారు. వారిలో కొందరి పేర్లు: ఆమె కుమారుడు అబ్దుల్లాహ్ బిన్ జుబైర్(రజి), మనవడు అబ్దుల్లాహ్ బిన్ అబ్బాద్ బిన్ అబ్దుల్లాహ్, హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అబ్బాస్(రజి), సఫియా బిన్తె షైబా, ఫాతిమా బిన్తె మున్జిర్, ఆమె స్వేచ్ఛ ప్రసాదించిన సేవకుడు అబ్దుల్లాహ్ బిన్ కైసాన్, ఆమె మనవడు అబ్బాద్ బిన్ హమ్జా మొదలైన వారున్నారు.

ఆమె ఉల్లేఖనాలు యాభై ఎనిమిది వరకు ఉన్నాయి. వాటిలో పదమూడు బుఖారీ, ముస్లిం రెండింటిలోనూ ఉన్నాయి. అవే కాకుండా కేవలం బుఖారీలోనే ఐదు, ఇంకా ముస్లింలో నాలుగు హదీసులున్నాయి.

## హజ్రత్ ఖౌలా బిన్తె హకీం(ర.అ)

'ఆమె సజ్జనురాలు. విద్యావంతురాలైన స్త్రీ' అని ఆమె గురించి అల్లామ ఇబ్నె అబ్దుల్ బర్ర్ అంటున్నారు.

---

1. *ఇబ్నె హజర్, అల్ ఐసాబహ్ : 4/485, 486, సఫియుద్దీన్ అల్ ఖజ్‌రజి, ఖులాసతు తజ్‌హీబితహ్‌జాబిల్ కమాలి. 3/403, 404.*

హజ్రత్ ఉమర్ బిన్ అబ్దుల్ అజీజ్ ఆమె నుండి ఒక హదీసు ఉల్లేఖిస్తూ 'సజ్జనురాలు, విద్వాంసురాలైన స్త్రీ ఖౌలా బిన్తె హకీం (ర) ఇలా తెలిపారని పేర్కొన్నారు.[1]

దీన్నిబట్టి ఆమె మంచితనం, విద్యాజ్ఞానాలు అంగీకరించబడ్డాయని అర్థమవుతుంది. ఆమె ద్వారా పదిహేను హదీసులు ఉల్లేఖించబడ్డాయి.

## హజ్రత్ నుసైబా బిన్తె కాబ్(రజి) (ఉమ్మె అతియా(ర.అ)

ఈమె ప్రఖ్యాతిగాంచిన సహాబియా. ఆమె అన్సార్‌కు చెందినవారు. ఆమె ప్రవక్త(స) నుండి నలభై హదీసులు ఉల్లేఖించారు. ఆమె నుండి హదీసులను ఉల్లేఖించినవారిలో హజ్రత్ అనస్ బిన్ మాలిక్(రజి), ముహమ్మద్ బిన్ సీరీన్, హఫ్సా బిన్తె సీరీన్ ఇంకా ఉమ్మె షరాహీల్ మొదలైనవారున్నారు.[2]

## హజ్రత్ ఫరీఅ బిన్తె మాలిక్(ర.అ)

హజ్రత్ ఉస్మాన్ (రజి) తన ఖిలాఫత్ కాలంలో ఓ స్త్రీ ఉల్లేఖనం ఆధారంగా శాస్త్రపరమైన ఒక సమస్యపై తీర్పునిచ్చారు.

జైనబ్ బిన్తె కాబ్ బిన్ ఉజ్రా చెప్పుకొచ్చారు: హజ్రత్ అబూ సయీద్ ఖుద్రీ(ర) సోదరి ఫరీఅ బిన్తె మాలిక్(ర.అ) నాతో అన్నారు. 'నా భర్త మరణించాక నేను ప్రవక్త(స) దగ్గరకెళ్ళి నా భర్త దగ్గర ఎలాంటి ఇల్లు లేదు. అంచేత నా కుటుంబీకులతో పాటు వైధవ్య కాలాన్ని గడపటానికి నాకు అనుమతి ఇవ్వండని అడిగాను. కాని ఆయన(స) ఇల్లు లేకపోయినప్పటికీ

---

1. *తిర్మిజీ, కితాబుల్ బర్రి వస్సిలతి; బాబు మాజాఅఫీ హుబ్బిల్ వలది.*
2. *ఇబ్నె హజర్, తహ్‌జీబిత్తహ్‌జీబ్ : 12/204*

నీ భర్త మరణించాడన్న వార్త విన్నచోటే వైధవ్య కాలం గడపమని ఆదేశించారు.

హజ్రత్ ఉస్మాన్ (రజి) ఖిలాఫత్ కాలంలో ఇలాంటి సమస్యే ఆయనకూ ఎదురైంది. ప్రజలు ఆయనకు నా సంగతి చెప్పారు. అప్పుడు ఆయన నన్ను పిలిపించారు. నేనక్కడికి చేరుకున్నప్పుడు ఆయన కొందరు వ్యక్తుల మధ్య కూర్చొని ఉన్నారు. ఆయన నా ద్వారా విషయం తెలుసుకున్నారు. నేను నా సంగతి వివరించినప్పుడు ఆయన ఆ వితంతువుకి, ఆమె భర్త చనిపోయాడన్న వార్త విన్నచోటే వైధవ్య కాలం గడపాలని చెప్పి పంపించారు. (అబూదావూద్, కితాబుత్తలాఖ్)

## కొందరు ఇతర సహాబియాత్‌లు

ఏదైనా కాలంలోని విద్యా వికాసాలు, ఆలోచనా సరళిని అంచనా వేయటానికి నాటి సుప్రసిద్ధులతోపాటు అపరిచితుల వ్యక్తిత్వాల గురించి కూడా తప్పనిసరిగా చదవాల్సిందే. అప్పుడే ఆనాటి సరైన పరిస్థితులు అవగతమవుతాయి. ఈ క్రమంలో ఒకట్రొండు సంఘటనలు క్రింద పేర్కొనటం జరిగింది.

హజ్రత్ ఉమ్మె వరఖా (ర.అ) ఖుర్ఆన్ కూర్చారని తెలుస్తుంది. మరో ఉల్లేఖనంలో ఆమె ఖుర్ఆన్ నేర్చుకొని ఉన్నారని ఉంది. ప్రవక్త(స) ఆమెను ఆమె ఇంట్లో వారికి ఇమామత్ చేయమని అన్నారు. ఆమె కోసం ఒక ముఅజ్జిన్‌ను కూడా నియమించారు.[1]

దైవప్రవక్త(స) ఓ వృద్ధ మహిళతో 'ఏ వృద్ధురాలూ స్వర్గంలో ప్రవేశించదు' అన్నారు. అందుకామె 'ఎందుకు వెళ్ళదూ?' అని అడిగింది.

1. ఇబ్నెసాద్, *అత్తబఖాతుల్ కుబ్రా : 8/457*, ఇబ్నె అబ్దుల్ బర్ర్, *అల్ ఇస్తీఆబ్: 4/519*- ఇబ్నె హజర్, *అల్ ఇసాబా : 8/489, 490*

హజ్రత్ అనస్(రజి) అంటున్నారు : ఆమె ఖుర్ఆన్ చదివి ఉంది. అంచేత ఆయన(స) ఆమెతో ఇలా అన్నారు.

"నీవు ఖుర్ఆన్ చదవలేదా? దైవం అంటున్నాడు : మేము అలాంటి స్త్రీలకు తిరిగి జన్మనిచ్చాం. ఇంకా వారిని కన్యలుగా చేశాం[1] అంటే ముసలి స్త్రీలు కూడా కన్యగా మారి స్వర్గంలో ప్రవేశిస్తారని అర్థం.

ప్రవక్త(స) అలీ(ర)కు రాయితా (బిన్తె హయ్యాన్) అనే ఒక దాసి నిచ్చారు. హజ్రత్ అలీ(రజి) ఆమెకు కొద్దిగా ఖుర్ఆన్ జ్ఞానాన్ని బోధించారు.[2]

ధర్మానికి మూలం ఖుర్ఆన్, హదీసులే. ఈ రెండింటి వల్లే ధర్మం గురించి సరైన వివరణ, మార్గదర్శనం లభిస్తాయి. దాని వేర్లు బలపరచటానికి, దాని బోధనలు వ్యాప్తి చేయటానికి సహాబియాత్ల పనితీరు, కృషి గురించి కొంతవరకు చర్చించాం. తర్వాతి కాలంలోని తాబయీన్లలో కొందరు స్త్రీలు విద్యాజ్ఞానాల్లో తమకంటూ ప్రత్యేక స్థానాన్ని సంపాయించుకున్నారు. అలాంటి వారి గురించి ప్రస్తావించటం జరిగింది.

## ఉమ్మె దర్దా అల్ హుజైమా

ఉస్మాన్ బిన్ అబుల్ ఆతికా, ఉమ్మె జాబిర్ తెలిపారు : ఉమ్మె దర్దాను అబూదర్దా పెంచారు. ఆమె చిన్నపిల్లగా ఉన్నప్పుడు బర్నిస్ (పొడుగాటి జుబ్బా, దాంతో తల కూడా కప్పబడి ఉండేది) తొడుక్కొని, అబూ దర్దాతో పాటువచ్చి వెళ్ళేవారు. మగవారి పంక్తుల్లో నిలబడి నమాజ్ చేసేవారు. ఖారీల సమావేశాల్లో వెళ్ళి కూర్చునేవారు. కాస్త పెద్దయ్యాక హజ్రత్ అబూదర్దా(రజి) 'నీవు స్త్రీల పంక్తుల్లో నిలబడు' అన్నారు.[3]

---

1. *మిష్కాతుల్ మసాబిహ్, కితాబుల్ అదబ్, బాబుల్ మజాహి బహవాలా రజీన్.*
2. *ఇబ్నె అసీర్, అసదుల్ గాబ్బహ్ : 8 /130.*
3. *ఇబ్నె హజర్, తహ్జీబిత్తహ్జీబ్ : 12/414.*

విద్యార్జన పట్ల ఆమెకున్న ఆసక్తి ఎట్టిదో ఔఫ్ బిన్ అబ్దుల్లాహ్ గారి ఒక ఉల్లేఖనం ద్వారా తెలుస్తుంది. ఆయన చెప్పుకొచ్చారు. 'మేము ఒకసారి ఉమ్మె దర్దా దగ్గర కూర్చొని ఉన్నాం. చాలాసేపటి తర్వాత మేము మీకు చాలా ఇబ్బంది పెట్టాం. మీకు చిరాకు కల్గిందేమో? అన్నాం. అందుకామె 'ప్రతి పనిలోను దైవారాధన చేయటమే నా అభిమతం. పండితుల సాంగత్యంలో కూర్చుని వాదోపవాదాలు చేయటంలో కలిగే తృప్తి మరే వస్తువులోను ఉండదు' అన్నారు. ఆ తర్వాత ఆమె తెర వెనుకకు వెళ్ళిపోయారు. ఒకతనికి ఖుర్ఆన్ పఠించమని పురమాయించారు. అతను 'వలఖద్ వస్సల్‌నా లహుముల్ ఖౌల... చివరి వరకు వాక్యాలను చది వాడు. అందుకామె "అన్నిటికంటే గొప్ప జ్ఞానం దైవాన్ని తెలుసుకోవటమే' అన్నారు. అబ్దురబ్బిహ్ ఆమె దగ్గర విద్యను అభ్యసించేవారు. ఆయన అంటున్నారు: ఒకరోజు పలక మీద ఆమె **'తఅల్లముల్ హిక్మత సిగారన్ తుఅల్లిమూనహా కిబారన్'** (అంటే బాల్యంలో బుద్ధి వివేకాలు నేర్చుకో. పెద్దయిన తర్వాత ఇతరులకు నేర్పిస్తావు) **'ఇన్నకుల్ల జారియిన్ హాసిదున్ మాజరఅ మిన్ ఖైరిన్ అవ్ షర్రిన్'** (ప్రతి రైతు మంచి, చెడు దేన్నయితే నాటుతాడో, దాన్ని తప్పనిసరిగా కోసుకుంటాడు) అని రాశారు.[1]

ఆమె హజ్రత్ అబూదర్దా(రజి), హజ్రత్ సల్మాన్‌ఫార్సీ (రజి), హజ్రత్ ఫుజాలా బిన్ ఉబైద్(రజి), హజ్రత్ అబూహురైరా(ర), హజ్రత్ కాబ్ బిన్ ఆసిమ్ (ర) ఇంకా హజ్రత్ ఆయెషా(ర) నుండి హదీసులు ఉల్లేఖించారు. హాఫిజ్ ఇబ్నె హజర్ (రహ్మాలై) ఆమె నుండి హదీసులు విని ఉల్లేఖించిన పందొమ్మిది మంది పెద్ద మనుషులను ప్రస్తావించిన తర్వాత వీరేకాకుండా ఇతరులు కూడా ఆమె నుండి హదీసులు ఉల్లేఖించారని రాశారు.[2]

1. *నవవీ, తహ్‌జీబిల్ అస్మాయి వల్లుగాతి : 2/360, 361*
2. *ఇబ్నె హజర్, తహ్‌జీబిత్తహ్‌జీబ్ : 2/414*

ఇమామ్ నవవీ (రహ్మాలై), ఆమె నుండి పెద్ద సంఖ్యలోనే తాబయీన్‌లలోని గొప్పవారు హదీసులు ఉల్లేఖించారని అంటున్నారు.[1]

ఇమామ్ జహబీ (రహ్మాలై) ఆమె గురించి ఇలా ప్రస్తావించారు : 'ఆమె ధర్మశాస్త్రవేత్త, పండితురాలు, ఆరాధకురాలు, సౌందర్యవతి, మహాజ్ఞాని, వివేకవంతురాలు'

## ఉమ్రా బిన్తె అబ్దుర్రహ్మాన్

ఈమె హజ్రత్ ఆయిషా(రజి) ఒళ్ళో పెరిగారు. ఆమె ప్రియ విద్యార్థినుల్లో ఒకరు. హిజ్రీ శకం 95లో తనువు చాలించారు. ఆమె ఆయెషా (ర.అ) నుండే కాకుండా ఉమ్మె హిషాం బిన్తె హారిసా, హబీబా బిన్తె సహ్లా, ఇంకా హజ్రత్ ఉమ్మె హబీబా, హమ్నా బిన్తె జహష్‌ల నుండి కూడా హదీసులు ఉల్లేఖించారు.

ఆమె నుండి ఆనాటి ప్రముఖులు కూడా హదీసులు ఉల్లేఖించారు. వారిలో ఇమామ్ జుహ్రీ, అబ్దుల్లాహ్ బిన్ అబూబకర్ బిన్ హజం, యహ్యా బిన్ సయీద్ అన్సారీ, ఉర్వా బిన్ జుబైర్, సులైమాన్ బిన్ యసార్ ఇంకా అమ్ర్ బిన్ దీనార్ లాంటి ఇమాములు ఉన్నారు. ఆమెను ధర్మశాస్త్రవేత్తగా, తాబయీన్ కాలంలో స్త్రీల నాయకురాలిగా చెప్పుకుంటారు.[2]

ఆమె జ్ఞాన విశిష్టత ఎటువంటిదో గొప్ప గొప్ప హదీసు ఉల్లేఖకుల అభిప్రాయాల ద్వారా స్పష్టమవుతుంది. ఇబ్నె మయీన్ 'సిఖతున్ హుజ్జతున్' అంటే, ఆమె నమ్మకస్తురాలు, ప్రమాణబద్ధత గల మహిళ అని అంటున్నారు. అహ్మద్ బిన్ ముహమ్మద్ చెప్పుకొచ్చారు: నేను, ఇబ్నె మయీన్‌ను చాలా గొప్ప పదాల్లో ఆమె ప్రస్తావన చేయటం విన్నాను.

---

1 *నవవీ, తహ్జీబిల్ అస్మాయి వల్లుగాతి : 2/360*

2. *సఫియుద్దీన్ ఖజ్‌రజీ, ఖులాసతు తజ్‌హీబి తహ్జీబిల్ కమాలి : 3/388*

ఆయన, 'హజ్రత్ ఆయెషా(రజి) నుండి ఉల్లేఖించిన వారిలో నమ్మకస్తు రాలిగా ఆమె లెక్కించబడేది' అని అన్నారు. ఇబ్నె హిబ్బాన్, అజ్లీ కూడా ఆమెను నమ్మకస్తురాలు అని అన్నారు. హజ్రత్ ఆయెషా (ర) గారి ఉల్లేఖనాల గురించి ఎక్కువ జ్ఞానం ఆమెకే ఉందని ఇబ్నె హిబ్బాన్ అంటు న్నారు.

హజ్రత్ సుఫ్యాన్ సౌరీ, 'ఆయెషా(రజి) నుండి ఉల్లేఖించినవారిలో ఉమ్రా బిన్తె అబ్దుర్రహ్మాన్, ఖాసిం బిన్ ముహమ్మద్, ఇంకా ఉర్వా బిన్ జుబైర్ అందరికంటే ఎక్కువగా నమ్మదగినవారు' అని అంటున్నారు. అబ్దుర్రహ్మాన్ బిన్ ఖాసిం, ఆయెషా(రజి) ఉల్లేఖనాలు ఆమెను అడిగి తెలుసుకుంటూ ఉండేవారని తెలుస్తుంది. హజ్రత్ ఉమర్ బిన్ అబ్దుల్ అజీజ్(ర), హజ్రత్ ఆయెషా(ర) ఉల్లేఖనాలు ఆమెకంటే ఎక్కువగా మరెవరికి తెలియవని ముహమ్మద్ బిన్ అబ్దుర్రహ్మాన్‌కు రాశారు.[1]

ఆమె పండితురాలని ఇబ్నె సాద్ అన్నారు. ఉమర్ బిన్ అబ్దుల్ అజీజ్, అబూబకర్ బిన్ ముహమ్మద్ బిన్ హజంకు లేఖ వ్రాస్తూ ఆమె నుండి హదీసులు రాయమని ఆదేశించారు.[2]

## హఫ్సా బిన్తె సీరీన్

ఈమె పన్నెండవ ఏటే ఖుర్‌ఆన్ జ్ఞానాన్ని అభ్యసించారు. యహ్యా బిన్ సీరీన్, అనస్ బిన్ మాలిక్(రజి), ఉమ్మె అతియా అన్సారియా, ఉమ్మె రాయిహ్, అబుల్ ఆలియా, అబూజుబ్యాన్, రబీ బిన్ జియాద్, ఇంకా హసన్ బస్రీ గారి తల్లి హీరా నుండి హదీసులు ఉల్లేఖించారు. ఆమె నుండి ముహమ్మద్ బిన్ సీరీన్, ఖతాదా (రజి), ఆసిముల్ అహ్‌వల్, అయ్యూబ్

---

1. *ఇబ్నెహజర్, తహ్‌జీబుత్తహ్‌జీబ్ : 12/389*
2. *ఇబ్నెసాద్, అత్తబఖాత్ : 8/480*

సఖ్తియానీ, ఖాలిదుల్ హిజా, ఇబ్నె ఊన్, హిషాం బిన్ హయాన్ లాంటి ప్రముఖులు హదీసులు ఉల్లేఖించారు.

ఇమామ్ ఇబ్నె ముయీన్ ఆమె గురించి 'సిఖతున్ హుజ్జతున్' అన్నారు. ఇబ్నె హిబ్బాన్ కూడా ఆమెను నమ్మకస్తురాలిగా పేర్కొన్నారు.

అయాస్ బిన్ ముఆవియా 'నేను హఫ్సా బిన్తె సీరీన్ కంటే గొప్ప వ్యక్తి మరొకరిని చూడలేదు' అని అన్నారు.

హిజ్రీ శకం నూట ఒకటి (101)లో తనువు చాలించారు.[1]

## ఆయిషా బిన్తె సాద్ బిన్ అబీ వఖ్ఖాస్ (రజి)

ఆయిషా బిన్తె సాద్ విశ్వాసుల మాతృమూర్తుల్లో ఆరుగురిని చూశారు. ఆమె ఇలా అన్నారు : 'నా చిన్నతనంలో నేను వారిలో ఎవరి దగ్గరికైనా వెళ్ళినప్పుడు వారు నన్ను ఒళ్ళో కూర్చొపెట్టుకొనేవారు. శుభం కోసం ప్రార్థించేవాళ్ళు.' దీనిని బట్టి ప్రజలు ఆమె పట్ల ప్రత్యేక శ్రద్ధ కలిగి ఉండేవారని తెలుస్తుంది.

హబీబ్ బిన్ మర్జూఖ్ అంటున్నారు : 'నేను మస్జిద్ వెలుపల ఓ మహిళను చూశాను. ఆమెతోపాటు మరికొందరు స్త్రీలున్నారు. దీపం వెలుగుతుంది. నేను ఆమె గురించి అడిగినప్పుడు, ఆమె హజ్రత్ సాద్ బిన్ అబీ వఖ్ఖాస్ తనయురాలు ఆయిషా అని తెలిసింది.[2]

ఆమె తన తండ్రి హజ్రత్ సాద్ బిన్ అబీ వఖ్ఖాస్(రజి) నుండి ఇంకా ఉమ్మెజర్ నుండి హదీసులను ఉల్లేఖించారు. ఆమె నుండి హదీసులు ఉల్లేఖించిన వారిలో జుఐద్ బిద్ అబ్దుర్రహ్మాన్, అయ్యూబ్ సఖ్తియానీ,

---

1. ఇబ్నె హజర్, తహ్జీబిత్తహ్జీబ్ : *12/360,361*
2. ఇబ్నె సాద్, అత్తబఖాత్ : *8/467, 468*

హకం బిన్ ఉతైబా, ఖుజైమా, అబుజ్జినాద్, ముహాజిర్ బిన్ మిస్మార్, ఉబైదా బిన్తె నాబిల్ ఇంకా ఇమామ్ మాలిక్ (రహ్మలై) లాంటి గొప్ప వ్యక్తులున్నారు. ఇమాం మాలిక్(రహ్మలై) ఆమె నుండి తప్ప మరే స్త్రీ నుండీ ఉల్లేఖించలేదు అని ఖలీల్ అంటున్నారు. ఇబ్నె హిబ్బాన్ ఆమెను నమ్మకస్తురాలిగా ప్రస్తావించారు. అజ్లీ కూడా ఆమెను నమ్మకస్తురాలిగా తీర్మానించారు. హిజ్రీ శకం 117వ సంవత్సరం ఆమె మరణించారు.[1]

## ఆయిషా బిన్తె తల్హా

ఆమె తల్లి హజ్రత్ అబూబకర్(రజి) గారి కుమార్తె ఉమ్మె కుల్సూం. ఆమె ఆయెషా(రజి) నుండి హదీసు ఉల్లేఖించారు. ఆమె నుండి ఆమె కుమారుడు తల్హాబిన్ అబ్దుల్లాహ్, హబీబ్ బిన్ అమ్ర్, ఆమె సోదర కుమారుడు తల్హా బిన్ యహ్యా, మరో సోదర కుమారుడు ముఆవియా బిన్ ఇస్‌హాఖ్, మూసా బిన్ ఉబైదుల్లాహ్, ఫుజైల్ బిన్ అమ్ర్, మిన్హాల్ బిన్ అమ్ర్, అతా బిన్ అబీ రబాహ్, ఇంకా అమ్ర్ బిన్ సయీద్ ఉల్లేఖించారు. ఆమె 'సిఖతున్ హుజ్జతున్' అని ఇబ్నె ముయీన్ అన్నారు. అజ్లీ, ఇబ్నె హిబ్బాన్ ఆమెను నమ్మదగిన వారిలో చేర్చారు. అబూజర్అ దమిష్ఖీ లాంటి హదీసు ఉల్లేఖకులు 'ఆమె విద్యాజ్ఞానాలు, నైతిక నడవడిని చూసి ప్రజలు ఆమె నుండి హదీసులు ఉల్లేఖించార'ని అన్నారు.[2]

## హీరా ఉమ్ముల్ హసన్

హీరా ఉమ్ముల్ హసన్ బస్రీ, హజ్రత్ ఉమ్మె సలమా (ర) గారి సేవకురాలు. ఆమె హజ్రత్ సలమా (రజి), హజ్రత్ ఆయెషా(ర) నుండి

1. ఇబ్నె హజర్, *తహ్‌జీబుత్తహ్‌జీబ్ : 12/386, 387*
2. ఇబ్నెహజర్, *తహ్‌జీబుత్తహ్‌జీబ్ :12/436, 437*

హదీసులు ఉల్లేఖించారు. ఆమె నుండి ఆమె ఇద్దరు కొడుకులు హసన్ బస్రీ, సయీద్ బస్రీ, ఇంకా అలీ బిన్ జైద్ బిన్ జద్ఆన్, ముఆవియా బిన్ ఖుర్రా ముజ్నీ, హఫ్సా బిన్తె సీరీన్ ఉల్లేఖించారు. ఇబ్నె హిబ్బాన్, ఆమెను నమ్మకస్తుల్లో ప్రస్తావించారు.[1]

ఇపుడు మనం తాబయీన్ కాలం తర్వాతి కాలం నాటి మరి కొందరు స్త్రీల గురించి చర్చిద్దాం.

## సయ్యిదా నఫీసా

ప్రవక్త(స) కుటుంబానికి చెందినవారు. ఆమె వంశపరంపర నఫీసా బిన్తె హసన్ బిన్ జైద్ బిన్ హసన్ బిన్ అలీ బిన్ అబీతాలిబ్. ఆమె తన పెనిమిటి ఇస్‌హాఖ్ బిన్ జాఫర్ సాదిఖ్‌తోపాటు ఈజిప్టు వెళ్ళారు. ఒక అభిప్రాయం ప్రకారం ఆమె తన తండ్రి హసన్‌తోపాటు వెళ్ళారని వుంది. 'నఫీసా చాలా మంచిది. దైవభీతి కలిగిన స్త్రీ' అని అల్లామా ఇబ్నె ఖల్కాన్ అన్నారు. ఆమె విద్యాజ్ఞానాలు ఏమేరకు ఉండేవంటే, ఆమె ఈజిప్టు చేరుకున్నప్పుడు ఇమామ్ షాఫయి (రహ్మలై) ఆమె దగ్గరికెళ్ళి హదీసు విన్నారు. ఇమామ్ గారి మరణానంతరం జనాజాను ఆమె ఇంటికి చేరవేయటం జరిగింది. ఆమె ఇంట్లోనే జనాజా నమాజు ముగించారు. ఈజిప్షియన్లకు ఆమెపై అపార నమ్మకం ఉండేది. హిజ్రీ 208వ సంవత్సరం ఆమె తనువు చాలించారు.[2]

## సయీద్ బిన్ ముసయ్యిబ్ తనయ

హజ్రత్ సయీద్ బిన్ ముసయ్యిబ్‌ను సయ్యిదుత్తాబయీన్ (తాబయీల నాయకులు) అని అంటారు. ఆయన గారి ఒక శిష్యుడు

1. ఇబ్నె హజర్, తహ్‌జీబుత్తహ్‌జీబ్: 12/416
2. ఇబ్నె ఖల్కాన్, వఫియాతుల్ అయాన్: 5/56, 57

అబూ వదాఅ ఇలా అన్నారు : నేను హజ్రత్ సయీద్ గారి దర్స్‌లో పాల్గొనేవాణ్ణి. కొన్ని రోజులు నేను ఆయన్ని కలవలేదు. తిరిగి నేను ఆయన్ను కలుసుకున్నప్పుడు ఎక్కడికెళ్ళావని అడిగారు.

'నా ఇల్లాలు చనిపోయింది. అంచేత రాలేకపోయాను' అన్నాను. "అరే మరి, మాకు కబురు పంపలేదేంటి? మేము కూడా జనాజా నమాజులో పాల్గొనేవాళ్ళం కదా!' అన్నారు.

కాసేపటి మౌనం తర్వాత నేను లేస్తున్నప్పుడు 'మళ్ళీ పెళ్ళి చేసుకోలేదా?' అనడిగారు.

దైవ కారుణ్యాలు మీపై వర్షించుగాక! ఈ దరిద్రుడికి పిల్లనెవరి స్తారు. నా దగ్గర రెండు మూడు దిర్హంలకంటే ఎక్కువ లేదు అన్నాను.

'నేను నీ వివాహం జరిపించనా? అందుకు నీవు సిద్ధంగానే వున్నావా?' అనడిగారు.

సరే అన్నాను.

మహనీయులు దైవస్తుతి, దురూద్ పఠించాక తన గారాల పట్టితో నా పెళ్ళి జరిపించేశారు. రెండు మూడు దిర్హంలు మహర్‌గా నిర్ణయిం చారు. సమావేశం నుండి లేచి నిలబడినప్పుడు ఆనందంతో నా మతి పోయినట్టనిపించింది. ఏమి చేయాలో ఏమి చేయకూడదో అర్థం కాలేదు. ఇంటికెళ్ళి ఎవరి వద్దనైనా అప్పు తీసుకుందామని ఆలోచించాను.

నేను ఆ రోజు ఉపవాసంతో ఉన్నాను. మగ్రిబ్ నమాజ్ ముగించు కుని, అన్నం తిందామని కూర్చున్నాను. అది కూడా రొట్టె, నూనె మాత్రమే. అంతలో తలుపు తట్టుతున్నట్లు శబ్దం వినపడింది. ఎవరని అడిగాను. బదులుగా సయీద్ అని వినబడింది. ఏ సయీద్ అయి వుంటారు అని నేనొక్క నిమిషం ఆలోచించాను. నాకు తెలిసిన సయీద్ పేరు గల వ్యక్తులు

ఒక్కొక్కరుగా గుర్తుకు రాసాగారు. కాని సయీద్ బిన్ ముసయ్యిబ్ గురించి నాకసలు ఆలోచనే రాలేదు. ఎందుకంటే నలభై ఏళ్ళ తరబడి ఇంటికి మస్జిద్‌కి మధ్యనే ఆయన నడక పరిమితమయ్యింది. మరెక్కడికీ వెళ్ళేవారు కాదు. వెలుపలికొచ్చి చూశాను. సయీద్ బిన్ ముసయ్యిబ్ నిల్చోని ఉన్నారు. ఆయన్ను చూడగానే బహుశా మనసు మార్చుకున్నారేమో అనే ఆలోచన వచ్చింది.

అబూ ముహమ్మద్! మీరెందుకు శ్రమ తీసుకున్నారు. పిలిపిస్తే నేనే వచ్చేవాడ్ని కదా అన్నాను.

'అలా కాదు, ఇప్పుడు నేనే నీ దగ్గరకు రావటం ఎక్కువ సబబు' అన్నారాయన.

వచ్చిన పని ఏమిటని అడిగాను.

'నీవా, యువకుడివి. నీకు వివాహం జరిగిపోయింది. అర్థాంగిని వదిలి అలా ఒంటరిగా ఉండటం బాగాలేదనిపించింది. ఇదిగో, ఈమె నీ భార్య ఈమెను లోనికి తీసుకెళ్ళు' అని అన్నారు. ఆమె ఆయన వెనుక నిల్చోని ఉంది. తర్వాత ఆయన ఆమెను లోపలికి పంపించి, తలుపు దగ్గరికేసి వెళ్ళిపోయారు.

అమ్మాయేమో సిగ్గుతో తలదించుకొని వుంది.

ఇంటిపైకప్పు మీద నిలబడి ఇరుగుపొరుగు వాళ్ళను కేకేసి పిలిచాను. అందరూ విషయం ఏంటని అడిగారు. సయీద్ బిన్ ముసయ్యిబ్ తన గారాల పట్టిని నాకిచ్చి పెళ్ళిచేశారు. ఆమెను ఇప్పుడే విడిచి వెళ్ళిపోయారు. ఆమె నా ఇంట్లోనే వుంది. వచ్చి చూడండి అని ఆనందం వ్యక్తం చేశాను. ప్రజలు చూసి వెళ్ళారు. మా అమ్మకు విషయం తెలిసి ఆమె కూడా వచ్చింది. మూడ్రోజులు ఆమెను అలంకరిస్తాననీ, ఆ తర్వాతే ఆమెను ముట్టుకోవాలని అమ్మ ఒట్టేసి చెప్పింది. మూడ్రోజుల

తర్వాత నేను ఆమెను చూసినప్పుడు ఆమె అందరికంటే ఎక్కువ అందగత్తె అని, గొప్ప ఖుర్ఆన్ పండితురాలనీ, ప్రవక్త(స) సున్నతులు తెలిసిన జ్ఞాని అనీ, భర్త హక్కులు ఎరిగిన ఇల్లాలనీ అర్థమయ్యింది.

ఓ నెలరోజులపాటు సయీద్ బిన్ ముసయ్యిబ్ మా ఇంటికి రాలేదు. నేనూ ఆయన దగ్గరకెళ్ళలేదు. నెలరోజుల తర్వాత సమావేశంలో పాల్గొన్నాను. సలాం చేశాను. ఆయన ప్రతిసలాం చేశారు. ఇంకేమీ మాట్లాడలేదు. అందరూ వెళ్ళిపోయాక అక్కడ నేను తప్ప ఇంకెవ్వరూ లేరు. అప్పుడాయన అమ్మాయి పరిస్థితి ఎలా ఉందని అడిగారు.

'మిత్రులు వేనోళ్ళ మెచ్చుకొనే విధంగా శత్రువులు నొచ్చుకొనే విధంగా ఉంద'ని అన్నాను.

'ఒకవేళ నీకేదైనా విషయం బాధ కలిగిస్తే నీవు ఆమెను సంస్కరించ వచ్చు' అన్నారు.

హజ్రత్ సయీద్ బిన్ ముసయ్యిబ్ గారి ఈ అమ్మాయి కోసం నాటి ఖలీఫా అబ్దుల్ మలిక్ బిన్ మర్వాన్ తన కుమారుడు వలీద్‌కై వివాహ సందేశం పంపాడు. ఆ సమయంలో అతణ్ణి, మలిక్ ఉన్నతాధికారిగా నియమించి ఉన్నాడు. అయినప్పటికీ హజ్రత్ సయీద్ (రహ్మ) ఆ సంబంధాన్ని తిరస్కరించారు. అబ్దుల్ మలిక్ ఎన్నో పన్నాగాలు పన్నాడు. చివరికి చలిలో ఆయన్ను కొట్టించాడు. చన్నీళ్ళను తెప్పించి ఆయనపై వేయించే వాడు. అయినా కూడా ఆయన అంగీకరించలేదు.

పెళ్ళయిన మరుసటి రోజు అబూ వదాఅ దర్స్‌లో పాల్గొనేందుకు సిద్ధమవుతున్నప్పుడు ఆ అమ్మాయి **'ఇజ్లిస్ ఉఅల్లిముక ఇల్మ సయీదిన్'** (కూర్చొండి, సయీద్ మీకు బోధించే పాఠాలు నేనిక్కడే మీకు నేర్పుతాను) అని అందని ఈ సంఘటన చివరిలో ఉంది.[1]

---

1. ఇబ్నె ఖల్కాన్, వఫియాతుల్ ఆయాన్ : *2/92*

ఈ సంఘటనలో నీతితో కూడుకున్న చాలా కోణాలున్నాయి. రెండు కోణాలు మాత్రం మరీ ఎక్కువగా ప్రస్ఫుటమవుతాయి. తొలి విషయం హ(జ్రత్ సయీద్ బిన్ ముసయ్యిబ్ గారి వ్యక్తిత్వం ఎలాంటిదో తెలుస్తుంది. ఆయన తన కుమార్తె కోసం ఒక రాకుమారుణ్ణి కాదని ఒక శిష్యుడికి ప్రాధాన్యతనిచ్చారు. మరో విషయం ఒక అమ్మాయి సయీద్ బిన్ ముసయ్యిబ్ లాంటి గొప్ప ఇమామ్‌కు ప్రాతినిధ్యం కూడా వహిస్తుంది.

## అల్ ముపైద్ జైనబ్ బిన్తె అబుల్ ఖాసిమ్

524 హి(జ్రీ శకం నీషాపూర్‌లో జన్మించారు. 615 హి(జ్రీలో నీషాపూర్‌లోనే తుదిశ్వాస విడిచారు.

'ఆమె పండితురాలు. ఆమెకు గొప్ప గొప్ప పండితుల సాంగత్యం లభించింది. వారి వద్ద హదీసులు చదివారు. ఇతరులకు హదీసు బోధించే సనద్ కూడా పొందారు. ఆమె గురువుల్లో అబుల్ ఖాసిం నీషాపూరీ, అబుల్ ఖాసిం జాహిర్, అబూబకర్ వజియా, అబుల్ ముజఫ్ఫర్, అబుల్ ఫుతూహ్ అబ్దుల్ వహ్హాబ్ మొదలైనవారున్నారు. ఆమెకు హదీసు ఉల్లేఖించే అనుజ్ఞ హాఫిజ్ అబుల్ హసన్ అబ్దుల్ గాఫిర్ ఫార్సీ, ఇంకా అల్లామ అబుల్ ఖాసిం మహ్మూద్ బిన్ ఉమరుల్ జమ్ ఖ్రీ సాహెబ్ కష్షాఫ్ లాంటి గురువుల నుండి లభించింది. మాక్కూడా ఆమె హదీసు ఉల్లేఖించే అనుజ్ఞ ఇవ్వబడిందని ఇబ్నె ఖల్కాన్ అంటున్నారు.[1]

## షుహ్దా బిన్తె అబీ నస్ర్

ఆమె పండితురాలునూ ఇంకా మంచి రచయిత్రి కూడా. 'అత్యధికులు ఆమె నుండి హదీసు జ్ఞానాన్ని పొందారు' అని ఇబ్నె ఖల్కాన్

---

1. *ఇబ్నె ఖల్కాన్, వఫియాతుల్ ఆయాన్ : 2/ 92.*

అంటున్నారు. ఇంకా ఆమెకు 'సమాయె ఆలీ' కూడా వచ్చు. అంటే ప్రవక్త(స) హదీసు ఉల్లేఖకుల పరంపరను సంక్షిప్తంగా ప్రస్తావించటంలో ఆమెది అందెవేసిన చేయి. ముహద్దిసీన్ (హదీసువేత్తల) వద్ద ఇదో గొప్ప విశిష్టత. ఆమె తన కాలంలో పెద్దపెద్ద గురువుల వద్ద హదీసు జ్ఞానాన్ని అభ్యసించారు.

ఇంకా ఆమె గురించి గొప్పగా చెప్పుకొనే వారనీ, దూర ప్రాంతాల వరకు ఆమె ప్రఖ్యాతిగాంచారని కూడా ఇబ్నె ఖల్కాన్ పేర్కొన్నారు. 574 హిజ్రీలో ఆమె తనువు చాలించారు.[1]

ఇప్పుడు సామాన్య ప్రజానీకం గురించి తెలిపే ఒక సంఘటన మీ ముందుంచుతున్నాం. ఖలీఫా మన్సూర్ కుమార్తె, హారూన్ రషీద్ అర్థాంగి ఉమ్మె జాఫర్ గురించి తెలిసేదేమిటంటే ఆమె రాజభవనంలో వంద మంది చెలికత్తెలుండేవారు. వారందరూ ఖుర్ఆన్ కంఠస్థం చేసినవారే. వారిలో ప్రతి ఒక్కరికి రోజూ మూడు పారాలు చదవటం తప్పనిసరిగా ఉండేది. ఆమె అంత:పురం నుండి ఖుర్ఆన్ పఠించే ధ్వని తేనెతుట్టె నుండి తేనెటీగల ధ్వని వచ్చినట్లు ధ్వనిస్తూ ఉండేది.[2]

నాటి పని మనుషులే ఖుర్ఆన్ హాఫిజులైతే మిగతా స్త్రీల విద్యా వికాసాలు ఏ స్థాయిలో ఉండేవో అంచనా వేయవచ్చు.



---

1. ఇబ్నె ఖల్కాన్, వఫియాతుల్ ఆయాన్ : *2/ 172*
2. ఇబ్నె ఖల్కాన్, వఫియాతుల్ ఆయాన్ : *2/70*

# ముస్లిం మహిళ

# (ధార్మిక, సామాజిక, రాజకీయ సేవలు)

మునుపటి స్త్రీలు సమాజానికి దూరంగానో, సమాజాన్ని పట్టించుకోకుండానో ఉండేవారు కాదు. పైగా వారు సందేశ ప్రచారంలో, సమాజ సేవలో, రాజకీయ విషయాల్లోనూ చురుగ్గా పాల్గొనేవారు. ధర్మాన్ని వ్యాపింపజేయడానికి తమ వంతు కృషి చేసేవారు.

## సందేశ ప్రచారం

మానవ జీవితంపై ఎలాంటి ప్రభావం చూపకపోవటానికి ఇస్లాంను ఒప్పుకోవటం, ఒప్పుకోకపోవటం అనేది ఏదో సామాన్య విషయం కాదు. వాస్తవానికి ఇదో పెద్ద విషయం. దీంతోనే ఇహపరలోకాల సఫలత ముడిపడి వుంది. దైవధర్మాన్ని ఇతరులకు చేరవేయడం, లోకానికి దాని ప్రాశస్త్యం వివరించటం దాన్ని స్వీకరించిన వారి బాధ్యత. ఈ బాధ్యత మగవారితో పాటు ఆడవారిపై కూడా వుంది. ఇరువురూ ఈ బాధ్యతను గ్రహించి దాన్ని పూర్తి చేయటంలో నిమగ్నమయినందువల్లే ప్రపంచంలో ఇస్లాం విస్తరించింది. ముస్లిం వనితలు కష్టకాలంలో సైతం ఈ బాధ్యతను ఏవిధంగా నిర్వర్తించారో దిగువనున్న సంఘటనల ద్వారా తెలుసుకోవచ్చు.

హజ్రత్ అనస్(రజి) తల్లి ఉమ్మె సులైం బిన్తె మల్హాన్(రజి). ఆమె తన తెలివితేటలు, బుద్ధివివేకాల్లో పేరుగాంచారు.

'ఆమె బుద్ధివంతురాలు. మేధావుల్లో ఒకరు' అని అల్లామా ఇబ్నె అబ్దుల్ బర్ర్ అంటున్నారు.[1]

'విద్యాజ్ఞానాలు ఉన్న స్త్రీలలో ఆమె లెక్కించబడేవార'ని ఇమామ్ నవవీ (రహ్మాలై) అంటున్నారు.[2]

సత్కార్యం చేయటంలోనూ దైవభీతి కలిగిన వారిలోను ఆమె ఉన్నత స్థానం కలిగివుండేవారు. ఒకసారి దైవప్రవక్త(స) 'నేను స్వర్గాన్ని దర్శించాను. నేనక్కడ ఎవరిదో కాలి సవ్వడి విన్నాను. ఈ శబ్దం ఎవరిదని అడిగాను. ఇది అమీసా (ఉమ్మె అనస్(రజి) సవ్వడి అని చెప్పబడింది.[3]

మదీనాలో ఇస్లాం ప్రవేశించినప్పుడు ఆమె ముందడుగు వేసి దాన్ని స్వీకరించారు. ఆ సమయంలో ఆమె భర్త మాలిక్ బిన్ నజ్ర్ మదీనాలో లేరు. తిరుగొచ్చినాక ఆయనకు విషయం తెలిసి నీవు అధర్మానికి పాల య్యావా? అని నిలదీశారు.

'లేదండి! నేను ముహమ్మద్(స)ను విశ్వసించాను' అని అన్నారామె. అనస్ బిన్ మాలిక్(రజి) ఒళ్లో ఉన్నారు. బాబుకి 'లా ఇలాహ ఇల్లల్లాహు ముహమ్మదుర్రసూలుల్లాహ్' పలకటం నేర్పిస్తున్నారు. ఇది చూసి ఆయన 'నా కొడుకు ధర్మాన్ని కూడా పాడు చేయకు' అని కోపగించుకున్నారు.

'నేను అతని ధర్మాన్ని పాడు చేయటం లేదు. (సరైన ధర్మాన్ని బోధిస్తున్నాను)' అన్నారామె.

---

1. *ఇబ్నె అబ్దుల్ బర్ర్, అల్ ఇస్తీఆబ్ : 4/494*
2. *నవవీ, తహ్జీబుల్ అస్మాయి వల్లుగాత్ : 2/363*
3. *బుఖారీ, కితాబు ఫజాయిలి అస్హాబిన్నబియ్యి (స)– బాబు మునాఖిబి ఉమర్(రజి), ముస్లిం, కితాబుల్ ఫజాయిల్, బాబు ఫజాయిలి ఉమ్మె సులైం (ర.అ)*

ఆమె తన భర్తకు ఇస్లాం సందేశం ఇస్తూ ఉండేవారు. కాని ఆయన స్వీకరించలేదు. కోపంతో సిరియా వెళ్ళిపోయారు. అక్కడే ఆయన చనిపోయారు.[1]

ఆమె భర్త మరణానంతరం ప్రముఖ సహాబి హజ్రత్ అబూతల్హా (ర) ఆమెను పెళ్ళాడాలనుకున్నారు. ఆ సమయంలో ఆయన ఇస్లాం స్వీకరించి లేరు. 'మీరేమో అవిశ్వాసి, నేనేమో విశ్వాసురాలిని. మీరు ఇస్లాం స్వీకరించనంతవరకు మనిద్దరి వివాహం జరగదు' అని నిక్కచ్చిగా చెప్పారామె.

ఆవిడ ఆయనకు సత్యాన్ని వివరిస్తూ "ఆలోచించండి, మీరు పూజించే ఈ శిల్పాలు రాయితోనో, చెక్కతోనే చేసినవి. అసలు వీటి యదార్థమేమిటి? ఫలానా తెగకు చెందిన శిల్పి నేల నుండి రాయి తీసుకుని దాన్ని శిల్పంగా చెక్కాడు. ఫలానా వడ్రంగి చెక్కను తీసుకొని బొమ్మగా మలిచాడు. ఇవి మీకు లాభాన్ని గాని, నష్టాన్ని గాని కల్గించలేవు. కాని మీరు తలచుకుంటే ఈ చెక్క బొమ్మను కాల్చి బూడిద చేయగలరు. ఇలాంటి వాటి ముందు మోకరిల్లుతూ మీకు సిగ్గు అనిపించటం లేదా?" అన్నారు.

ఈ సంభాషణ బహుశా అనేక సందర్భాల్లో జరిగి వుండవచ్చు. నెమ్మది నెమ్మదిగా ఆయన మేథస్సుపైనున్న మబ్బులు వీడిపోయాయి. ఓ రోజు ఆయన నీ మాట నాకర్థమయ్యింది. నేనిప్పుడే ఇస్లాం స్వీకరిస్తున్నాను అన్నారు. ఆ తర్వాత ఆమె 'మీరిప్పుడు ఇస్లాం స్వీకరించారు కదా! అంచేత మన వివాహం కూడా జరుగుతుంది' అని అన్నారు. ఆపై వారి వివాహం జరిగింది. హజ్రత్ ఉమ్మె సులైం (రజి) (ఈ ఆనందంలో) ఆయన్నుండి మహర్ కూడా తీసుకోలేదు.[2]

---

1. *ఇబ్నె అబ్దుల్ బర్ర్, అల్ ఇస్తీఆబ్ : 4/494*
2. *మరింత వివరణ కోసం చూడండి. ఇబ్నె సాద్, అత్తబఖాతుల్‌కుబ్రా : 8/426, 427, ఇబ్నెహజర్, అల్ ఇసాబా : 8/408-410*

సందేశ ప్రచారం కేవలం నోటితోనే కాదు. మనిషి నడవడి, స్థిరమైన వైఖరి కూడా ప్రచారానికి దోహదపడతాయి. ఏదైనా విషయంపై మనిషి స్థిరత్వం, దాని కోసం అతను చేసే త్యాగం, దాని ఔన్నత్యం కోసం పడే ప్రయాస కొన్ని సందర్భాల్లో హితబోధ చేయటం, ప్రచారం చేయటం కన్నా ఎక్కువగా పనిచేస్తాయి. గొప్పవారు సైతం దానికి ప్రభావితులవు తారు. ముస్లిం స్త్రీల స్థిరత్వం, దృఢత్వం బద్ధ శత్రువులను సైతం తమ స్థానాల నుండి కదిలించింది. ఇలాంటి వారు ఇస్లాం గురించి ఆలోచించ టమే కాకుండా దాన్ని స్వీకరించారు కూడా.

హజ్రత్ ఉమర్(రజి) మొదట్లో ఇస్లాంకు బద్ధ శత్రువు. కొన్ని సంఘటనలు ఆయన మనోమస్తిష్కాలను చాలావరకు ప్రభావితం చేశా యని ఉల్లేఖనాల ద్వారా తెలుస్తోంది. అంచేత ఆయన ఇస్లాం స్వీకరిం చారు. వాటిలో రెండు సంఘటనలు ఇక్కడ ప్రస్తావిస్తున్నాం.

1. ఆమిర్ బిన్ రబీఅ, ఆయన ఇల్లాలు లైలా బిన్తె అబీ ఖైసమా (ఉమ్మె అబ్దుల్లాహ్) తొలి రోజుల్లోనే ఇస్లాం స్వీకరించారు. మక్కాలో పరిస్థితులు భరించలేనంతగా మారిపోయాయి. ముస్లింలు హబ్షాకు బయల్దేరుతున్నారు (హిజ్రత్ చేస్తున్నారు). వారిలో వీరిద్దరు కూడా ఉన్నారు. లైలా బిన్తె అబీ ఖైసమా చెప్పుకొచ్చారు: మేం బయల్దేరటానికి పూర్తిగా సంసిద్ధమయ్యాం. ఆమిర్ ఏదో అవసరం మూలాన బయటి కెళ్ళారు. అంతలో ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి) వచ్చారు. మమ్మల్ని సిద్ధంగా ఉండటం చూసి, ఉమ్మె అబ్దుల్లాహ్! వెళ్ళవల్సిందేనా? అన్నారు. "అవును, దైవసాక్షి! మేం ఇక్కడ్నుంచి మరెక్కడికైనా వెళ్ళిపోతాం. అల్లాహ్ బయట పడటానికి ఏదో ఒక మార్గం చూపించకపోతాడా? మీరు మమ్మల్ని తీవ్రంగా హింసిస్తున్నారు కదా" అన్నాను. దాంతో ఆయన వీడ్కోలు చెప్పి వెళ్ళిపోయారు. అప్పుడు నేను ఆయన ముఖంలో మునుపెన్నడూ చూడని

దుఃఖాన్ని చూశాను. నా అభిప్రాయం ప్రకారం మేం మక్కాను వదిలి పెట్టే విషయం ఆయన్ను బాధించింది కాబోలు. ఆమిర్ తిరిగి ఇంటికొచ్చి నప్పుడు నేను ఆయనతో 'ఒకవేళ మీరు ఉమర్ దుఃఖాన్ని, బాధను చూస్తే ఆశ్చర్యపడేవారు' అని అన్నాను. అందుకాయన బహుశా, నీవు అతను ఇస్లాం స్వీకరిస్తాడనీ ఆశిస్తున్నావేమో? అన్నారు. నేను అవునన్నాను. కాని ఉమర్ కఠినత్వం పట్ల ఆయన పూర్తిగా నిరాశ చెందారు కాబోలు. 'ఖత్తాబ్ గాడిద ఇస్లాం స్వీకరించనంతవరకు ఉమర్ కూడా స్వీకరించడు గదా' అన్నారు.

ఆ సమయంలో వారిద్దరి దీనస్థితి, నిస్సహాయత, ఎంత హింసించినా కూడా ధర్మంపై వారి స్థిరత్వం, దాని కోసం ఉన్న ఊరిని విడిచిపెట్టడానికి సిద్ధపడటం, ఆప్తులను అయినవారిని, చరాస్తులను వదిలి వెళ్ళటం ఇవన్నీనూ ఒక్కొక్కటిగా ఉమర్(రజి) దృష్టికి వచ్చి ఉంటాయి. అసలు ఇదంతా ఎందుకు జరుగుతుంది? ఏ అపరాధం వల్ల వారిని ఇంత తీవ్రంగా హింసించటం జరుగుతుంది? అని ఆలోచించి ఉండవచ్చు.

2. హజ్రత్ ఉమర్ (రజి) కంటే ముందు ఆయన తోబుట్టువు ఫాతిమా బిన్తె ఖత్తాబ్ (రజి), ఆమె భర్త సయీద్ బిన్ జైద్(ర) ఇస్లాం స్వీకరించారు. కాని ఉమర్ భయంవల్ల వారు దాన్ని గోప్యంగానే ఉంచారు. అటు ఉమర్, దైవప్రవక్త(స) తన తాతముత్తాతల ధర్మాన్ని విమర్శిస్తున్నారనీ వారిని అజ్ఞానులుగా నిరూపిస్తున్నారనీ ఆయన(స) వల్ల ఖురైష్‌లో గందరగోళం, గజిబిజి నెలకొందని విపరీతమైన కోపంతో ఉన్నారు.

ఒకరోజు (నఊజుబిల్లాహ్) దైవప్రవక్త(స)ను, ఆయన మిత్రులను అంతమొందించాలనే సంకల్పంతో ఉమర్ బయల్దేరారు. అప్పుడే ఈ మొత్తం గొడవ సద్దుమణుగుతుందని తలిచారు. దార్లో నయీం బిన్ అబ్దుల్లాహ్ కలిశారు. ఆయన ఉమర్ ఉద్దేశం గ్రహించి, 'ఉమర్ నీవు నీ

తలంపు మార్చుకో, ముహమ్మద్(స)పై చేయెత్తితే బనూ అబ్దెమునాఫ్ నిన్ను వదిలిపెట్టరు. ఆయన్ను(స) చంపి నీవు మాత్రం బ్రతగ్గలవా? ఒకవేళ నీకు గనుక ముహమ్మద్(స), ఆయన ధర్మం తప్పుగా అగుపిస్తే తొలుత నీ చెల్లి, బావ పనిపట్టు. వారిద్దరు కూడా ఇస్లాం స్వీకరించారు. వారిప్పుడు ముహమ్మద్(స) అడుగుజాడల్లో నడుస్తున్నారు అన్నారు. ఇది వినంగానే ఆయన కోపమంతా తన తోబుట్టువు బావ గారి వైపు మరలింది. నేరుగా వారింటికే వెళ్ళారు. వారిద్దరికి ఖుర్ఆన్ చదివించటానికి హజ్రత్ ఖబ్బాబ్(రజి) వారింటికి వచ్చివెళ్ళేవారు. ఆ సమయంలో ఆలుమగలిద్దరికి సూరె తాహా చదివిస్తున్నారు. అంచేత ఉమర్ ఇంటి బయట ఖుర్ఆన్ చదివే స్వరం విన్నారు. లోపలికెళ్ళి ఇది ఎలాంటి ధ్వని అనడిగారు. అరే! ప్రత్యేక విషయమేమీ లేదు అని బదులు వచ్చింది. ఆయన మరింత కోపంతో ఊగిపోయారు. 'నాకు తెలుసు, మీరు కూడా ముహమ్మద్(స)కు తోడయ్యారు' అని అంటూనే సయీద్ బిన్ జైద్‌ను బాదసాగారు. అడ్డొచ్చిన చెల్లిని సైతం గాయపరిచారు. గాయాలు వారిద్దర్ని ఏమాత్రం భయ భ్రాంతులకు లోను చేయలేదు. పైపెచ్చు వారి విశ్వాసం ద్విగుణీకృతమైంది.

"అవును! మేం దైవాన్ని ఆయన ప్రవక్త(స)ను విశ్వసించాం, నీ చేతనైంది చేస్కో" ముక్తకంఠంతో అన్నారిద్దరు. ఈ నిలకడ ఆయన్ను కదలించి వేసింది. రక్తపు మడుగులో ఉన్న చెల్లిని చూసి చలించిపోయారు. 'మీరు చదువుతున్న పుస్తకమేదో తీసుకురండి, ముహమ్మద్(స) ఏం చెబుతున్నారో నేనూ చూస్తాను' అన్నారాయన. మీరు అపవిత్రంగా ఉన్నారు. దైవంతోపాటు సహవర్తులను కల్పించారు. ఈ గ్రంథాన్ని పవిత్రులే ముట్టుకోవాలి అన్నారు ఫాతిమా(ర).

ఉమర్ స్నానం చేసి సూరతుత్తాహా చదవటం మొదలెట్టారు.

విషయం మనసులో నాటుకుంటూ పోయింది. ఇంకేముంది, ప్రవక్త(స) సన్నిధిలో చేరుకుని తను ముస్లింగా మారిపోయానని ప్రకటించుకున్నారు.

కొన్నిసార్లు కొందరు భర్తలకు విశ్వాస భాగ్యం లభించలేదు. లేదా ఆలస్యంగానే ఆ అదృష్టం వరించింది. అయినప్పటికీ భార్యలు భర్త తోడు లేకపోయినా విశ్వసించి, నిలకడగా ఉన్నారు.

హజ్రత్ అబుల్ ఆస్(రజి), హజ్రత్ ఖదీజా(రజి) అక్క కొడుకు. ఆమె ఆయన్ను బిడ్డలా పెంచి పెద్ద చేశారు. ప్రవక్త(స) దైవ దౌత్యానికి ముందే ఆయన(స) పెద్దకుమార్తె జైనబ్ (రజి)తో అబుల్ ఆస్(రజి) వివాహం జరిగిపోయింది. ఆయన(రజి) అజ్ఞాన కాలంలో కూడా మంచితనం, సభ్యతా సంస్కారం, నీతినియమాలలో పేరుగాంచారు. కాని ఇస్లాం సౌభాగ్యం ఆయనకు మక్కా విజయానికి కాస్త ముందు లభించింది. హజ్రత్ జైనబ్(రజి) బద్ర్ యుద్ధం తర్వాత మక్కా నుంచి మదీనా వచ్చేశారు. ముహమ్మద్ (స), ప్రవక్తగా ఎన్నుకోబడిన తర్వాత సుమారు పదిహేనేళ్ళు ఆమె తన భర్తతోపాటు మక్కాలోనే ఉండిపోయారు.

ప్రవక్త(స), జైనబ్ (రజి) ఇంకా ఖదీజా(రజి) ఆయనకు ఇస్లాం బోధించడానికి, దాని యదార్థం వివరించటానికి శాయశక్తులా కృషి చేసి ఉండవచ్చని పూర్తి నమ్మకంతో చెప్పవచ్చు. అయినా కూడా అబుల్ ఆస్(రజి) చాలా ఆలస్యంగానే ఇస్లాం స్వీకరించారు. ఇందులో వారి కృషి లేదని ఎవరైనా చెప్పగలరా?

ఉమ్మె హకీమ్ బిన్తె హారిస్ ఉహుద్ యుద్ధంలో సత్య తిరస్కారుల తరఫున పాల్గొన్నారు. మక్కా విజయానంతరం ఇస్లాం స్వీకరించారు. ఆమె భర్త ఇక్రిమా బిన్ అబూజహల్ యమన్ పారిపోయారు. ఆమె ప్రవక్త(స) సన్నిధిలో హాజరయి తన భర్తకు రక్షణ కల్పించాలని విన్నవించారు. తర్వాత ఆయన(స) సమ్మతితో యమన్ వెళ్ళి భర్తను వెతికి వెంట

తీసుకొచ్చారు ప్రవక్త(స) సన్నిధిలో చేరుకున్నాక ఆయన కూడా ఇస్లాం స్వీకరించారు.[1]

హ్రజత్ ఖాలిద్ బిన్ వలీద్(రజి) సోదరి ఫాఖ్తా బిన్తె వలీద్(రజి) మక్కా విజయం తర్వాత ఇస్లాం స్వీకరించి ప్రమాణం చేశారు. ఆమె భర్త సఫ్వాన్ బిన్ ఉమయ్యా ఆత్మహత్య చేసుకోవాలనే ఉద్దేశ్యంతో యమన్ పారిపోయారు. ఆయన సముద్రంలోనే ఆత్మహత్య చేసుకోవటానికి ప్రయత్నించారు. ఉమైర్ బిన్ వహబ్ ఆయన కోసం ప్రవక్త(స) దగ్గర శరణుకోరి వెనక్కి తీసుకొచ్చారు. అప్పటికే ఓ మాసం గడువు పూర్తయింది. దైవప్రవక్త (స) ఫాఖ్తా, సఫ్వాన్‌ల బంధం, ఉమ్మె హకీం, ఇక్రిమాల వివాహాన్ని అలాగే ఉంచారు.

ఉమ్మె హాని(రజి), దైవప్రవక్త(స) బాబాయి అబూ తాలిబ్ కుమార్తె. స్వయాన హ్రజత్ అలీ(రజి)కి తోబుట్టవు. మక్కా విజయం అనంతరం ఇస్లాం స్వీకరించారు. ఆమె భర్త హుబైరా మక్కా నుండి నజ్రాన్ పారి పోయారు. అక్కడే మృతి చెందారు. చివరి ఘడియ వరకు తాతముత్తాతల ధర్మాన్ని విడిచి పెట్టడానికి ఇష్టపడలేదు.[2]

వీటినిబట్టి ముస్లిం మహిళలు ఇస్లాం స్వీకరించటానికి భర్తలను సైతం లెక్క చేయలేదని తెలుస్తోంది. తర్వాత మరెంతో సహనం ఓర్పుతో వారికి నచ్చజెప్పారు. సత్యధర్మ సందేశం వినిపించారు. పెద్దపెద్ద విరోధు లను సైతం ఇస్లాం కోసం సంసిద్ధం చేశారు. అంతేకాకుండా ఈ క్రమంలో ఎన్నో కష్టాలను కూడా ఎదుర్కొన్నారు. ఇలా ధర్మ ప్రచార హక్కును

1. ఇబ్నె హిషాం, అస్సీరతున్నబవియ్యాహ్ : 4/59, 67. ఇబ్నె అబ్దుల్ బర్ర్, అల్ ఇస్తీఆబ్ : 4/486, ఇబ్నె అసీర్, అసదుల్ గాబ్బహ్ : 7/309
2. ఇబ్నెహిషాం, అస్సీరతున్నబవియ్యహ్ : *4/69.* ఇబ్నె అబ్దుల్ బర్ర్, అల్ ఇస్తీఆబ్ : *4/517, 518,* ఇబ్నె హజర్, అల్ ఇసాబా ఫీ తమీజిస్సహాబ : *8/485, 486*

నెరవేర్చారు. ఇహపర లోకాల సాఫల్యానికి వారు చాలా దూరం వెళ్ళి పోయినా వారికి సైతం దాన్ని పొందే భాగ్యం కల్గించారు.

## సామాజిక సంబంధాలు

తొలికాలపు మహిళలు సమాజంతో సంబంధం లేకుండా దూరంగా ఉండేవారు కాదు. పైగా వారు సుఖ దుఃఖాల్లో, కష్టసుఖాల్లో పాలుపంచుకునేవారు. పొరుగువారితో స్త్రీల సంబంధాలు బాగుండాలనీ ప్రవక్త(స) నొక్కి మరీ చెప్పారు.

హజ్రత్ అబూహురైరా(రజి) ఉల్లేఖనం ప్రకారం ఒక వ్యక్తి ప్రవక్త(స)తో 'ఫలానా స్త్రీ ఎక్కువగా నమాజులు చేస్తుంది. ఉపవాసాలు పాటిస్తుంది. దానధర్మాలు కూడా ఎక్కువగా చేస్తుంది. కాని తన నోటితో ఇరుగుపొరుగు వారిని కష్టపెడుతుందని ఆమె గురించి చెప్పుకుంటారు' అన్నారు. అందుకాయన (స) "ఆమె నరకంలో ప్రవేశిస్తుంద"ని అన్నారు. అతడు మళ్ళీ అన్నాడు 'ఆమెకు విరుద్ధంగా ఫలానా మహిళ నఫిల్ నమాజులు, నఫిల్ ఉపవాసాలు తక్కువగానే పాటిస్తుంది. కాని జున్ను మొదలైన వాటిని దానం చేస్తుంది. దానికి తోడు ఆమె మర్యాదస్తురాలు. తన పొరుగువారిని ఏమాత్రం కష్టపెట్టదని ఆమె గురించి జనులు అంటూ ఉంటారు' అని అన్నాడు.[1]

దానికాయన (స) "ఆమె స్వర్గంలో ప్రవేశిస్తుంద"ని తెలిపారు.

ఆనాటి స్త్రీలు ఒకరికొకరు సాయపడేవారు. కష్టసుఖాల్లో

---

1. *ఖాలల్ ముంజరీ : రవాహు అహ్మద్ వల్‌బజ్జార్. వ ఇబ్నె హిబ్బాన్ ఫీ సహీహ వల్ హాకిం వఖాల సహీహుల్ అస్నాది. వ రవాహు అబూబక్ర్ బిన్ అబీ షైబా బిఅస్నాదిన్ సహీహిన్ అయ్‌జన్– అత్తర్‌గీబ్ వత్తర్‌హీబ్ : 3/242*

పాలుపంచుకునేవారు. ప్రేమ, సానుభూతిని వ్యక్తపరిచేవారు. తమకు చేతనయినంత సాయం చేసేవారు.

పెళ్ళయిన తర్వాత హజ్రత్ అస్మా(ర.అ), హజ్రత్ జుబైర్ ఇంటికి వచ్చారు. పనంతా ఆమె చేయాల్సి వచ్చేది. ఈ విషయం గురించి ఆమె ఇలా చెప్పుకొచ్చారు. "నేను రొట్టెలు బాగా చేయలేకపోయేదాన్ని. నా పొరుగువారు అన్సార్‌కు చెందినవారు. వాళ్ళే నాకు రొట్టెలు చేసి ఇచ్చే వారు. వాళ్ళు నిష్కల్మషులు. సత్యసంధత గల స్త్రీలు."[1]

స్వయాన హజ్రత్ అస్మా(రజి) గురించి తెలుస్తుంది. ఆమె దగ్గరికి జ్వరంతో ఉన్న స్త్రీని తీసుకొచ్చినప్పుడు ఆమె ప్రార్థించేవారు. చొక్కా లోపల (కాసిన్ని చన్నీళ్ళు) నీళ్ళు చల్లేవారు. 'జ్వరం (దాని వేడిని) నీళ్ళతో చల్లార్చుకోమని ప్రవక్త(స)మాతో అన్నారు.' అని అస్మా(రజి) తెలిపారు.[2]

హజ్రత్ అబ్దుల్లా బిన్ అమ్ర్ బిన్ ఆస్(రజి) తెలిపారు : ఒక మృతదేహాన్ని ఖననం చేసి మేం ప్రవక్త(స)తోపాటు వెనుదిరిగాం. ఆయన(స) ఇంటి తలుపు దగ్గరికి చేరుకున్నప్పుడు ఒక మహిళ రావటం చూశారు. ఆమె నడకను చూసి ఆయన(స) ఆమెను గుర్తుపట్టారను కుంటాను. ఆమె మరెవరో కాదు ఫాతిమా(రజి). ఆమె దగ్గరకు రాగానే, ఇంటినుంచి ఎందుకెళ్ళావని అడిగారు.

'మృతుని బంధువులను పరామర్శించి, అతని గురించి నాలుగు మంచి మాటలు చెపుదామని వెళ్ళాను' అని అన్నారామె. 'బహుశా, శ్మశానానిక్కూడా వెళ్ళావేమో' అన్నారాయన(స). 'దైవశరణం! అక్కడికెలా వెళ్తాను? దాన్ని మీరు వారించారు కదా' అని బదులు పలికారు ఆమె.

---

1. ముస్లిం, కితాబుస్సలాం, బాబు జవాజి ఇర్దాఫిల్ మర్అతిల్ అజ్‌నబియ్యహ్...
2. బుఖారీ, కితాబుత్తిబ్, బాబుల్ హుమా మిన్‌ఫైహిజహన్నమ.

'ఒకవేళ నీవు అక్కడికెళ్తే పెద్ద తప్పిదమయ్యేది' అని ఆయన(స) స్పష్టం చేశారు.[1]

నైతిక విలువలు దిగజారకుండా ఉంటే ఇలాంటి సంబంధాలు స్త్రీ, పురుషుల మధ్య కూడా ఉండవచ్చు. దైవప్రవక్త(స), ఆయన సహచరుల జీవితంలో ఇలాంటి మచ్చుతునకలున్నాయి.

అస్మా బిన్తె యజీద్(ర.అ) అంటున్నారు: మేం కొంతమంది మహిళలం మస్జిద్‌లో కూర్చొని ఉన్నాం. దైవప్రవక్త(స) మా వద్దకు వచ్చి సలాం చేశారు.[2] మరో ఉల్లేఖనంలో, ఆ తర్వాత ఆయన(స) భర్తల మేళ్ళకు, కృతఘ్నుత చూపించటం గురించి వారించారని అన్నారు.[3]

ఇలాగే దైవప్రవక్త(స) కొందరు స్త్రీల వైపు నుంచి వెళుతూ వారికి సలాం చేశారని హజ్రత్ జరీర్ బిన్ అబ్దుల్లాహ్ తెలిపారు.[4]

'శుక్రవారం వచ్చిందంటే మేం ఆనందించేవాళ్ళం. ఒక వృద్ధురాలు ఉండేది. జుమా నమాజ్ తర్వాత మేం ఆమె దగ్గరికెళ్ళి సలాం చేసేవారం. ఆమె చుఖందర్ (దుంపకూర), పిండిని కలిపి పలుచని పదార్థమేదో తయారుచేసి మాకు తినిపించేది' అని హజ్రత్ సహ్లా బిన్ సాద్(రజి) తెలిపారు.[5]

---

1. *అబూదావూద్, కితాబుల్ జనాయిజ్, బాబు ఫీత్తఅజియ్యాహ్, బహుశా ఇది తొలి ఉపదేశం అయి ఉండవచ్చు. కొన్ని ఉల్లేఖనాలలో స్త్రీలక్కూడా సమాధులను సందర్శించే అనుమతి ఉందని రుజువైంది.*
2. *అబూదావూద్, కితాబుల్ అదబ్, బాబు ఫిస్సలామి అలన్నిసాయి. తిర్మిజీ, కితాబుల్ ఇస్తీజాన్. బాబు మా జాఅ ఫీత్తస్లీమి అలన్నిసాయి.*
3. *బుఖారీ, అల్ అదబుల్ మఫ్రద్ : 2/ 4:90*
4. *మస్నదె అహ్మద్ : 4/363.*
5. *బుఖారీ, కితాబుల్ ఇస్తీజాన్– ఇమాం బుఖారీ ఈ హదీసును దిగువనున్న అధ్యాయంలో ఉల్లేఖించారు. తస్లీముర్రిజాల్ అలన్నిసాయి వన్నిసాయి అలర్రిజాల్ (పురుషులు స్త్రీలకు, స్త్రీలు పురుషులకు సలాం చేయటం) ఈ హదీసులో సమ్మతించబడిందని రుజువవుతుంది.*

దీనినిబట్టి స్త్రీలకు సలాం చేయొచ్చని, అలాగే వారు కూడా మగవాళ్ళకు అతిథి సత్కారం చేయొచ్చని రుజువవుతుంది.

ఉమ్మె వర్ఖా (రజి)తో దైవప్రవక్త(స), దైవం ఆమెకు వీర మరణం అనుగ్రహిస్తాడని అన్నారు. (ఈ భవిష్యవాణి పట్ల అందరికి నమ్మకం ఉండేది) హజ్రత్ ఉమర్(రజి) తన మిత్రులతో "పదండి, వీర వనితను కలుసొద్దాం" అనేవారు. ఆయన ఆమెను పరామర్శించటానికి వెళుతూ ఉండేవారు.

రోగిని పరామర్శించటం, యోగక్షేమాలు తెలుసుకోవటం ఒక నైతిక బాధ్యత. ఇస్లాం దీని గురించి ఆదేశిస్తుంది. దీంతో సాంఘిక సంబంధాలు బాగుపడతాయి. మనసుల్లో ప్రేమ జనిస్తుంది. ప్రవక్త(స) పురుషులను పరామర్శించటంతోపాటు స్త్రీలను కూడా పరామర్శించేవారు.

దైవప్రవక్త(స) ఓ స్త్రీని పరామర్శించటానికి వెళ్ళారు. ఆమె పేరు ఉమ్ముస్సాయిబ్. లేదా ఉమ్ముల్ మసాయిబ్. (ఆమె వ్యాధిగ్రస్తురాలు). ప్రవక్త(స) ఆమెను విషయం ఏమిటని అడిగారు. ఎందుకు వణుకుతున్నావని ప్రశ్నించారు.

అందుకామె, 'ప్రవక్తా(స)! జ్వరం వచ్చింది. దైవం దాన్ని నాశనం చేయుగాక' అంది. 'జ్వరాన్ని తిట్టమాకు, దానివల్ల ఆదం సంతానం పాపాలు బట్టీలో ఇనుముకు అంటుకున్న చిలుము దూరమైనట్టే దూరమవుతాయి' అని ఆయన (స) బదులు చెప్పారు[1]. (హజ్రత్ జాబిర్ (రజి)

హకీం బిన్ హిజామ్ గారి మేనత్త ఉమ్ముల్ ఉలా (రజి) చెప్పు

1. *ముస్లిం, కితాబుల్ బిర్రి వస్సిలహ్, బాబు సవాబిల్ ము'మిని మా యుసీబుహు మిమ్మరజిన్.*

కొచ్చారు: నేను జబ్బు బారిన పడ్డాను. ప్రవక్త(స) నన్ను పరామర్శించ టానికి వచ్చారు. 'ఓ ఉమ్ముల్ ఉలా! నీకు శుభవార్త. నిప్పు ఇనుముకు పట్టిన తుప్పును దూరం చేసినట్లే, వ్యాధి కారణంగా దైవం ఒక ముస్లిం పాపాలను దూరం చేస్తాడు' అని ఆయన(స) అన్నారు.[1]

దైవప్రవక్త(స) ఒక అన్సారీ స్త్రీని పరామర్శించారు. ఆయన(స) ఆమె పరిస్థితి అడిగి తెలుసుకున్నారు. అందుకామె 'బాగానే ఉన్నాను, కాని ఉమ్మె యల్దం (ఓ రోగం) నన్ను చాలా బాధిస్తుంది' అని జవాబిచ్చారు. దానికాయన(స) 'సహనం వహించమని' ఆదేశించారు. ఇంకా 'బట్టీలో ఇనుము వేస్తే తుప్పును దూరం చేసుకొని అది శుభ్రమైనట్లే, మనిషి జబ్బు వల్ల పాపాల నుండి పరిశుద్ధుడవుతాడు' అని అన్నారని ఫాతిమా ఖుజాయియ తెలిపారు.[2]

మహిళలు, మగవారికి సలాం చేసే వారని హజ్రత్ హసన్ బస్రీ అంటున్నారు.[3]

మస్జిదె నబవీ సమీపంలో ఉండే ఒక అన్సార్ వ్యక్తిని హజ్రత్ ఉమ్మె దర్దా(ర) పరామర్శించారని హారిస్ బిన్ ఉబైదుల్లాహ్ అన్సారీ(రజి) తెలిపారు.[4]

ఇబ్రాహీం బిన్ అబీ అబ్లా తెలిపారు : ఒకసారి నా ఇల్లాలు జబ్బు పడింది. ఆ రోజుల్లో నేను ఉమ్మె దర్దా(రజి) ఇంటికి వచ్చి వెళ్ళేవాణ్ణి. ఆమె నాతో నా ఇల్లాలి పరిస్థితి గురించి అడిగేది. నేను వ్యాధి గురించి

1. *అబూదావూద్, కితాబుల్ జనాయిజ్. బాబు ఇయాదతున్నిసాయి*
2. *ఖాలల్ ముజ్రీ : రహహుత్త్రిబ్రానీ వ రవాహు రవాతుస్సహీహి అత్తర్గీబ్ వత్తర్హీబ్ : 4/152*
3. *బుఖారీ, అల్ అదబుల్ మఫ్రద్ : 2/490*
4. *రవాహుల్ బుఖారీ తాలిఖన్–కితాబుల్ మర్జా, బాబు ఇయాదతిన్నిసాయి, (రిజాల వరవాహు మర్ఫూఅన్ ఫిల్ అదబిల్ మఫ్రది : 1/627.*

చెప్పేవాడ్ని. ఆమె నా కోసం భోజనం తెప్పించేది. నేనేమో ఆరగించేవాడ్ని. రోజు మాదిరి ఆమె నా భార్య గురించి అడిగింది. 'పర్వాలేదు, ఇప్పుడు బాగానే ఉంది' అని చెప్పాను. నీ భార్యకు బాగోలేదని మేం నీకు భోజనం పెట్టాం. ఇప్పుడామె బాగానే ఉంది. కాబట్టి భోజన ఏర్పాట్లు చేయలేం' అని అన్నారు.[1]

హ(జ్రత్ ఉమ్మె దర్దా (రజి) గారి ఈ ఆచరణనుబట్టి స్త్రీలు, మగవారిని పరామర్శించవచ్చుని, వారు ఏదైనా సొంత వ్యవహారాల్లో చిక్కుకొని కలత చెందుతూ ఉంటే తమ ఇంటి నుండి వారికి భోజన ఏర్పాట్లు చేయొచ్చని రుజువవుతుంది.

## సామాజిక సేవ

ఇస్లాం స్త్రీలను సమాజ సేవ చేయటాన్ని, దాని అభివృద్ధి, అభ్యు దయంలో పాలుపంచుకోవటాన్ని ఏమాత్రం నిరాకరించదు. స్త్రీలు ఇలాంటి పనుల్లో పాల్గొనవచ్చు. వాస్తవానికి వారు చాలా చురుగ్గానే పాల్గొనేవారు. ఇక్కడ ఒకటి రెండు ఉదాహరణలివ్వటం జరిగింది-

ప్రవక్త(స) కాలం నాటి సంఘటన. మస్జిదె నబవీలో మిన్బర్ (వేదిక) ఉండేది కాదు. ఒక మహిళ దైవప్రవక్త(స)తో 'నా దగ్గర ఓ వడ్రంగి బానిస ఉన్నాడు. మీరు అనుమతిస్తే, మీరు కూర్చొని ప్రసంగించడానికి ఏదైనా వేదిక చేయిస్తాను' అని విన్నవించుకుంది. అందుకాయన(స) 'సరే! చేయించు' అని అనుమతించారు.

ఒకసారి మక్కాలో తీవ్రమైన నీటి కొరత ఏర్పడింది. ఒక తోలు సంచి (తిత్తి) నీరు ఒక దీనార్‌కు అమ్ముడయ్యేది. మక్కావాసుల సౌలభ్యం కోసం వారికి నీరు అందించటానికి జుబైదా బిన్తె జాఫర్ పది మైళ్ళ పొడవైన నది నిర్మించమని ఆదేశించారు. దానికోసం కొండలను పగుల

---

1. *బుఖారీ, అల్ అదబుల్ ముఫ్రద్ : 1/606.*

గొట్ట వలసి వచ్చింది. రాతి నేలను తొలగించాల్సి వచ్చింది. నిర్వహణాధికారి ఈ పని వల్ల డబ్బు చాలా ఖర్చు అవుతుందని అన్నారు. 'ఈ పనిని తప్పనిసరిగా చేయాల్సిందేనని, దీనికోసం ప్రతి సుత్తి దెబ్బకు ఒక దీనార్ ఖర్చు అయినాసరే' అని ఆమె నిక్కచ్చిగా బదులు పలికారు. ఇలా ఇంతటి మహత్తరమైన పని పూర్తయింది.[1]

## రాజకీయ రంగంలో

నాటి ముస్లిం స్త్రీలు పాలనాపరమైన ఉన్నత పదవులను చేపట్టినట్టు మనకైతే కనిపించలేదు. అలాగని వారు రాజకీయాలకు అతీతంగా ఉన్నారని కాదు. వారు అప్పటి రాజకీయ పరిస్థితులను పర్యవేక్షించేవారు. ఇస్లామీయ సామ్రాజ్య పరిరక్షణ కోసం ప్రయత్నించేవారు. త్యాగాలు చేశారు. ఖలీఫాలకు, రాజులకు హితబోధ చేశారు. అందుకోసం సమాలోచనలు జరిపారు. పరిస్థితులకు అనుగుణంగా రాజకీయ సేవ కూడా చేశారు.

దైవప్రవక్త(స), ఆయన సహచరులతోపాటు స్త్రీలు కూడా యుద్ధాల్లో పాలుపంచుకొనేవారు. విభిన్న కోణాల నుండి మగవారికి సాయపడేవారు. ఇది కాదనలేని వాస్తవం. ఇక్కడ దీనికి సంబంధించిన ఒకటిరెండు ఉదాహరణలివ్వటం జరిగింది.

లైలా గఫ్ఫారియా (రజి), ప్రవక్త(స)తోపాటు యుద్ధాల్లో పాలు పంచుకొనేవారనీ, గాయపడినవారికి చికిత్స చేసేవారనీ రోగులను కనిపెట్టుకుని ఉండేవారనీ, ఆమె గురించి అల్లామ ఇబ్నె అబ్దుల్ బర్ర్ రాశారు.[2]

'ఉమ్మె సులీత్ ఇస్లాం స్వీకరించారు. ప్రమాణం కూడా చేశారు.

---

1. *ఇబ్నె ఖల్కాన్, వఫియాతుల్ ఆయాన్: 2/ 70*
2. *అల్ ఇస్తీఆబ్, 4/463, 464.*

ఇంకా ఖైబర్, హునైన్ యుద్ధాల్లో పాల్గొన్నార'ని ఆమె ప్రస్తావనలో ఇబ్నె సాద్ రాశారు.[1]

'ఆమె మా కోసం ఉహుద్ యుద్ధంలో తోలు సంచి నిండా నీళ్ళు నింపి తీసుకొచ్చేవార'ని హజ్రత్ ఉమర్(రజి) తెలిపారు.[2]

ధర్మోన్నతిపై, ముస్లింల విజయంపై ప్రతి పెద్దా చిన్న మహిళ ఆనందంతో పరవశించిపోయేది. ఒకసారి దైవప్రవక్త(స) యుద్ధం నుండి తిరిగొచ్చారు. అప్పుడు ఒక నీగ్రో జాతి బానిసరాలు వచ్చి 'మీరు క్షేమంగా తిరిగొస్తే నేను మీ ఎదుట డప్పు వాయించి పాట పాడి నా ఆనందం వ్యక్తం చేయాలని మొక్కుకున్నాను' అని అంది. అందుకాయన(స) 'నిజంగానే నీవు మొక్కుబడి చేసుకుంటే మొక్కు తీర్చుకో. లేదా వదిలేసెయి' అన్నారు. నేను మొక్కుబడి చేసుకున్నాను అందామె. అంచేత ఆయన(స) కూర్చుండిపోయారు. ఆమె పాట పాడి, డప్పు వాయించి తన సంతోషాన్ని వ్యక్తపరిచింది.[3]

ముస్లిం మహిళలు నాటి ఖలీఫాలకు హితబోధ కూడా చేశారు. ఒకసారి హజ్రత్ ముఆవియా (రజి), తనకు క్లుప్తంగా హితబోధ చేయమని హజ్రత్ ఆయెషా(రజి)కు రాశారు. అందుకామె ప్రవక్త(స) గారి ఈ ఉపదేశాన్ని రాసి పంపారు. ఒక నాయకునిక్కావాల్సిన అత్యుత్తమ మార్గదర్శనం అందులో ఉంది.

'ఏ వ్యక్తి అయితే ప్రజలను అయిష్టపరచి దైవప్రసన్నత పొందాలను

---

1. *ఇబ్నెసాద్, అత్తబఖాతుల్ కుబ్రా : 8/419*
2. *ఇబ్నె అబ్దుల్ బర్ర్, అల్ ఇస్తీఆబ్ : 4/493*
3. *తిర్మిజీ, కితాబుల్ మనాఖిబ్, బాబు మనాఖిబి ఉమర అబీ హాఫ్సా, అబూదావూద్, కితాబున్నుజూర్, బాబు మా యు'మరు బిహి మిన్ వఫాయిన్నుజుర్.*

కుంటాడో, (ప్రజలు అతణ్ణి ఏమాత్రం నష్టం కలిగించలేరు, ఎందుకంటే) దైవం అతన్ని మనుషుల కీడు నుండి కాపాడుకుంటాడు. అలాకాకుండా మరెవరైతే దైవాన్ని అయిష్టపరచి ప్రజల మన్నన పొందాలనుకుంటాడో అల్లాహ్ అతణ్ణి వారికే అప్పగిస్తాడు. (వారు కోరుకున్న విధంగా అతనిపై పెత్తనం చెలాయిస్తారు) [1]

హజ్ సందర్భంగా ముఆవియా (రజి),హ్రజత్ ఆయెషా(ర) సన్నిధిలో హాజరయ్యారు. అప్పుడు వారిద్దరితోపాటు ఆయెషా(ర) సేవకుడు జక్వాన్ కూడా అక్కడే ఉన్నాడు. హ్రజత్ ముఆవియా (రజి), హ్రజత్ అలీ(రజి)కి మధ్య జరిగిన పోరాటంలో ఆమె (ర) సోదరుడు ముహమ్మద్ బిన్ అబూబకర్, అలీ (రజి) తరఫున పాల్గొన్నారు. ఈజిప్టులో వీర మరణం పొందారు. “మీరు నా సోదరుని మరణానికి కారకులయ్యారు కదా! నేను కూడా మిమ్మల్ని చంపటానికి మీవెంట ఒక మనిషిని పంపనా? మీరు ఏమనుకుంటున్నారు? అని ఆమె (రజి) ఆయన్ను నిలదీశారు.

'మీరు నిజం చెప్పారు' అని ఆయన బదులు పలికారు. మరో ఉల్లేఖనంలో 'మీరు అలా చేయలేరని నా నమ్మకం' అని అన్నారని ఉంది. తర్వాత ఆమె (రజి) ఆయనకు హితబోధ చేశారనీ ధర్మశాస్త్రాన్ని అనుసరించమని ప్రేరణ కలిగించారనీ ఖాసిం బిన్ ముహమ్మద్ తెలిపారు. [2]

బరీరా ఒక బానిసరాలు. ఆమెను ఆయెషా(రజి) కొని స్వేచ్ఛను ప్రసాదించారు. ఉమవీ ఖలీఫా అబ్దుల్ మలిక్ బిన్ మర్వాన్ కథనం : 'నేను ఖిలాఫత్ కంటే ముందు బరీరా సమావేశంలో కూర్చునేవాణ్ణి. ఆమె నాతో తరచూ అనేవారు, 'నీలో నాకు కొన్ని నాయకత్వపు లక్షణాలు కనిపిస్తు

1. *తిర్మిజీ, అబ్వాబుజ్జుహద్, బాబు 64*
2. *జహబీ, సియరు ఆలామిన్నుబలాయి : 2/131*

న్నాయి. ఖిలాఫత్ అధికారం నీకు లభిస్తుందని నాకు అనిపిస్తుంది. ఒకవేళ నీకు ఖిలాఫత్ లభిస్తే రక్తపాతం సృష్టించమాకు. నేను దైవప్రవక్త(స) చెప్పగా విన్నాను, 'స్వర్గాన్ని చూసిన తర్వాత కూడా మనిషి దాని ద్వారం నుండి తొలగించబడతాడు. ఎందుకంటే ఆ కొద్దిపాటి రక్తం కారణంగా, దాన్ని అతను అన్యాయంగా ఒకానొక ముస్లింను చంపి కార్చి ఉంటాడు.'[1]

షిఫా బిన్తె అబ్దుల్లాహ్ (రజి) ప్రస్తావనలో అల్లామా ఇబ్నె అబ్దుల్ బర్ర్ రాశారు.

షిఫా హిజ్రత్ కంటే ముందే ఇస్లాం స్వీకరించారు. ఆమె తొలి ముహాజిర్‌లలో ఉన్నారు. ప్రవక్త(స) చేతుల మీద ప్రమాణం కూడా చేశారు. ఆమె బుద్ధి వివేకాల దృష్ట్యా ఎన్నదగిన స్త్రీలలో ఒకరుగా ఉన్నారు. ఉమర్(ర) ఆమె అభిప్రాయం, ఆలోచనలను పరిగణనలోకి తీసుకునేవారు. ఆమెను సంతోషపెట్టేవారు. ఆమెకు ఇతరులపై ప్రాధాన్యత ఇచ్చేవారు. పలుమార్లు ఆమెకు ఏదైనా మార్కెట్ బాధ్యతలు కూడా అప్పగించేవారు.[2]

దీనినిబట్టి ఆమె బుద్ధివివేకాలను, జ్ఞాన వికాసాలను అందరూ అంగీకరించేవారని తెలుస్తుంది. హజ్రత్ ఉమర్ (రజి) అంతటి వారే ఆమె అభిప్రాయాలకు ప్రాధాన్యత ఇచ్చేవారు. కొన్ని సామాజిక బాధ్యతలు కూడా ఆమెకు అప్పగించేవారు.

ఫాతిమా బిన్తె ఖైస్(ర) ప్రముఖ సహాబియా. తొలి ముహాజిర్‌లలో ఆమె కూడా ఒకరు. ఆమె స్థితిగతులను రాస్తూ అల్లామా ఇబ్నె అబ్దుల్ బర్ర్ రాశారు.[3]

---

1. *ఇబ్నె అబ్దుల్ బర్ర్, అల్ ఇస్తిఆబ్ : 4/ 385*
2. *ఇబ్నె అబ్దుల్ బర్ర్, అల్ ఇస్తీఆబ్ : 4/423, 424–ఇబ్నె హజర్, అల్ ఇసాబా ఫీ తమీజిస్సహాబా : 8/201, 202*
3. *ఇబ్నె అబ్దుల్ బర్ర్, అల్ ఇస్తీఆబ్ : 4/454*

ఆమె సౌందర్యవతి, బుద్ధిమంతురాలు, నేర్పరి. హజ్రత్ ఉమర్ (రజి) గారి తదనంతరం సలహాదారులందరూ ఆమె ఇంట్లోనే గుమిగూడారు. అప్పుడు వారు ప్రసంగించిన ప్రసంగాలు ఆమె ద్వారానే ఉల్లేఖించబడినాయి. ఆమె మర్యాదస్తురాలని జుబైర్ (ఇబ్నె బుకార్) రాశారు.

ఆమె తెలివితేటలు, యోగ్యతపై అందరికి నమ్మకం ఉండేదని తెలుస్తుంది. హజ్రత్ ఉమర్(రజి) వీర మరణం తర్వాత సలహా మండలి ఖలీఫాను ఎన్నుకొనే విషయంలో జరిపిన చర్చలు ఆమె ఇంట్లోనే జరిగాయి. ప్రత్యక్షంగానూ, పూర్తిగానూ ఆ సంప్రతింపుల గురించి ఆమెకు తెలిసి కూడా ఉండవచ్చు.

వాస్తవానికి ముస్లిం మహిళలు ధర్మం, నైతికత, జ్ఞానం, రాజకీయం, నాగరికత, సంఘ సమాజం, ప్రతి రంగంలోను ముందంజలో ఉన్నారు. విభిన్న కోణాల నుండి వారు ఇస్లాంకు చేసిన గొప్ప సేవ చరిత్రను అభ్యసించే ఏ విద్యార్థి కూడా ఉపేక్షించలేడు. అలాగే తక్కువ చేసి చూపించనూ లేడు.



# ఆధునిక యుగంలో ముస్లిం స్త్రీల ఉద్యోగ సమస్య

(నేటి ఆధునిక కాలంలో ముస్లిం మహిళలు ఉద్యోగం చేయటం గురించి ఇస్లామిక్ ఫిఖా అకాడమీ (న్యూఢిల్లీ) వారు ఒక ప్రశ్నాపత్రానికి జవాబుగా దిగువనున్న వ్యాసాన్ని పొందుపరిచారు. ప్రశ్నలు ఫిఖా అకాడమీ వారు సృష్టించినవే)

## కుటుంబంలో ఆలుమగల బాధ్యత

కుటుంబ నిర్వహణలో సాధారణంగా మగాడి స్థానం అధిపతిగా ఉంటుంది. కుటుంబాన్ని జాగ్రత్తగా కనిపెట్టుకొని ఉంటాడు. భార్యా పిల్లలతోపాటు, కొన్నిసార్లు ఇతర ఆత్మీయుల తిండి, బట్ట ఇంకా వారి ఇతర అవసరాలను సమకూరుస్తాడు. అలాగే విద్యాబుద్ధులు నేర్పించ టానికి, వారి పెళ్ళి పేరంటాలకు కావాల్సిన ఖర్చును భరిస్తాడు.

మరోవైపు ఆడది ఇంటి పనులు చక్కబెడుతుంది. ఇంటి నిర్వహణ, పిల్లల పెంపకం, భర్త సొమ్మును భద్రపరచటం లాంటి పనులు చేస్తుంది. అరబ్‌లో కూడా ఇలాంటి కుటుంబ వ్యవస్థే ఉండేది. కాకపోతే ఈ వ్యవస్థలో కొన్ని ఎత్తుపల్లాలు ఉండేవి. కొన్నిసార్లు స్పష్టమైన, న్యాయమైన అవసరాలు కూడా పూర్తి అయ్యేవి కావు. స్త్రీ తన సహజ బలహీనతల

వల్ల అన్నీ భరించేది. ఇస్లాం కుటుంబ వ్యవస్థను మిగిల్చి ఉంచింది. కుటుంబాన్ని పటిష్టమైన పునాదులపై నిలిపింది. దౌర్జన్యం, అన్యాయాల నుండి పరిశుద్ధపరిచింది. ఆలుమగల బాధ్యతలు, హక్కులు నిర్ణయించింది. మగాడి నిరంకుశ పెత్తనాన్ని తుదముట్టించింది. స్త్రీ బలహీనత దృష్ట్యా ఆమెకు చట్టబద్ధమైన రక్షణ కల్పించింది. కుటుంబ స్థిరత్వం, పటిష్టత కోసం మగవాడితో, అతను స్త్రీ అన్నవస్త్రాలకు బాధ్యుడని చెప్పింది. అంటే చట్టబద్ధంగా మగవాడు, ఆడదానికి అన్నవస్త్రాలు సమకూర్చాలనీ, అది ఆమె హక్కు అని నిర్ణయించింది. స్త్రీ ఇంటి లోపలి బాధ్యతలను సక్రమంగా నిర్వర్తించేందుకు, ఆమెకు తీరిక కల్పించటానికి ఈ నియమం ఒక యుక్తిగా కనబడుతుంది.

## చదువుకున్న స్త్రీలు ఉద్యోగం వైపు మొగ్గుచూపటం

నేడు ఎన్నో సామాజిక మార్పులు వచ్చాయి. దైనందిన నిత్యావసరాలు కూడా పెరిగిపోతున్నాయి. అలాంటప్పుడు మగాడితోపాటు ఆడది కూడా బతుకు దెరువు కోసం శ్రమించటం తప్పనిసరి అని అనుకుంటున్న రోజులు.

నేటి ఆధునిక స్త్రీ ఆర్థికంగా తను కూడా సంపాదనాపరురాలు కావాలనీ భర్త లేదా మరొకరిపై ఆధారపడకూడదని అనుకుంటోంది. ఆమెకు ఈ అవకాశాలు కూడా దొరుకుతున్నాయి.

నేడు చాలామంది ముస్లిం స్త్రీలు, ప్రత్యేకించి చదువుకున్న స్త్రీలు కూడా ఇదే విధంగా ఆలోచిస్తున్నారు. ఉపాధి రంగంలో తమ వంతు కృషి చేస్తున్నారు. ఈ క్రమంలో నేడు ఎదురవుతున్న ఇలాంటి కొన్ని ప్రశ్నలు, వాటికి జవాబులు ఇచ్చే ప్రయత్నం జరిగింది.

**తొలి ప్రశ్న**

స్త్రీలు ఉద్యోగం చేయటాన్ని ఇస్లామీయ షరీఅత్ (ధర్మశాస్త్రం) ఏవిధంగా చూస్తుంది?

**జవాబు :** ఇస్లాం సంపాదనా బాధ్యత నుండి స్త్రీకి చాలా వరకు మినహాయింపునిచ్చింది. సాధారణ పరిస్థితుల్లో ఆమె ఏమాత్రం నిస్సహాయురాలు కాదు. అయితే ఆమె ఉపాధి కోసం శ్రమించటం తప్పనీ చెప్పలేం. జీవనోపాధి ఖుర్ఆన్‌లో దైవానుగ్రహంగా చెప్పబడింది. దాన్ని అన్వేషించమని ఉపదేశించబడింది.

**"నమాజు ముగిసిన తరువాత భూమిపై వ్యాపించండి. అల్లాహ్ అనుగ్రహాన్ని అన్వేషించండి."** ***(అల్ జుముఅహ్ : 10)***

స్త్రీకి కూడా అల్లాహ్ అనుగ్రహాన్ని అన్వేషించే హక్కు ఉంది. ఇది మగవాడికి మాత్రమే పరిమితమని స్త్రీకు హక్కు లేదని ఏలాంటి రుజువు లేదు. దీన్ని మరో కోణంతో కూడా పరిశీలించవచ్చు-

స్త్రీకి అనేక వైపుల నుండి ధనం లభిస్తుంది. వాటిలో మహర్, వార సత్వపు ఆస్తి ఒక్కోసారి అధిక మోతాదులో లభించవచ్చు. కొన్నిసార్లు కానుక, బహుమతి రూపంలో ఆమె వద్ద ధనం చేరవచ్చు. పెద్ద మొత్తంలో నైనా చిన్న మొత్తంలోనైనా ధర్మ సొత్తుకు ఆమె బాధ్యురాలు అయి ఉండ వచ్చు. షరీఅత్ ప్రకారం ఆమె బాధ్యురాలు అయి ఉండవచ్చు. షరీఅత్ ప్రకారం ఆమె తన సొమ్మును అభివృద్ధి చేసుకొనే, మరింత పెంచుకునే హక్కు కలిగి వుంటుంది. ఆమె తన ఇష్టానుసారం దాన్ని ఖర్చు చేసే హక్కును కూడా కలిగి వుంది. అల్లామా ఇబ్నె ఖుదామా హంబలీ (రహ్మాలై) గారు, ఇమామ్ అబూ హనీఫా (రహ్మాలై), ఇమామ్ షాఫయి (ర), ఇబ్నుల్ ముజ్జిర్ (ర), వేరొక ఉల్లేఖనం ప్రకారం ఇమామ్ అహ్మద్ (రహ్మాలై)ల పంథాను ఈ పదాల్లో తెలిపారు.

"తెలివైన స్త్రీకి తన పూర్తి సంపదను వెచ్చించే హక్కు ఉంది. దాన్ని ఆమె మంచి పనుల్లో ఖర్చు పెట్టవచ్చు. ఇంకా జీతాల చెల్లింపు కోసం కూడా వినియోగించవచ్చు.[1]

దీనికి సంబంధించిన మరో విషయం ఏమిటంటే పిన్న వయస్కురాలి సంపద ఆమె సంరక్షకుడి దగ్గర గనక ఉంటే, ఆమె యుక్త వయసుకు చేరుకున్నాక ఆమెకు తెలివి జ్ఞానాలు వచ్చి ఉన్నట్లయితే ఆమెకు పెళ్ళి కాకపోయినాసరే ఆమె సొమ్మును ఆమెకు అప్పగించేయాలి.

ఇదే హజ్రత్ అతా బిన్ అబీ రబాహ్, ఇమామ్ సౌరీ, ఇమామ్ అబూ హనీఫా, ఇమామ్ షాఫియీ, అబూ సౌర్, ఇంకా ఇబ్నుల్ మున్జిర్ ఆచారం (మస్లక్) కూడాను.[2]

## రెండవ ప్రశ్న

షరీఅత్ స్త్రీలపై కూడా ఆర్థిక బాధ్యతను మోపిందా? (ఆమె ఖర్చుల కోసమైనా లేదా పిల్లల ఆలనా పాలనా కోసమైనా సరే)

**జవాబు :** షరీఅత్ సామాన్య పరిస్థితుల్లో స్త్రీపై ఆర్థిక భారాన్ని

---

*1. ఇబ్నె ఖుదామా, అల్ ముగ్నీ : 6/602- తహ్ఖీఖ్ అద్దక్తూర్ అబ్దుల్లాహ్ బిన్ అబ్దుల్ ముహ్సిన్ అత్తుర్కీ, వద్దక్తూర్ అబ్దుల్ ఫత్తాహ్ ముహమ్మద్ అల్ హులువ్, హిజ్రుల్ ఖాహిరా, 1992- ఇమామ్ మాలిక్ (రహ్మాలై) గారికి దీంతో భేదాభిప్రాయం ఉంది. వేరొక ఉల్లేఖనంలో ఇమామ్ అహ్మద్ (రహ్మాలై) 'స్త్రీ, మూడవ వంతు కంటే ఎక్కువ తన సంపదను భర్త అనుమతి లేకుండా ఖర్చు పెట్టకూడదు" అంటారు. ఇబ్నె ఖుదామా (రహ్మాలై) దీని బలహీనతను ఆధారాలతో సహా స్పష్టం చేశారు. చూడండి పేజీ 602- 604*

*2. ఇబ్నె ఖుదామా, అల్ ముగ్నీ 6/201-202. ఇమామ్ మాలిక్ గారి అభిప్రాయం, వేరొక ఉల్లేఖనం ప్రకారం ఇమామ్ అహ్మద్ బిన్ హంబల్ గారి అభిప్రాయం ప్రకారం పెళ్ళికి ముందు ఆమె సొమ్మును ఆమెకు అప్పగించరాదు అన్నది. ఇబ్నె ఖుద్దామా దీన్ని పరిశీలించి దీని బలహీనతను స్పష్టం చేశారు.*

మోపలేదు. ఆమె పుట్టినప్పటి నుంచి యవ్వనం వరకు ఇంకా పెళ్ళి అయ్యేంతవరకు తండ్రే ఆమె అన్న వస్త్రాలకు బాధ్యుడు. పెళ్ళి తర్వాత భర్తపై ఆమె అన్నవస్త్రాల బాధ్యత తప్పనిసరి అవుతుంది. కాని కొన్ని సందర్భాల్లో ఒకానొక దశలో ఆమెపై కూడా ఆర్థిక బాధ్యత వచ్చి పడుతుంది. అలాంటి కొన్ని సందర్భాలు క్రింద ఇవ్వబడ్డాయి.

ఒకవేళ పిల్లల తండ్రి లేకపోతే తల్లిపై వారి అన్నవస్త్రాల బాధ్యత తప్పనిసరి అవుతుంది అని ధర్మవేత్తలు స్పష్టపరిచారు. అల్లామా ఇబ్నె ఖుదామా హంబలీ (రహ్మ) ఇలా అంటున్నారు :

"తల్లి భృతి, సంతానంపై తప్పనిసరి. అలాగే తండ్రి లేకపోతే తల్లిపై సంతానం ఖర్చు భరించటం తప్పనిసరి అవుతుంది. (ఇమామ్ అహ్మద్‌తో పాటు) ఇమామ్ అబూ హనీఫా (రహ్మాలై), ఇమామ్ షాఫియీ (రహ్మాలై)ల అభిప్రాయం కూడా ఇదే."[1]

అలాగే "ఒకవేళ తండ్రి పేదవాడయి సంతానం అన్నవస్త్రాల బాధ్యత భరించలేని వాడయితే తల్లిపై వారి అన్నవస్త్రాలు సమకూర్చే బాధ్యత తప్పనిసరి అవుతుంది. ఒకవేళ ఆ తర్వాత తండ్రి గనక స్థితిమంతుడు అయితే లేదా ఆస్తిపరుడు అయినట్లయితే ఆమె తిరిగి తన డబ్బును తీసుకోలేదు. ఎందుకంటే అది ఆమె తరఫున అప్పుగా ఇచ్చిన సొమ్ము కాదు కాబట్టి. *(అల్ ముగ్నీ- 3/373)*

అలాగే ఈ విషయం కూడా చెప్పబడింది.

"తల్లి నిరుపేద అయి, నానమ్మ గనక స్థితిమంతురాలయితే ఈ

---

*1. ఇబ్నె ఖుదామ, అల్ ముగ్నీ : 11/303. ఇమామ్ మాలిక్ దీంతో విభేదించారు. ఆయన దృష్టిలో అసబాత్‌పై భృతి తప్పనిసరి అవుతుంది. కాని తల్లి 'అసబా' కాదు. అంచేత ఆమెపై పిల్లల భృతిగానీ, అలాగే సంతానంపై ఆమె భృతి గానీ తప్పనిసరి కాదు.*

బాధ్యత ఆమెపై తప్పనిసరి అవుతుంది." *(అల్ ముగ్నీ - 3/376)*

ఈడు వచ్చిన పిల్లలు తమ ఖర్చును భరించలేకపోతున్నట్లయితే వారి గురించి హనఫీల ప్రధాన గ్రంథం ఖుదూరీలో ఇలా చెప్పబడింది. ప్రాజ్ఞతకు చేరుకున్న అమ్మాయి, అబ్బాయి యువ్వనం తర్వాత వికలాంగులుగా మారితే వారి ఖర్చు తల్లిదండ్రులు ఇరువురిపై తప్పనిసరి అవుతుంది. తండ్రిపై రెండింతలు, తల్లిపై ఒక వంతు ఉంటుంది.[1]

అలాగే సోదరుడు గనక పేదవాడైతే అతని అక్కా చెల్లెళ్ళు తమ తాహతుకు అనుగుణంగా అతన్ని ఆదుకోవటం తప్పనిసరి అవుతుంది. సొంత తోబుట్టువుపై 3/5వ వంతు, అలాగే సవతి చెల్లి (సవతి తండ్రి లేదా సవతి తల్లి కుమార్తె)పై 1/5వ వంతు ఉంటుంది.[2]

ఇక్కడ మనోవర్తి విషయంలో ధర్మవేత్తల అభిప్రాయాలు, వారి సాక్ష్యాల గురించి వాదించటం లేదు. కేవలం స్త్రీపై కూడా షరీఅత్ ప్రకారం కుటుంబ సభ్యుల భారం తప్పనిసరి అయ్యే సందర్భాలు ఉన్నాయని చెప్పడం మాత్రమే జరిగింది. అలాంటి పరిస్థితులు గనక ఎదురైతే ఆమెకు ధర్మవేత్తల ప్రోత్సాహం వెన్నంటే ఉంటుంది.

ఈ శాసనపరమైన వాదన సంగతి అలా ఉంచితే కుటుంబ సభ్యుల మధ్యన సహజంగానే ప్రేమానురాగాలు, సహాయ సానుభూతులు ఉంటాయి. అవి వాంఛించే విషయాలు కూడా కొన్ని ఉన్నాయి. ఇస్లాం ఆ భావాలు భావనలను ప్రోత్సహించటంతోపాటు మరింత బలపరుస్తుంది. అయితే ఎలాంటి పరిస్థితుల్లోనూ భర్త ఖర్చు భరించటం భార్యకు

---

1. *హిదాయా మఅ నసబుర్రాయా : 3/407). దారుల్ కుతుబుల్ ఇల్మియ్యహ్, లబ్నాన్ క్రీస్తు శకం 1996.*
2. *హిదాయా మఅ ఫత్‌హుల్ ఖదీరి లి ఇబ్నిల్ హుమాం : 4/381, దారుల్ కుతుబిల్ ఇల్మియ్యహ్. లబ్నాన్ క్రీ.శ. 1995.*

తప్పనిసరి కాదు. కాని స్థితిమంతురాలు అయిన సతి పేదవాడ యిన భర్తకు తోడ్పాటునివ్వటం ఉన్నత నైతికతకు తార్కాణం. షరీఅత్ దీన్ని చాలా గొప్ప పుణ్యప్రదమైన ఆచరణగా పేర్కొంటుంది. హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ మస్ఊద్ (రజి) ఆర్థిక పరిస్థితి బాగుండేది కాదు. ఆయన ఇల్లాలు జైనబ్ (రజి) ఆయన కోసం, ఆమెకు మొదటి భర్త వల్ల కలిగిన తన అనాథ సంతానం కోసం ఖర్చుపెట్టేవారు. ఈ విషయం గురించి ఆమె దైవ ప్రవక్త(స)ను వాకబు చేశారు. "నేను నా భర్త, అలాగే నా పెంపకంలో ఉన్న నా అనాథ సంతానం కోసం ఖర్చు చేయొచ్చా? ఇలా ఖర్చు చేయటం వల్ల నేను నా బాధ్యతను నెరవేర్చినట్లేనా?" అని అడిగారు. అదే పరిస్థితి మరో స్త్రీకూడా ఎదురైంది. "అవును, వారికి రెట్టింపు పుణ్యం లభిస్తుంది. ఒకటి బంధుత్వం పట్ల మంచిగా మెలిగినందుగ్గాను, ఇంకొకటి దానం చేసినందుగ్గాను"[1] అని వారిద్దరి విషయంలో ప్రవక్త(స) బదులిచ్చారు.

హజ్రత్ ఉమ్మె సలమా (ర.అ) దైవప్రవక్త(స)ను "దైవప్రవక్తా(స)! అబూ సలమా మరణించారు కదా. ఆయన (రజి) సంతానాన్ని అలా వదిలి పెట్టలేను. వారు నా పిల్లలే కదా, అంచేత వారి కోసం ఖర్చు చేస్తే నాకు పుణ్యం లభిస్తుందా?" అని అడిగారు.

"అవును వారి కోసం ఖర్చు పెట్టిన దానికీ నీకు తప్పకుండా పుణ్యం లభిస్తుంది?"[2] అని ఆయన(స) వివరించారు.

కొన్ని సందర్భాల్లో కుటుంబ సభ్యులను ఆదుకునే నైతిక బాధ్యత స్త్రీ మోయవలసి వస్తుంది. ఇతర మంచి పనుల్లో డబ్బు ఖర్చు పెట్టేదాని కన్నా భర్త, ఇతర కుటుంబీకుల ఇబ్బందులను దూరం చేయటం ఎక్కువ

---

1. *బుఖారీ, కితాబుజ్జకాత్ బాబుజ్జకాతి అలజ్జౌజి వల్ అయ్‌తామి ఫిల్ హజ్ర్, ముస్లిం, కితాబుజ్జకాత్, బాబు ఫజ్లిన్నఫఖతి వస్సదఖతి అలల్ అఖ్‌రబైన్...*
2. *బుఖారీ, కితాబున్నఫఖాత్, బాబు అలల్ వారిసి మిస్లు జాలిక్*

పుణ్యప్రదమైంది. ఈ తలంపుతో ఒకవేళ స్త్రీ తన ఆర్థిక స్థితిని చక్కబెట్టు కోవటానికి ధర్మ సమ్మతమైన పని ఎంచుకుంటే దాన్ని అధర్మమని తలచకుండా సమ్మతమైన మంచి పనిగా భావించటం జరుగుతుంది.

**మూడవ ప్రశ్న**

ఇంటి ఆర్థిక స్థితి కాస్త సర్దుకుపోతే చక్కబడొచ్చు. చక్కబడుతుంది కూడా. అయినా కేవలం ఉన్నత స్థాయి జీవనం కోసమో, మరింత సంపద సామగ్రిని కూడబెట్టుకోవాలనే ఉద్దేశంతోనో లేదా కేవలం కాలక్షేపం కోసమో స్త్రీలు ఉద్యోగం చేయొచ్చా?

**జవాబు**

ప్రాపంచిక వ్యామోహంలో పడి పోవటాన్ని, దాని కోసమే తమ శక్తియుక్తులను ధారపోయటాన్ని ఇస్లాం తప్పు పడుతుంది. తృప్తితో జీవించమని బోధిస్తుంది. ఒకవేళ ఎవరైనా సమ్మతమైన, ధర్మమైన పనులతో డబ్బు ఆర్జించి సుఖంగా హాయిగా బ్రతకాలనుకుంటే అది కూడా సమంజసమే. కాని అతని ఆర్థిక నిమగ్నతలు దైవాన్ని మరిపించేలా ఆయన దాసుల హక్కులను కొల్లగొట్టే విధంగా ఉండకూడదు. ఐహిక పూజారుల మాదిరిగా ఏమరుపాటు జీవితాన్ని గడపరాదు. ప్రాపంచిక లావాదేవీలు దేవుని సజ్జనులైన దాసులను ఆయన స్మరణ నుంచి, నమాజ్ జకాత్‌ల నుండి ఏమరుపాటుకు గురిచేయవు. వారు అల్లాహ్ భీతితో వణుకుతూ ఉంటారు.

**"వ్యాపారంగానీ, క్రయ విక్రయాలు గానీ, అల్లాహ్ సంస్మరణ విష యంలో నమాజు సంస్థాపనం, జకాత్ ఇవ్వటం వంటి విషయా లలో ఎవరినైతే అశ్రద్ధ వహించేలా చేయవో, అటువంటి వారు**

**ఉదయం, సాయంత్రం ఆయన స్తోత్రం చేస్తారు. హృదయాలు తలక్రిందులై, కనుగుడ్లు తేలిపోయే పరిస్థితి ఏర్పడబోయే రోజును గురించి వారు భయపడుతూ ఉంటారు."** ***(అన్ నూర్ : 37)***

వ్యాపారంతో, క్రయ విక్రయాలతో జీవిత అవసరాలు తీరుతాయి. సంపన్నమైన జీవితం కూడా గడపవచ్చు. వ్యాపారం విషయంలో సాధారణంగా ఈ రెండింటినే పరిగణనలోకి తీసుకోవటం జరుగుతుంది. మగాడితోపాటు ఆడది కూడా ఇస్లామీయ హద్దుల్లో బీదరికానికి బదులు సుఖమైన జీవితం కోసం వర్తకం లేదా మరో సమ్మతమైన పని ఎంచు కుంటే దాన్ని తప్పని చెప్పలేం. షరీఅత్ ఈ వ్యవహారంలో స్త్రీ పురుషుల మధ్య ఎలాంటి తేడా చూపలేదు.

**నాల్గవ ప్రశ్న :**

స్త్రీలు ఇంట్లోనే కష్టపడి చేసుకునే పనిని జీవనోపాధిగా ఎంచుకోవ టానికీ సంరక్షకుడు లేదా భర్త అనుమతి పొందటం తప్పనిసరియేనా?

**జవాబు :**

స్త్రీకి ఇంట్లో ఆర్థిక లావాదేవీలు జరపటానికయినాసరే భర్త అనుమతి పొందటం తప్పనిసరి. ఎందుకంటే షరీఅత్ పరంగా స్త్రీ, అన్న వస్త్రాల బాధ్యత మగాడిపై ఉంది. ఆమెపై ఆర్థిక భారం మోయాల్సిన అవసరం లేదు. మగాడు సతీ సమయాన్ని తీసుకుంటున్నాడు కాబట్టి ఆమె అన్న వస్త్రాల బాధ్యత మగాడిపై తప్పనిసరి. మరో విధంగా చెప్పాలంటే స్త్రీ తన ఆర్థిక భారానికి బదులు భర్త కోసం తన సమయాన్ని కేటాయి స్తుంది.

"మనోవర్తి స్త్రీని ఆపి ఉంచినందుకు గాను ఇచ్చే రొక్కం. ఒక వ్యక్తి మరొకరి మేలు కోసం ఆగి ఉండిపోయినట్లయితే (అంటే తన సమయాన్ని

అతని కోసం కేటాయిస్తున్నట్లయితే) అతని ఖర్చు ఇతనిపై తప్పనిసరి అవుతుంద"ని హిదాయలో ఉంది.

దీనికి ప్రమాణం 'ఖాజీ (పురోహితుడు), ఆమిలె సదఖాత్ (జకాత్ వసూలు చేసే నిర్వాహకుడు)"[1]

ఖాజీ, ఆమిలె సదఖాత్ తమ సమయాన్ని ముస్లింల బాగు కోసం కేటాయిస్తారు. అందుకే వారికి ప్రజా ధనాగారం నుండి జీతం ఇవ్వటం తప్పనిసరి అవుతుంది. అలాగే స్త్రీ ఖర్చు వ్యవహారం కూడాను. ఆమె తన సమయాన్ని భర్త కోసం కేటాయించినప్పుడు అతని అనుమతి లేకుండా మరో పనిని ఎంచుకోరాదు.

## ఐదవ ప్రశ్న

ఉద్యోగ నిమిత్తం పడతికి ఇంటి నుంచి బయటికెళ్ళాల్సి వస్తే ఆమెకు భర్త లేదా సంరక్షకుని అనుమతి తప్పనిసరియేనా? ఇంటి నుంచి బయల్దేరి దూర ప్రాంతమైనా, దగ్గరి ప్రదేశమైనా, పగలయినా, రాత్రయినా సరే ప్రయాణించాల్సి రావటం, ఆమె సంరక్షకుడు పోషణ భారం మోస్తూ ఉన్నా లేకపోయినా సరే, ఇలాంటి పరిస్థితిల్లో షరీఅత్ ఆదేశంలో ఏదైనా మార్పు ఉంటుందా?

**జవాబు :**

స్త్రీకి, జీవనోపాధి కోసం ఇంట్లో చేసే పనికే భర్త అనుమతి తప్పని సరైనప్పుడు ఆ ఉద్దేశంతోనే బయటికి వెళ్ళాలనుకుంటే కచ్చితంగా ముందస్తు అతని అనుమతి పొందాల్సిందే. అతను ఆమెకు అనుమతి ఇవ్వొచ్చు ఇవ్వకపోవచ్చు కూడాను.

---

1. *హిదాయా అవ్వలీన్, కితాబుత్తలాఖ్, బాబున్నఫ్ఖా 417వ పేజీ, రషీదీ పుస్తకశాల– ఢిల్లీ, హిజ్రీ 1350.*

'స్త్రీ అవసరమైన పనుల కోసం బయటికి వెళ్ళాలనుకుంటే ఆమెను ఆపే హక్కు భర్తకు ఉంటుంది' అని అల్లామా ఇబ్నె ఖుదామా హంబలి (రహ్మాలై) అంటున్నారు.

అంతేకాకుండా 'భర్త అనుమతి లేకుండా భార్య గడపదాటడం ధర్మసమ్మతమైంది కాదు.' అని అన్నారు.[1]

ఆమె తన తల్లిదండ్రులను పరామర్శించాలనుకుంటే ఆమెను వారించే హక్కు కూడా చట్టపరంగా అతనికి ఉంది. కాకపోతే ఇది తల్లిదండ్రుల పట్ల సత్ప్రవర్తనకు విరుద్ధం. అంచేత దానికోసం ఆమెకు అనుమతి ఇవ్వాలని అంటున్నారు. అలాగే ఆమెను మస్జిద్‌కు వెళ్ళకుండా ఆపొచ్చు. కానీ దైవప్రవక్త(స) వారిని ఆపవద్దని ఉపదేశించారు.[2]

స్త్రీ ప్రయాణం చేసే విషయంలో మహ్రం పురుషుడు తోడు లేకుండా ఆమె ఒంటరిగా ప్రయాణించటం మంచిది కాదని హదీసులో స్పష్టంగా ఉంది. ఈ ఆదేశం ఎంతదూరం వరకు అనే విషయంలో భిన్న ఉల్లేఖనాలున్నాయి.

"అల్లాహ్‌ను, అంతిమ దినాన్ని విశ్వసించే ఏ స్త్రీ కూడా ఒక పగలు ఒక రేయి వరకు చేసే ప్రయాణంలో మహ్రం పురుషుడు తోడు లేకుండా చేయరాదు.[3] (హజ్రత్ అబూ హురైరా(రజి)– ముస్లిం)

ఈ ఉల్లేఖనంలో మహ్రం పురుషుడు తోడు లేకుంటే ఒక్కరోజు చేసే ప్రయాణం నుంచి వారించటం జరిగింది. ఇతర ఉల్లేఖనాల్లో రెండ్రోజులు, మూడ్రోజుల ప్రయాణం గురించి ప్రస్తావన ఉంది. దీనికి

---

1. *ఇబ్నె ఖుదామా, అల్ ముగ్నీ : 10/224*

2. *ఇబ్నె ఖుదామా, అల్ ముగ్నీ : 10/224*

3. *ముస్లిం, కితాబుల్ హజ్జ్, బాబు సఫరిల్ మరత్‌అతి మఅ మహ్రమి ఇలా హజ్జిన్*

భిన్నంగా హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అబ్బాస్(రజి) కథనంలోనయితే ప్రయాణ దూరం ప్రస్తావనే లేదు.

"ఏ స్త్రీ కూడా మహ్రం వ్యక్తి తోడు లేకుండా ఒంటరిగా ప్రయాణించకూడదు".[1]

హదీసువేత్తలు ఈ ఉల్లేఖనాల్లో ఉన్న వ్యత్యాసాలను అనుసంధానం చేస్తూ, ప్రశ్నించేవారి ప్రశ్నలు వేర్వేరుగా ఉండటమే దీనికి కారణం అన్నారు. దైవప్రవక్త(స)ను ఒకరు మహిళ ఒంటరిగా మూడ్రోజులు ప్రయాణం చేయటం గురించి, మరొకరు రెండ్రోజులు ప్రయాణం గురించి, ఇంకొకరు ఓ రోజు ప్రయాణం గురించి అడిగారు. ఆయన ప్రతిసారి ఆమె మహ్రం పురుషుడు తోడు లేకుండా ప్రయాణించకూడదని అన్నారు. అబూదావూద్ ఉల్లేఖనంలో 'బరీద్' అనే పదం ఉంది. సగం రోజు ప్రయాణించటానికి ఈ పదం వాడుతారు. 'మహ్రం వ్యక్తి తోడు లేకుండా స్త్రీ ఒంటరి ప్రయాణం చేయటం బొత్తిగా సరైంది కాదని' హజ్రత్ అబ్దుల్లాహ్ బిన్ అబ్బాస్(రజి) ఉల్లేఖనం తెలుపుతుంది. ఇలాగే ఇతర ఉల్లేఖనాలను గురించి కూడా ఊహించుకోవచ్చు.[2]

ప్రస్తుతం ప్రయాణం చాలా సులువైపోయింది. దూరాలు తరిగిపొయ్యాయి. రాకపోకలకు వేగవంతమైన వాహనాలున్నాయి. మనిషి గంటల్లో వేల కిలోమీటర్ల దూరం ప్రయాణం చేసి ఒక దేశం నుండి మరో దేశానికి వెళ్ళి పోతున్నాడు. సాంఘిక పరిస్థితులు ప్రయాణాన్ని తప్పని

1. *ఈ ఉల్లేఖనాల కోసం చూడండి. ముస్లిం, కితాబుల్ హజ్జ్ బాబు సఫతిల్ మరఅతిమఅ మహ్రమి ఇలా హజ్జిన్ వగైరా*

2. *నవవీ, షరహ్ ముస్లిం, సంపు 5, భాగం-9, పేజి. 87,88 దారుల్ కుతుబుల్ ఇల్మియ, లబ్నాన్- 1995)*

సరిగా చేశాయి. చిన్నా పెద్దా ప్రయాణాలు మరీ ఎక్కువయ్యాయి. ప్రయాణంలో పరస్త్రీ, పురుషులు కలిసి ప్రయాణించే సమయ సందర్భాలు రావచ్చు. రాకపోవచ్చు కూడాను. ఆమె పీడించబడవచ్చు. ఏది ఏమైనా స్త్రీ ఒంటరి ప్రయాణం ప్రమాదాలు లేకుండా పూర్తిగా సురక్షితమని చెప్పలేం. ముందుజాగ్రత్తగా స్త్రీ, భర్త లేదా మహ్రం వ్యక్తి వెంట ప్రయాణించటం చాలా మంచిది. ఈ విషయాన్ని ఇంకాస్త పరిశీలిం చాల్సిన అవసరం ఉంది.

ఉద్యోగ సమయం గురించి చెప్పాలంటే ఈ రోజుల్లో ఉద్యోగం ఒక్కోసారి డే డ్యూటీ, మరోసారి నైట్ డ్యూటీ చేయాల్సి వస్తుంది. ప్రమాదం రెండింటిలోనూ ఉంది. ఈ విషయంలో ఒకే నియమాన్నంటూ పెట్టలేం. భయభక్తులు కలిగిన స్త్రీ పురుషులు లాభనష్టాలను స్వయంగా నిర్ణయిం చుకోవచ్చు.

సంరక్షకుడు లేదా భర్త ఆమె పోషణ భారం మోస్తున్నా మోయక పోయినా అంగీకారం పొందే విషయంలో ఏదైనా వ్యత్యాసం ఉందా? అనే ప్రశ్నకు జవాబు ఏమిటంటే ఆడదాని పోషణ భారం ఆమె సంరక్షకుడు లేదా భర్తపై ఉంది. ఒకవేళ వారికి ఈ బాధ్యత నెరవేర్చే సమర్థత లేకపోతే లేదా బాధ్యత నుండి తప్పించుకుంటూ ఉంటే అట్టి పరిస్థితిలో ఆదేశాలు వేరుగా ఉన్నాయి.

**ఆరవ ప్రశ్న :**

ఉద్యోగ క్రమంలో స్త్రీల కోసం షరీఅత్ పరిమితులేమిటి?

**జవాబు :**

ఈ క్రమంలో మూడు ముఖ్యమైన నియమాలు ముందుకొస్తాయి.

1. పురుషుడయినా, స్త్రీ అయినా షరీఅత్ పరంగా నిషిద్ధమైన పని చేయకూడదు. బ్యాంకు ఉద్యోగం, మద్యం, జూదం, వ్యాపారం లేదా ఖుర్ఆన్, హదీసుల్లో నిషేధించబడిన ఏ ఇతర పనులయినా చేయకూడదు.
2. స్త్రీకి, ఆమె భర్త లేదా సంరక్షకుని అనుమతి ఉండాలి.
3. స్త్రీ, పురుషుల సమ్మిళిత వాతావరణం ఉండరాదు.

**ఏడవ ప్రశ్న**

కేవలం మహిళలు మాత్రమే పని చేసే చోటు, పని సమయాల్లో మగవారు రాని చోటు (అవి విద్యాలయాలు, లేదా మరే చోటయినా సరే) కానీ నిర్వాహకులు మగవారైతే పరదా ఆదేశాలేంటి?

ఒకవేళ మగ పనివాళ్ళు కూడా పనిచేసే చోట స్త్రీ పనిచేస్తే, అలాంటప్పుడు మహిళా కార్యకర్త పాటించాల్సిన పరదా పరిమితులేమిటి? పెద్ద వయసు, పిన్న వయసు స్త్రీలలో ఏమైనా తేడా ఉంటుందా?

**జవాబు :**

పని స్థలాల్లో మగవారు రాకుండా స్త్రీలు మాత్రమే పనిచేసే చోట అయితే మహిళలు కొలువు చేయవచ్చు. నిర్వాహకులు, బాధ్యులు మగవారయితే షరీఅత్ పరిధిలో ఉంటూ వారితో మాట్లాడొచ్చు. ఇందులో రెండు విషయాలు గమనార్హం. తొలుత స్త్రీ పరదా పరిమితికి సంబంధించింది. రెండోది స్త్రీ పర పురుషుడితో మాట్లాడటం.

(అ) స్త్రీ పరదా విషయానికి వస్తే షరీఅత్ ప్రకారం ఆమె శరీరమంతా కప్పబడి ఉండాలి. ఆమె తన శరీరంలోని ఏ భాగమూ పరాయి మగాడి ముందు విప్పకూడదు.

"స్త్రీ తన్ను గుప్తంగా ఉంచుకోవాలి. ఆమె బయటికి వెళ్ళినప్పుడు షైతాన్ ఆమెను తొంగి చూస్తూ ఉంటాడ"ని ప్రవక్త(స) తెలిపారు.[1] (హ్రజత్ అబ్దుల్లాహ్ బిన్ మస్ఊద్(రజి)

అంటే స్త్రీ పరదాలో ఉండాలనేది అర్థం. ఎప్పుడైతే ఆమె దాన్ని వదిలి బయటికి వస్తుందో అప్పుడు షైతాన్ తన పని ప్రారంభిస్తాడు. అట్టి పరిస్థితిలో స్త్రీ స్వయంగా దారి తప్పిపోయే లేదా ఇంకొకరి తప్పుడు మార్గంలో పడే ప్రమాదం ఉంటుంది.

(ఆ) స్త్రీ ముఖం, చేతులకూడా పరదా ఉందా? లేక వాటిని పరాయివాళ్ళ ముందు విప్పవచ్చా? అనే విషయంలో ధర్మవేత్తల మధ్య భేదాభిప్రాయం ఉంది. అల్లామా ఇబ్నె ఖుదామా హంబలీ (రహ్మలై) దీన్ని రెండు విధాలుగాను చర్చించారు.

స్త్రీ ముఖం, చేతులు కూడా హిజాబ్ పరిమితిలోనే ఉన్నాయని నిరూపించారు.[2] (మీ ఈ రచయిత అభిప్రాయం కూడా ఇదే)

స్త్రీ శరీరమంతా హిజాబ్ పరిధిలోనే ఉన్నప్పుడు అనవసరంగా మగాడు ఆమె శరీరంలోని ఏదైనా భాగాన్ని చూడటం అధర్మమే అవుతుంది.

"పరస్త్రీ పూర్తి శరీరాన్ని ఏ కారణమూ లేకుండా చూడటాన్ని మగాడికి నిషేధించడం జరిగింది" అని అల్లామా ఇబ్నె ఖుదామా హంబలీ (ర) అంటున్నారు.[3]

అలాగే స్త్రీ అవసరమైనప్పుడు తన ముఖం, చేతులను పరాయి మగాడికి చూపించవచ్చు. అతను వాటిని చూడొచ్చు. ఇది నిరాకరించలేని విషయం.

---

1. *తిర్మిజీ, కితాబుర్రిజాల, బాబు : 18*
2. *ఇబ్నె ఖుదామా, అల్ ముగ్నీ : 9/498–500*
3. *ఇబ్నె ఖుదామా, అల్ ముగ్నీ : 9/498*

హనఫీ శాస్త్రంలో దీన్ని సమ్మతిస్తూ ఈ విధంగా ప్రస్తావించటం జరిగింది.

"పరస్త్రీ ముఖం, ఆమె అరచేతులను మనిషి కేవలం అవసరం కొద్ది చూడొచ్చు."[1]

అలాగే యథేచ్ఛగా తిరిగే స్త్రీల గురించి చెప్పబడింది. "యథేచ్ఛగా తిరిగే పరాయి స్త్రీ మొహం చూడటం నిషిద్ధం కాదు. కానీ అనవసరంగా వీక్షించటం అవాంఛనీయం."[2]

అవసరం మేరకు భిన్న సందర్భాల్లో ఆమెను చూడొచ్చు. ఏ యువతినయితే మగాడు పెళ్ళాడాలనుకుంటాడో ఆమెను ఒకసారి వీలైతే చూడాలని హదీసులో చెప్పబడింది.

"మీలో ఏ వ్యక్తి అయినా ఏ యువతితోనైనా బంధం కుదుర్చుకో వాలనుకుంటే, వీలైతే అతను ఆమెను వివాహానికి సంసిద్ధం అయ్యే మేరకు చూసుకోవచ్చ"ని ప్రవక్త(స) తెలిపారు. (హజ్రత్ జాబిర్ (రజి)[3]

హనఫీ శాస్త్రంలో చెప్పబడినట్లుగా దీని అర్థం ముఖం అని తెలుస్తుంది.[4]

దీన్ని ఉలమా (పండితులు) సమ్మతించారు.[5]

2) కొన్ని సమయాల్లో ఆడవాళ్ళకు మణికట్టు కన్నా పైకి చేతులు

---

1. *అద్దారుల్ ముఖ్తార్ మఅ రద్దుల్ ముహ్తార్ : 9/531, దారుల్ కుతుబిల్ ఇల్మియ్యాహ్, లబ్నాన్, క్రీ.శ. 1994*
2. *పైన చెప్పిన ప్రమాణమే. పేజీ. 532*
3. *అబూ దావూద్, కితాబున్నికాహ్, బాబు ఫిర్రజులి యన్జురు ఇలా మర్అతి వ హువ యురీదు తజ్వీజుహా.*
4. *రద్దుల్ ముఖ్తార్ మ'అ దుర్రుల్ ముఖ్తార్ : 9/532*
5. *ఇబ్నె ఖుదామా, అల్ ముగ్నీ : 9/489*

చూయించాల్సిన పరిస్థితులు ఏర్పడతాయి. ఇండ్లల్లో పనిచేసే పని మనిషి, జీతం కోసం వంటావార్పు చేసే మహిళ, చాకలి స్త్రీలు సామాన్యంగా వారి చేతులు మోచేయి వరకు కనబడతాయి. వాటిని చూడాల్సి రావటం అధర్మం కాదు.[1]

3) స్త్రీ శరీరంలోని ఏ భాగానికయినా జబ్బు కలిగితే అవసరార్థం వైద్యుడు దాన్ని చూడొచ్చు. ఇందులో చేయి, ముఖం అంటూ దేన్నీ ప్రత్యేకించి చెప్పలేం.[2]

4) ఒకవేళ స్త్రీ వాణిజ్యం, వర్తకం చేసేది అయితే ఆమెను గుర్తుపట్టి నష్టం వాటిల్లినప్పుడు ఆమెను నష్టపరిహారం అడగటానికి ఆమె ముఖాన్ని పురుషుడు చూడొచ్చు అని ఇబ్నె ఖుదామా పేర్కొన్నారు. ఒక ఉల్లేఖనంలో ఇమామ్ అహ్మద్(ర) దీన్ని అయిష్టపడ్డారనీ ఉంది. లేదా పెద్ద వయస్కురాలయిన స్త్రీల గురించి ఇలా చెప్పారనీ ఉంది.

దీని సంబంధం అనవసరంగా పురుషుడు స్త్రీని చూడటం గురించి ఉందని ఇబ్నె ఖుదామా అంటున్నారు "కానీ అవసరం ఉండి, కామోద్రేకం లేకుండా చూడటంలో తప్పులేదు" అన్నారు.[3]

5) అలాగే పని మనుషులకు పరదా ఆదేశాల్లో మినహాయింపు ఉంది. "సాధారణంగా కనిపించే సేవకురాలి శరీర భాగం చూడటంలో తప్పులేదు."[4]

6) నౌకరు తన యజమానురాలి ముఖం, చేతులు కామోద్రేకం లేకుంటే చూడొచ్చు. ఉద్రేకం ఉంటే గనక చూడటం సమ్మతం కాదు.

---

1. అద్దురుల్ ముఖ్తార్ మఅ రద్దుల్ ముహ్తార్ : 9/531
2. పైన తెలుపబడిన ప్రమాణమే. పేజీ– 533
3. అల్ ముగ్నీ : 9/498
4. అల్ ముగ్నీ : 9/500

ఇమామ్ మాలిక్ (రహ్మలై) ఇంకా ఇమామ్ షాఫియీ (ర) దృష్టిలో బానిస మహ్రం పురుషుల్లోని వాడే.[1]

దీనినిబట్టి స్త్రీ అవసరం మేరకు చేతులు, ముఖం విప్పవచ్చనీ మగాడు వాటిని చూడొచ్చని తెలుస్తుంది. కాకపోతే కామోద్రేకం ఎగిసి పడకుండా, మనిషి తప్పుడు మార్గాన్ని అవలంబించకుండా జాగ్రత్త పడాల్సిన అవసరం ఉంది.

ఆ) ఇప్పుడు పరాయి స్త్రీతో సంభాషించే విషయాన్నే తీసుకుందాం.

హనఫీ ఫికా ప్రకారం ఆడదాని స్వరానిక్కూడా పరదా ఉంది.[2]

సలాం చేయటం సున్నత్. ప్రతిసలాం చేయటం వాజిబ్. అలాగే తుమ్మినాక **అల్‌హమ్దులిల్లాహ్** పలకటం, బదులుగా **యర్హముకల్లాహ్** అనటం సున్నత్.

"పరాయి స్త్రీ ముసలావిడ కాకపోతే మగవాడు మాట్లాడరాదు. ఒకవేళ ఆమె తుమ్మినాక అల్‌హమ్దులిల్లాహ్ అని పలికితే బదులుగా యర్‌హముకల్లాహ్ అనవచ్చు. ప్రతిసలాం బిగ్గరగా అనకూడదు" అని[3] హనఫీ ధర్మవేత్తలు రాశారు.

దీంతోపాటు మరో అభిప్రాయం కూడా ఉంది : అదేమిటంటే 'పర స్త్రీతో సమ్మతమైన మంచి సంభాషణ జరపటంలో తప్పు లేదు."

ఇంకా "నిజానికి అక్కర లేని విషయాల గురించి మగాడు ఆడ వారితో చర్చించటం వల్ల ఏ ఇబ్బందీ లేదు. అవి వ్యర్థ మాటల్లోకి రావు

---

1. *అద్దుర్రుల్ ముక్తార్ మఅ రద్దుల్ ముహ్తార్ : 9/532*
2. *అద్దుర్రుల్ ముక్తార్ మఅ రద్దుల్ ముహ్తార్ : 9/531*
3. *అద్దుర్రుల్ ముక్తార్ మఅ రద్దుల్ ముహ్తార్ : 9/531*

కూడా. వ్యర్థ మాటలంటే తప్పనిసరిగా పాపం కలిగించేవి" అని ఉంది.[1]

నిస్సందేహంగా ఇస్లాం, పరాయి మగాడితో స్త్రీ మాట్లాడటాన్ని ఇష్టపడదు. అయితే అవసరం వచ్చినప్పుడు మాట్లాడటాన్ని సమ్మతిస్తుంది కూడా. స్త్రీ షరీఅత్ ఆదేశాలను తెలుసుకోవటానికి ముఫ్తీ లేదా ఆలిమ్ వద్దకు వెళ్ళొచ్చు. న్యాయస్థానంలోకి వెళ్ళి న్యాయవాది ఎదుట సాక్ష్యం కూడా ఇవ్వొచ్చు. ఈ విషయంలో ప్రవక్త(స) సతీమణులకు వచ్చిన ఖుర్ఆన్ ఆదేశాలు సమాజంలోని స్త్రీలందరికీ వర్తిస్తాయి.

**"తగ్గు స్వరంతో మాట్లాడకండి. ఎందుకంటే దుష్ట మనసు గల వ్యక్తి ఎవడైనా వ్యామోహపడవచ్చు. కాబట్టి స్పష్టంగా, సూటిగా మాట్లాడండి." *(ఖుర్ఆన్ 33: 32)***

ఈ ఆయత్‌లో రెండు విషయాలు చెప్పబడ్డాయి. తొలుత పరాయి మగాడితో మాట్లాడేటప్పుడు స్త్రీ సుతిమెత్తని శైలిలో మాట్లాడకూడదు. దానివల్ల దుష్ట ఆలోచనలు కల్గిన మనిషి మనసులో ఏదైనా తప్పుడు ఆలోచన రావచ్చు. తప్పుడు అభిప్రాయాన్ని కూడా ఏర్పర్చుకోవచ్చు. రెండో విషయం ఏమిటంటే సంభాషణ కూడా మంచిదై ఉండాలి. అంతకుమించి ఉండకూడదు. సంభాషణ విస్తారంగా కూడా ఉండొచ్చు. కాకపోతే అది చెడు దరిదాపులక్కూడా పోకూడదు.

పర స్త్రీని ఏకాంతంలో కలవటం గురించి వారించటం జరిగింది. ఎందుకంటే అలాంటప్పుడు షైతాన్‌కు మోసగించే మార్గం సుగమం అవుతుంది.

"ఏ పురుషుడు కూడా పరస్త్రీతో ఏకాంతంలో ఏమాత్రం ఉండరాదు.

---

1. *ఈ అభిప్రాయాన్ని రాసినాక ఇబ్నె ఆబిదీన్ అంటున్నారు: ఫజ్జాహిరు ఇన్నహు ఖౌలున్ ఆఖరు ఔమహ్మూలున్ అలల్ అజూజి– రద్దుల్ ముహ్తార్ : 9/530, 531*

ఎందుకంటే (అలాంటి సమయంలో) షైతాన్ వారిద్దరితోపాటు మూడో వాడిగా ఉంటాడని ప్రియ ప్రవక్త(స) తెలిపారు. (హజ్రత్ ఉమర్ (రజి)[1]

అలాగే ఏ స్త్రీనయితే వివాహం చేసుకోవాలనుకుంటాడో ఆమెను సైతం పురుషుడు ఏకాంతంలో కలవటం సరైంది కాదు[2]. అందుకే ఆఫీసులోనైనా లేదా మరే చోటయినా పరాయి మగాడితో ఏకాంతంలో కలవటాన్నీ, సంభాషించటాన్నీ వారించటం జరిగింది. దీనివల్ల చెడు దారులు తెరచుకోవచ్చు. కానీ సభ, సమావేశాల్లో పర పురుషులతో మాట్లాడే లేదా అభిప్రాయం వ్యక్తపరిచే అవకాశం ఉంటుంది. పర స్త్రీ వెంట మహ్రం పురుషుడు లేదా నమ్మకస్తుడైన వేరొక మగవాడు లేదా నమ్మకస్తురాలైన మరో స్త్రీ తోడుంటే అది ఏకాంతం కాదని ధర్మవేత్తలు అన్నారు.[3] అంటే ఇలాంటి సమయాల్లో పరాయి వాళ్ళతో మాట్లాడవచ్చు.

ఇ) పడుచు అమ్మాయి, వయసు మీరిన వృద్ధ మహిళ గురించి పరదా ఆదేశాలు ఖుర్ఆన్‌లో భిన్నంగా ఉన్నాయి.

**"యవ్వనం ఉడిగిపోయి, వివాహం పట్ల ఉత్సాహం సన్నగిల్లిన స్త్రీలు తమ దుప్పట్లను తీసివేస్తే, వారు ఏ దోషమూ చేసినట్లు కాదు, అయితే వారు తమ అలంకరణను ప్రదర్శించేవారు కాకూడదు. అయినప్పటికీ, వారు సిగ్గునే పాటిస్తే అది వారికే శ్రేయస్కరమైనది. అల్లాహ్ అన్నీ వింటాడు. అన్నీ తెలిసినవాడు." *(ఖుర్ఆన్ 24: 60)***

---

1. *తిర్మిజీ, కితాబుర్రజాయి, బాబు మాజాఅ ఫీ కరాహియ్యతిద్దుఖూలి అలల్ ముగీబాత్– ముస్నదె అహ్మద్. ముస్నద్ ఉమర్ బిన్ ఖత్తాబ్ (రజి), హదీసు నంబర్ 178*
2. *ఇబ్నె ఖుదామా, అల్ ముగ్నీ : 9/490*
3. *రద్దుల్ ముహ్తార్ మఅ దుర్రుల్ ముఖ్తార్ : 9/530*

'పెళ్ళి చేసుకోవాలనే కోరిక కలగనంత వృద్ధ స్త్రీతో కరచాలనం చేయొచ్చు. అనైతిక చర్య అనే ఆలోచన లేకపోతే ఆమె చేతులను ముట్టుకోవచ్చు. ఆమె వెంట ప్రయాణం కూడా చేయొచ్చు' అని దుర్రె ముఖ్తార్‌లో ఉంది.[1]

ఇక్కడ రెండు మూడు విషయాలపై దృష్టి సారించటం తప్పనిసరి.

1. ధర్మవేత్తల దగ్గర పర పురుషుడి ఎదుట ముఖం, చేతులను చూయించే అవకాశమయితే ఉంటుంది. కాకపోతే అది సమయం సందర్భాలను బట్టి, సంకట పరిస్థితులను బట్టే ఉంటుంది. అంతేకాని దాన్నే సర్వసాధారణం చేసుకోరాదు.
2. ఈ అవకాశంతో అవసరం మేరకు ప్రయోజనం పొందవచ్చు. అంతకంటే ఎక్కువ కాదు. ఏ యువతితోనయితే మగవాడు వివాహం చేసుకోవాలని అనుకుంటాడో ఆమెను చూడవచ్చు. కానీ కరచాలనం చేయరాదు. ఆమెను ముట్టుకోరాదు. తీర్పు, సాక్ష్యం ఇచ్చే విషయంలో కూడా చట్టపరమైన అవసరం మేరకు మాత్రమే ఆమెను చూసే అనుమతి ఉంది. అంతేకానీ ఆమెను తాకరాదు. అందుకే 'అజ్జరూరాతు తతఖద్దరు బిఖద్రిహా" అనే నియమం వెలువడింది.[2]
3. ముఖం, చేతులు చూయించే తీరులో కామోద్రేకం లేదా ఆకర్షణ ఉండకూడదన్న షరతు ఉంది. లేకపోతే దీని అనుజ్ఞ సమసి పోతుంది. నౌకరు తన యజమానురాలిని కూడా కామంతో చూడ లేడు. యజమానురాలు వయసులో ఉంటే ఆమెను చూడరాదు.[3]

---

1. *దుర్రుల్ ముఖ్తార్ మఅ రద్దుల్ ముహ్తార్ : 9/529*
2. *దుర్రుల్ ముఖ్తార్ మఅ రద్దుల్ ముహ్తార్ 9/ 533*
3. *పైన తెలుపబడిన ప్రమాణమే. పేజీ. 532*

సేవకురాలి దేహంలో సామాన్యంగా కానవచ్చే భాగాన్ని చూడటం తప్పు కాదు. కానీ ఒకవేళ పని మనిషి అందగత్తె అయితే ఆమెను చూస్తున్నప్పుడల్లా ఉద్రేకం ఎగిసి పడుతుంటే ఆమెను చూడకుండా ఉండాలి.[1]

'విడాకులు పొందిన స్త్రీతోపాటు కలిసి (ఏకాంతంలో) భోజనం చేయటం సరైంది కాద'ని ఇమాం అహ్మద్ పేర్కొన్నారు.

కనుక ఏ స్త్రీ అయినా సేల్స్‌గర్ల్ ఉద్యోగం చేయటం లేదా అలాంటిదే మరేదయినా ఉద్యోగం చేయటం సరైంది కాదు. ఎందుకంటే ఈ కొలువులో పరదా హద్దులను పాటించటం కష్టసాధ్యం అవుతుంది. ఇందులో పరాయి మగాళ్ళతో క్రమంగా కలవటం వల్ల పరిచయాలు ఓ విధమైన చనువు ఏర్పడుతుంది. వ్యాపార విషయంలో కొనుగోలుదారుని ప్రభావితం చేయటానికి మనోహరమైన, మృదువైన సంభాషణ జరపాల్సి ఉంటుంది. దీన్ని సరైందని చెప్పలేం కదా!

## కొన్ని గమనార్హ కోణాలు

ఈ విషయమంతటినీ నేటి పరిస్థితుల పరిధిలో పరిశీలించాల్సిన అవసరం ఉంది. హదీసులో భార్యను, భర్త ఇంటికి బాధ్యురాలిగా నిర్వాహకురాలిగా చెప్పటం జరిగింది.

"స్త్రీ భర్త ఇంటికీ, అతని పిల్లల ఆలనా పాలనకు బాధ్యురాలు. వారి గురించి ఆమెను ప్రశ్నించటం జరుగుతుంది.[2]

ఇంటిని చక్కబెట్టడం, భర్త సంపదను కాపాడుకోవటం, పిల్లల

1. *ఇబ్నె ఖుదామా, అల్ ముగ్నీ : 9/498-499*
2. *బుఖారీ, కితాబుల్ ఇత్‌ఖ్, బాబు కరాహియ్యతితతావులి అలర్రఖీఖి, ముస్లిం, కితాబుల్ అమారతి, బాబు ఫజీలతిల్ ఇమామిల్ ఆదిల్*

పెంపకం, శిక్షణ లాంటి పనులు ఇందులో ఉన్నాయి. ముందు స్త్రీ వీటికే ప్రాధాన్యం ఇచ్చేది. తర్వాత కొన్ని సమయాల్లో మగాడి ఉపాధిలో సహాయపడేది కూడా. కానీ నేడు పరిస్థితులు పూర్తిగా మారిపోయాయి.

1. ఇంటి వ్యవహారాలు, వంట వార్పు, శుచీ శుభ్రత, పిల్లల ఆలనా పాలనలో స్త్రీకి చాలా సమయం పట్టేది. పేద కుటుంబంలోనయితే రోజంతా పనుల్లోనే గడిచిపోయేది. కానీ నేడు పట్టణ జన జీవనంలో యంత్రాల సౌలభ్యం వచ్చేసింది. వాటి వల్ల ఆమెకు చాలా తక్కువ సమయం మాత్రమే పడుతుంది.

2) పిల్లల ఆలనా పాలనా చూడటానికీ ఆయా, నౌకరు, పని మనిషి ఉంటుంది. మూడేళ్ళ ప్రాయంలోనే పిల్లలు నర్సరీ, తర్వాత స్కూల్, ఆపై కాలేజీకి వెళ్ళిపోతున్నారు. కొన్ని పరిస్థితుల్లోనయితే స్కూలు జీవితం నుండే వారి నివాసం హాస్టళ్ళ పరమై పోతుంది.

3) ఖర్చులు పెరిగిపోయాయి. బతుకు భారమైపోయింది. జీవన ప్రమాణం మారిపోయింది. దాంతో మగవాడి సంపాదన చాలా వరకు సరిపోవట్లేదు. ఇలాంటి పరిస్థితిలో ఆలుమగలు కాస్తంత ఓర్పు, కృతజ్ఞత, సంతృప్తితో మసలుకోమని, భర్త సంపాదనతోనే సర్దుకోమని ఒక మాట చెప్పొచ్చు. లేదంటే స్త్రీ ఉచితమైన ఏదైనా పని చేయగలిగితే చేస్తూ ఉన్నతమైన జీవితం గడపవచ్చు.

4) స్త్రీకి ఏదైనా పని చేసే అనుమతి ఇవ్వాలా లేదా అనేది నిస్సందేహంగా మగాడి హక్కు. కానీ విద్యావంతురాలు అయిన స్త్రీ తన కుటుంబ శ్రేయస్సు కోసం పని చేయగలిగే శక్తి ఉండి, ఆమె వద్ద సమయం కూడా ఉన్నట్లయితే ఆమెను వారించటం చిక్కులకు,

వివాదాలకు తావివ్వటమే అవుతుంది. అందుచేత ఈ సమస్యను చట్టపరమైన దృష్టితో కాకుండా కుటుంబ శ్రేయస్సును దృష్టిలో పెట్టుకొని చూడాలి.[1]



*1. రచయిత మర్కజీ మక్తబా ఇస్లామీ పబ్లిషర్స్ న్యూఢిల్లీ నుండి ప్రచురితమైన "ఇస్లాం కా ఆయిలీ నిజామ్" అనే తన పుస్తకంలో ఈ అంశం గురించి చర్చించారు. "ఔరత్ ఔర్ మయీషత్" వాదనను చూడండి.*